సంస్థాపకులు
కీ॥శే॥ వి. వి. రాఘవయ్య



మేనేజింగ్ ఎడిటర్
శ్రీమతి వి. లీలావతి
రాఘవయ్య

సంపుటి 19 సెప్టెంబర్ 1981 సంచిక 8

# ఇదీ వరస...



ఈ నెల నవలానుబంధం

## ప్రేమకు సంకెళ్ళు

రచన : 'దమయంతి'

ముందు : కుమారి శోభానాయుడు : వెనుక : రతి

జ్యోతి, పి. బి. నెం. 1824. హైదరాబాదు-20

# TO RAIN OR NOT TO RAIN



# తొలిమాట

మహానియంత సరదాలా వర్షాలు! కురవకపోతే గొంతెండి మరణిస్తారు వందలమంది—కురిస్తే కొట్టుకుపోతారు వందలమంది - కొండొకచో ఖాంఛ షంగా, టూకీగా పడేవర్షం హీరోయిన్ ఏడుపులా అర్థంకాకుండా వుంటుంది.

ఐతే రక్తవర్షాలూ కురిశాయి మధ్య 'హైద్రాబాద్'లో .. అజ్ఞానపు టంధయుగం ఎలావుంటుందో తెలీని వారికి ఇదో 'దర్శనం' అలా చులాగ్గా సీసా గాజులు తీసేట్టు ప్రాణాలు తీసేసుకున్నారు ఇరువర్గాల వ్యక్తులు! ఎక్కడేం జరిగినా ఆఖరికి పోయేది సామాన్యుడేకదా. సామాన్యుల కన్నీటి వర్షం....

ఇక హాస్యపు జల్లు నవ్వు (కొంచెం దానికి) లేకుండా, పోటీపడివచ్చాయి కథలు—సువిశాలాంధ్రావనిలో వర్షానికి కరువొస్తే ఎలాగో, హాస్యానికి కరువొచ్చినా అలానే వుంటుందేమో!

లోపల పలకరించండి!




"అగస్టు" నెల సంచికలో పునః ప్రశస్థమైన "హారుద్ర ఖాతాఖూని" లో అక్షరాల హాస్యా సాహిత్యం మా వంటిల్లి పాదినీ కడుపుబ్బ నవ్వించింది ఈ శీర్షికను ఆవేశపెట్టిన ఎడిటర్ గారికివే మా ధన్యవాదాలు. ప్రతి నెలా మీ (మా) చిత్రికను ఇలాగే గర్వాంగ సుందరంగా తీర్చి గుద్దుతారని

శాశిస్తూ.

మీ పాఠక మహాశయుడు;

**పుచ్చా లక్ష్మీనారాయణ వర్చస్వి**
తెనాలి.

రేఖ ముఖచిత్రంతో వెలువడిన జ్యోతి ఆగస్టు సంచిక ఆకర్షణీయంగా వుంది సీరియల్స్ డబ్బు, సౌభాగ్యలత, మీరా ఒకదానికొకటి ప్రత్యేకతను సంతరించుకొని పాఠకుల హృదయాల్లో చెరగని ముద్రను వేస్తూ మున్ముందుకు సాగిపోతున్నాయి. మతిమరుపు దేవుడు, శ్రేయస్సు, జగన్మాత కథలు ఆసక్తిదాయకంగా వున్నాయి. కార్టూన్స్ అన్నీ చక్కని హాస్యాన్ని అందిస్తున్నాయి. పోస్ట్ బాక్స్ నెంబరు సదుపాయం మా పాఠకులకు కల్గించినందుకు సంపాదకులకు మా ధన్యవాదములు.

**వై. హేమసుందర్ రావు**
డోర్నకల్.

అగస్టు నెల అందించిన కథలలో "జగన్మాత" కథ నన్ను కదిలించివేసింది. రుక్మిణి పాత్రను ఈ కథలో చాలా చక్కగా మలిచారు "సౌభాగ్యలత" సీరియల్ పాఠకుల హృదయాలలో అమృతాభిషేకం కురిపిస్తున్నది. ఎంతో ఇంట్రెస్ట్‌గా ఉండి నన్ను ఎంతో ఆకర్షిస్తున్నది మిగతా భాగాలు కూడ ఇంతకన్న మిన్నగా ఆకర్షిస్తాయని నమ్ముతున్నాను. ఈ నెల అందించిన నవల "హర్షబాష్పం" చాలా బాగుంది.

**కందిగట్ల ప్రభాకర్**
జనగామ.

ఆగస్టు సంచికలోని "జగన్మాత" ఎంతో బాగుంది. "సౌభాగ్యలత" సీరియల్ చాలా ఇంట్రెస్ట్‌గా వుంది. ఈ సీరియల్ మళ్ళీ మళ్ళీ చదవాలనిపిస్తోంది లక్ష్మిగారి "మీరా" సీరియల్ కూడ ఎంతో బాగుంది. "మతిమరుపు దేవుడు", "కబంధసూల", "మచ్చలసూటు హీరోలు" కథలు బాగున్నాయి ఇటువంటి మంచిమంచి కథలను అందించిన జ్యోతి సంపాదకులకు మా జోహార్లు.

**సుజాత, జయమణి**
మద్రాసు

## సాహిత్య దీపిక

ఖరగ్‌పూర్ వారు తమ తొలి ప్రయత్నం - వెలువరిస్తున్న కవితా సంకలనానికి నాలుగునుండి పది లైన్లకి మించని



ఇటీవల హైదరాబాదులో శ్రీమతి సి వేదవతి రచించిన 'తెలుగు వెలుగు' గ్రంథావిష్కరణసభ సందర్భం—జస్టిస్ అమరేశ్వరి, శ్రీమతి లక్ష్మీ రఘురామ్, సి. వేదవతి, డా॥ బెజవాడ గోపాలరెడ్డి, డా॥ జి వి సుబ్రమణ్యం, శ్రీ పోతుకూచి, శ్రీ నెమలికంటి రామచంద్రరావు, శ్రీ గుత్తికొండ సుబ్బారావు, కుమారి ఎమ్ ఎల్ శేషాబాయి

కవితలు ఆహ్వానిస్తున్నారు స్వంత పేరు నామా గల కవరులో కవితలని

గుండాన రమారావు
కన్వీనర్ సాహిత్య దీపిక,
బ్లాక్ నం L 24/1 /1, జైహింద్ నగర్,
ఖరగ్‌పూర్—721301
వెస్ట్ బెంగాల్‌కి పంపండి
కవితలు చేరే ఆఖరు తేదీ 25-10-91

## వైకుంఠం (వి)చిత్రాలు

హైదరాబాద్ కళాభవనంలో తెల్లటి గోడలకు తగిలించి వుంటాయి-ముతక నేత నొక్కాలు, కోటులాంటి మందంగా నేసిన నొక్కాలు, మాసిపోయి తగిలించిన పాంట్లు, ఉతికి ఆరేసినట్టు తగిలించిన పాంట్లు, బూట్ల జతలు, తెలంగాణా పల్లె జీవిత ద్వారాలు (కొయ్యతో చేసినవి) కదపకపోయినా ఊగుతూవుండే గొళ్ళాలు-తలుపులకి ఊకతోనో, పొట్టుతోనో, చాలీ చాలని ధాన్యంతోనో వున్న గోతం గోతాలు వీలయినన్నిచోట్ల చిరిగిపోగా, శక్తివంచన లేకుండా పడిన కుట్లు, పాత గుడ్డల మూటలో చెరుగు పాతర-పెట్టబడ్డ నల్ల రేకు బిందె చిల్లుపడిన రాగిబిందె కుంటుపడ్డ జీవితాల్లాంటి ఇత్తడబిందె, మట్టి పాత్ర, గలేబు చాలని దిండు—క్షీణత రాత్రి ఆలోచనా మానవుకి నిద్రలేమితనం చెప్పే నిజం మడతల దిళ్ళు కాదేదీ కవితకనర్హం అనిపించే వస్తు, జీవిత విశేషాల దొంతరలు ఆనాడు 'పాల్ సి జాన్' చూపాడు అంత లోతుగా, పచ్చి నిజంలా వైకుంఠం తన స్కెచ్ పెన్నులతోటీ, బ్రౌన్, డార్క్ చార్కోల్‌తోటి సృష్టించాడు-బొమ్మల్లో వాల్యూమ్, డెప్త్, స్ట్రెంగ్త్ కోసం చూసే ప్రతి కంటికీ అవి నిజాలు

ఈ వస్తుప్రపంచం మధ్యే వైకుంఠం, వైకుంఠం చుట్టూతా వస్తు ప్రపంచం





# హాస్యకథల పోటీ ఫలితాలు

కథల పోటీకి హాస్యసాహితీ న్యాయమూర్తిగా 'తీర్పు' ఇచ్చిన శ్రీ నండూరి పార్థసారధిగారికి ముందుగా కృతజ్ఞతలు తెలియ జేస్తోంది 

న॥పా॥సా గారి తీర్పు ప్రకారం పోటీలో వచ్చిన ఏకథా మొదటి, రెండవ, మూడవబహుమతుల స్థాయికి చేరలేదుగనక ఆ బహుమతులు ఇవ్వడం లేదని తెలియజెయ్యడానికి విచారిస్తున్నాము.

అంచేత
సాధారణంగా ప్రచురించడానికి అర్హత గెలుచుకున్న కథలు = 7,
వాటికి ఒక్కొక్కటికీ రూ॥లు 116 ప్రకటిస్తున్నాము.

అవి :

1 జిందాబాద్—బొమ్మనాపల్లి గణపతిరావు
2. మొదలెక్కడ—యర్రంశెట్టి శాయి
3. ఆపరేషన్ కిచన్—డి. జి. రామారావు
4. భారతదేశంలో భర్త—జి. కుసుమకుమారి
5. భానుమూర్తి నవ్వాడు—గంగుల నరసింహారెడ్డి
6. అమ్మా నాన్నా—చింతపల్లి వెంకటరావు
7. నేనూ నా ప్రేమకథ—మల్లిక్

ఇహ అపరసస మిమ్మల్నా
నందుంప చేయగలవని మొదలెట్టడానికి మేమానందిస్తున్నాము.



# రెండూ వయసులే!



పెమ్మరాజు సంధ్యారాణి

ఒకే వయసువాళ్ళ మధ్య స్నేహం బాగా వృద్ధిచెందుతుంది అని నా గట్టి నమ్మకం

రావుతో పరిచయం కాకుండా వుంటే ఇంకా ఆ నమ్మకంతోనే వుండేవాణ్ణి. కానీ వయసుకీ, స్నేహానికీ ఎటువంటి సంబంధమూ లేదు అనే విషయాన్ని అతన్తో పరిచయమైన ఈ ఆర్నెల్ల కాలం ధృవపరచేసింది.

ఉద్యోగరీత్యా నేను హైదరాబాద్ చేరుకుని ఆర్నెల్లయింది. ఈ ఆర్నెల్లలో కనీసం అరవైమందైనా పరిచయమయ్యారు. కానీ ఎవ్వరితోనూ పెంపొం

## చెత్తకుండీలో జుత్తు

బార్బర్ షాపుల్లో
గొరిగిపారేసిన
బారెడేసి జుట్టును
తననెత్తి కెత్తుకుని
భరిస్తున్న మున్సిపాల్టీ
చెత్తకుండీ
నా కళ్ళక్కనిపిస్తోంది
గారడీ చేసే స్వామిలాగ
నా మనస్సుకు అన్పిస్తోంది
దేన్నైనా ఆరగించే భూతంలాగ.

భాగవతుల సుబ్రహ్మణ్యం

దని స్నేహం రావుతోనే పెంపొందింది.

అతను నాకన్నా ఏడెనిమిదేళ్ళు పెద్దవాడు!

వయసులోనేకాదు, వుద్యోగంలో కూడా అతను నాపైమెట్టు మీదే వున్నాడు! కాకపోతే ఇద్దరం వుండడం ఒకే ఏరియాలో.

ఆఫీస్‌లోనే కాకుండా వచ్చేప్పుడు, వెళ్ళేప్పుడుకూడా కొంత సమయాన్ని కల్సివెచ్చించాల్సి వచ్చేది.

సక్రమంగానే పరిచయం పెరిగి ఒకళ్ళ ఇంటికి మరొకళ్ళ రాకపోకలు మొదలయ్యాయి.

వంటరిగాణ్ణి-సంసారం అతనికి ఏమైనా రిలీఫ్‌ని ఇచ్చేదో లేదోగాని, వాళ్ళింటికి వెళ్ళడం నాకుమాత్రం 'హోమ్‌సిక్'ని దూరం చేసేది.

శారద అన్నివిధాలా అతనికి తగ్గ భార్య!

వాళ్ళిద్దరి ఆప్యాయత, నా హైద్రాబాద్ జీవితానికి జీవాన్ని ఇచ్చింది. వీళ్ళతో పరిచయం కాకుండావుంటే వుద్యోగంలో చేరిన మర్నాటినించే మావూరివేపు ట్రాన్స్‌ఫర్ చేయించుకోవడానికి ప్రయత్నించే వాణ్ణేమో!

ఆఫీస్‌కి శలవు వచ్చిందంటే వాళ్ళింటికి భోజనానికి వెళ్ళక తప్పదు.

భోజనం. కబుర్లు పేకాట.... సినిమా....

ఇట్టే గడిచిపోతుంది రోజు!

అలవాటు ప్రకారం ఆ ఆదివారం నాడూ పదిగంటలకల్లా బయల్దేరాను రావు వాళ్ళింటికి.

దార్లో చలపతి నిలబెట్టేశాడు.

డిగ్రీ అయింతర్వాత అదే అతన్ని కలవడం!

ఆకబుర్లు, ఈకబుర్లు

గంట గడిచిపోయింది...!

పదకొండు!

ఆఫీస్‌కైనా ఆలశ్యంగా వెళ్ళగాని, మా ఇంటికి వచ్చేప్పుడు మాత్రం ఆలశ్యంగా రావద్దనే వార్నింగ్‌ని ఎప్పుడో ఇచ్చాడు! ఇంకా తనెందుకు రాలేదా అని వాళ్ళిద్దరూ ఎదురు చూస్తుంటారు ఇంక ఆలశ్యం చెయ్యడం బావుండదు.

మళ్ళీ కలుస్తానని, చలపతి అడ్రస్ తీసుకుని రావు ఇంటివేపు బయల్దేరాను.

ఇవాళ అతని చేతిలో చివాట్లు తప్పవు.

ఆలోచనల్తో సంబంధంలేకుండా అడుగులు గబగబా పడసాగాయ్.

రావు ఇంటికి చేరుకోవడానికి మరో ఐదునిముషాలు పట్టాయ్.

వాళ్ళింటికి వేళ్ళాడుతున్న తాళాన్ని చూడగానే గుండె ఝల్లుమంది—

కొంపదీసి వీళ్ళు నాకోసమే వెళ్ళలేదు కదా?

రకరకాల ఆలోచనల్తో వెనుదిరిగాను

"ఏయ్ రఘూ...!" వెనకనించీ వచ్చిన కేకతో అడుగు ముందుకు పడలేదు.

చటుక్కున వెనక్కి తిరిగాను.

వాళ్ళ పక్క వాటాలోంచీ బయట

కొచ్చాడు రావ్

అదేమిటి! సాధారణంగా అతను వాళ్ళింటికి వెళ్ళడే! అదీ ఆదివారంనాడు-ఈ సమయానికి . !

ఆశ్చర్యాన్నించీ తేరుకోకముందే అతను నన్ను చేరుకున్నాడు.

"ఇదిగో తాళం చెవులు నువ్వెళ్ళి లోపలకూర్చో . నేనూ, శారదా మరో పది నిముషాల్లో వస్తాం .." తాళం చెవులు చేతిలో పెట్టాడు.

"శారదగారు కూడా వాళ్ళింట్లోనే వున్నారా...." ఆ విషయం అర్థమైపోతూనేవున్నా, ఎందుకక్కడ వున్నారు అని అడగలేక అలా అడిగాను.

"మా ఇంటాయన కూతురు కమలని నువ్వు చూసే వుంటావ్... ఆ అమ్మాయిని చూట్టానికి ఇవాళ ఎవరోవచ్చారు..."

"అయితే మీరెందుకు ..."

"ఈ విషయాల్లో ఆయనకి ఎక్కువ అనుభవంలేదు. అందుకని నన్ను రమ్మన్నాడు..మేమో పదినిముషాల్లో వచ్చేస్తాము. నువ్వింట్లోకి వెళ్ళు.. ." ఎంత త్వరగా వచ్చాడో అంత త్వరగానూ తిరిగి పక్క వాటాలోకి వెళ్ళిపోయాడు.

ఇక చేసేదిలేక నెమ్మదిగా రావ్ ఇంటి తాళం తీసి, లోపల పడకుర్చీలో కూలబడ్డాను.

ఈ పెళ్ళిచూపుల తతంగంమీద నాకే మాత్రం మంచి అభిప్రాయంలేదు

ఎవరెవరో వస్తారు నఖశిఖ పర్యంతం ఆ ఆడపిల్లని పరీక్షిస్తారు అన్నిటినీ భరిస్తూ ప్రాణంలేని వస్తువులా పడుండాల్సిందే ఆడపిల్ల! ఆమె అభిప్రాయాల్ని గమనించే మనిషే వుండడు—చివరికి ఆ పిల్ల తండ్రి కూడా!

ఇంత తతంగం నడిచిన తర్వాతకూడా ముఖ్యమైన బేరం కుదరక పోయిందా.... గోవింద ...!

మళ్ళీ ఆ ఆడపిల్ల మరికొన్నితమంది పరీక్షలకు గురికావల్సిందే!

కవితకి కార్టూన్ :




అరితేరిన సాలీడు అల్లుకుపోయిన
ఆకాశం గూడులో
చిక్కుబడి నెత్తురోడుస్తున్న
పురుగులాంటి సూరీడు

-దేవిప్రియ

పెళ్ళి చూపులు అయిందగ్గర్నించీ అతన్నే తన భర్తగా వూహించుకుని ఎన్నో కలలు కంటారు ఎంతోమంది ఆడపిల్లలు. తీరా అతను చేసుకోనన్నేసరికి ఒలవంతాన ఆ కలలకి అనకట్టవేయాలి. తిరిగి మరో పెళ్ళికొడుకు....మరికొన్ని కలలు...

ఇలా ఆడపిల్లల్ని హింసించే మగవాళ్ళంటే వళ్ళుమంట నాకు ఆ విషయం రావ్ కీ తెల్సు. తెలిసికూడా నేను వచ్చింతర్వాతకూడా రావ్ అలా పెళ్ళి చూపుల కార్యక్రమంలో మునిగిపోవడం ఏం నచ్చలేదు నాకు.

మరొకళ్ళూ మరొకళ్ళూ అయితే నేనంతగా పట్టించుకునేవాణ్ణిగాను నాకు ఆత్మీయుడు, ఆదర్శ భావాలుగల వ్యక్తి అయిన రావ్ కూడా వాళ్ళింటాయనలాంటి వాళ్ళని అలా ప్రోత్సహించడమేమిటి? ఈ విషయంలో నా నిరసనని రావ్ రాగానే చెప్పేయాలి....

## వాతావరణ సూచన

ప్రజావాణి !
వాతావరణ హెచ్చరిక !
పీడిత ప్రజాహృదయ సంద్రంలో
నిన్నఏర్పడిన చైతన్య
వాయుగుండం
నేడు సమరానికి చేరువగా
కేంద్రీకృతమై ఉంది
రాగల కొద్దికాలంలో
దాడులతో కూడిన వాయువు
వీస్తుంది
పోటెక్కిన జనవాహిని
'తూర్పు' తీరం తాకుతుంది.

పి. గణేశ్ బాబు

"పవిత్రోయ్... ..మనుషు లొచ్చింది కూడా గమనించకుండా తెగ ఆలోచించేస్తున్నావ్....!" నా ఆలోచనల్లో రావ్ వచ్చింది కూడా గమనించలేదు.

"అన్నయ్యగారికి మనమీద కోపం వచ్చి వుంటుంది" వెనకే వచ్చిన రావ్ భార్య శారద చిన్నగా నవ్వింది

"అవును! వచ్చింది.... మీరు కూడా ఇలాంటి వాటిని ప్రోత్సహించడం నాకేమీ బావుండ లేదండీ...." శారద వంక చూస్తూ అన్నాను. ఎంత అణచుకోవాలని ప్రయత్నించినా కోపం గొంతులోంచి బయట పడనే పడింది.

ఆ తర్వాత ఆ విషయం మీద వాళ్ళకి, నాకు మధ్య ఎంతో వివాదం నడిచింది. మామూలుకి భిన్నంగా ఆ రోజు కొంత చికాకుగానే గడిచింది నాకు.

సరిగ్గా ఈ సంఘటన జరిగిన నెలరోజుల కసుకుంటాను—లంచవర్లో టీ తాగు తున్నప్పుడు "రేపాదివారం పది గంటలకల్లా నువ్వు మా ఇంటికి వస్తున్నావ్" రావ్ మాటలు వింతగా అని పించాయి నాకు.

"ప్రతి ఆదివారం మీ ఇంటికి రావడం మామూలేగా! ఇవాళ మళ్ళీ ప్రత్యేకంగా చెప్పడం ఎందుకు?" అడిగాను అర్థంగాక.

"ఈసారి నువ్వు వచ్చేది ప్రత్యేకమైన పనిమీదాలోనే . .!"

"అంటే . ?"

"నువ్వు మా ఇంటికి వస్తుంటే నిన్నెన్నో సార్లు చూసాడు మా ఇంటాయన. వాళ్ళమ్మాయి కమలకి నీ సంబంధమైతే బావుంటుందని అతని ఆశ. అందుకని నిన్నెలాగైనా వప్పించి రేపాదివారం పెళ్ళిచూపులు ఏర్పాటు చేయమని ఆయన ఎంతగానో ప్రాధేయ పడ్డాడు ... ..."

రావ్ మాటలకి కొరడాతో వీపున కొట్టినట్లు పులిక్కిపడ్డాను.

వళ్ళు మండిపోయింది.

నాకీ పెళ్ళి చూపుల భాగోతం అంటే చికాకనే విషయం అతనికి తెల్సు. పైగా వాళ్ళింటాయన కూతురు పెళ్ళి చూపుల విషయంలోనే ఒకసారి మా ఇద్దరి మధ్యా స్పర్థవచ్చింది. ఈ విషయాలన్నీ మర్చిపోయి రావ్ నన్ను పెళ్ళిచూపులకు పిలవడం ఆశ్చర్యంతోపాటు కోపాన్నీ కల్గించింది. వెంటనే ఆ కోపాన్ని మాటల ద్వారా వెళ్ళ గక్కేశాను.

"నాకీ పెళ్ళిచూపులంటే సదభిప్రాయం లేదనే విషయం నీకు తెల్సు. అయినా నువ్వు నన్నిలా పిలవడంలో అర్థంలేదు..."

నా మాటలు రావ్‌ని బాధించినట్టున్నాయి. అతను మారు మాట్లాడలేదు.

రావే బిల్ చెల్లించాడు. ఇద్దరం రోడ్ మీద కొచ్చాం. నెమ్మదిగా ఆఫీస్‌వేపు నడక సాగించాం.

అతను మౌనం ...

నాకూ కల్పించుకుని మాట్లాడాలని పించలేదు.

నిశ్శబ్దం .. ...

రోడ్ రకరకాల శబ్దాలతో మారు

మోగుతున్నా మా ఇద్దరి మధ్యా నిశ్శబ్దం... ....

దూరం తరిగిపోతోంది........

ఆ నిశ్శబ్దం మా ఇద్దరి మధ్యా దూరాన్ని పెంచుతోందేమో ననిపించింది హఠాత్తుగా.

వెంటనే "రావ్ ..." పలకరించాను.

రావ్ జవాబియ్యలేదు.

మళ్ళీ పిల్చాను.

జవాబు లేదు.

దాంతో అతనికి కోపం వచ్చిందేమోననే అనుమానం వచ్చి మొహంకేసి చూశాను.

అపక్కనేవున్న బస్‌స్టాప్ కేసి చూస్తున్నాడు. నాకళ్ళూ అటు తిరిగాయి.

అక్కడో పదహారేళ్ళ పడుచు నిలబడుంది, అప్పుడే విచ్చుకుంటున్న పువ్వులా వున్న ఆమె అందం ఎవరినయినా ఆకర్షించి తీరుతుంది. తను తొడుక్కున్న పంజాబీడ్రస్‌లో ఆమె అందం మరింత విజృంభించింది. చేతిలోని పుస్తకాల్ని తన అందాలు ఎవరికీ కనబడ కూడదన్నట్టు గుండెలకి అడ్డం పెట్టుకుంది.

"ఆ అమ్మాయి చాలా బావుంది కదూ...." అన్నానప్రయత్నంగా.

దానికి జవాబియ్యలేదు రావ్.

"ఇట్లాంటి ఆడపిల్లల్ని చూస్తే ఎవరికయినా మతిపోతుంది. తప్పదు...." మళ్ళీ నేనే అన్నాను.

అదీ విన్నట్టులేదు రావ్.

ఆ అమ్మాయి వంకేచూస్తూ "మరో నాల్గయిదేళ్ళుపోతే మా పెద్దమ్మాయీ ఇలానే స్కూల్‌కి బయల్దేరుతుందేమో..." అన్నాడు.

ఉలిక్కిపడ్డాను.

ఇద్దరం మగవాళ్ళమే—కాకపోతే వయసులో కొద్దిగా తేడా అంతే!

ఆ అమ్మాయిలోని యవ్వనాన్ని నేను వెదుకుతుంటే, కూతురితో పోల్చుకుంటూ అతను చూస్తున్నాడు.

నా ఆలోచన నాకే సిగ్గనిపించింది.

రావ్ నామాటల్ని వినలేదు కాబట్టి సరిపోయింది. వింటే ఎంత నీచంగా అనుకునేవాడో....

వెంటనే నా అంతరాత్మ అందుకు ఎదురు తిరిగింది—

ఎందుకు అసహ్యించుకుంటాడు? అతనికి పెరుగుతున్న ఆడపిల్లలున్నారు కాబట్టి అందరి ఆడపిల్లల్లోనూ అతను కూతుళ్ళనే చూసుకోగలడు —మరి నేనో... .... పెళ్ళి కావలసిన వాణ్ణి. అందుకే కనిపించిన ప్రతి ఆడపిల్లలోనూ అందాలు వెదుక్కుంటున్నాను అందులో తప్పేంలేదు. తప్పు వయసుదే!

వెంటనే రావ్ వాళ్ళింటాయన గుర్తొచ్చారు. ఆయన కూతురుకి పెళ్ళి చేయాలి. అందుకనే కాస్త యోగ్యతున్న యువకుడు కనిపించగానే అల్లుడవుతాడేమోననే ఆశతో పెళ్ళిచూపులకు పిలుస్తున్నాడు-అందులో అతనిదీ తప్పులేదు.

"రావ్....రేపాదివారం నువ్వు చెప్పినట్టుగానే పెళ్ళిచూపులకు వస్తున్నాను. ఆ విషయాన్ని ఆయనికి తెలియజెయ్...." అన్నాను వెంటనే.

ఇందాక పెళ్ళిచూపుల పేరెత్తగానే అంతగా చికాకు పడిపోయిన నేనేనా వెంటనే ఇలామాట్లాడింది అనిపించినట్టుంది అతనికి.

నా మోహంకేసి చూశాడు.

రక్కున తలకిందకి దించాను.

"నేనేదో బాధపడతానని నువ్వు రావద్దు...." ఆఫీస్ మెట్లెక్కుతూ అన్నాడు రావ్.

"నీకోసం వస్తానని నేనేమీ అనడంలేదు, మనస్ఫూర్తిగా రావాలనిపించే చెప్తున్నాను. కాకపోతే హడావిడిపడి పెద్దగా ఏర్పాట్లు మాత్రం చేయవద్దని చెప్పు.... మళ్ళీ కలుస్తా...." గబగబా నా సీట్ వేపు అడుగులువేశాను. ■



## సమస్త చందాదారులారా ఏకం కండు !

మీ ప్రేయసి, ప్రియుడు, భార్య, బ్రహ్మచర్యం - మెస్ భోజనం కన్నా అందమైనది జ్యోతి అని మీ అభిప్రాయం  ఒకే....ఒకే....ఒకే....

కొత్తదంపతుల ప్రేమకానుకలా వెరైటీ ఆఫరొకటిస్తున్నాం మీకు ...

 సంవత్సర చందా దీపావళి ప్రత్యేక సంచిక, రిజిష్టర్డ్ పోష్టుతో

సహా నేమో 60 రూ॥లండీ : "అంతేనా" అనకండి, మీకు మొత్తం గమ్మత్తుగా 40 రూ॥లకే వచ్చేస్తుంది—ఇహమీదే ఆలస్యం.

---

(స) కుటుంబరం వుగారూ, గుర్నాధంగారూ, సుబ్బారావుగారూ, షేష్టారూ, గోపీ, సీతా, బాబీ....

 ని మీరు ప్రేమించ (కొన) డానికి అనేక కారణాలుండచ్చు.

"ఉష్ణ" సర్వత్రః అనీ—మీరు మరచిన తియ్యటి గుర్తులని మీ పెదవుల మీదకి తెప్పించే కమ్మటి సీరియల్ నవలలు వున్నాయి. అందమైన జలతారు జీవితాలదారి కోడూరి కౌసల్యాదేవి, సైంటిఫిక్ రీజన్స్‌తో మీ బుర్ర పెంచే యండమూరి వీరేంద్రనాధ్  ఇంకేం....

రెండోది—మనచుట్టూ చిన్న ప్రపంచం దాటి విజ్ఞాన పరిణతి చెప్పే శీర్షికలు .

మరోటేమో—ఎన్నెన్నో మీ ఇష్టాల మేరకి కధలు—ఎంత తింటే అంత తీపి-ఇంకా ఏవంటే - జోకులు, మినీకధలు, గేయాలూ, ఒకటేమిటీ? టోకున ఇన్ని కారణాలుగా మీరు చందాదారులుగా చేరబోతున్నారు....

అంచేత అయ్యా

దీపావళి ప్రత్యేక సంచికతో సహా సంవత్సర చందా 60 రూ॥లు. ఐతే 40 రూ॥లకే లభిస్తుంది జ్యోతి ఆణిముత్యం నెలనెలా.



# సెలక్షన్

గుడిమెట్ల గోపాలకృష్ణ

"ఒక్కగానొక్క పోస్టు నీకిచ్చేనే అనుకో."

"అనుకోవడమేమిటిసార్. మీరు నాకివ్వక తప్పదు. పరిస్థితి భయంకరంగా వుంది."

"సరే ఇస్తానే అనుకో, నాకేం లాభం?"

"...... ."

"మాట్లాడవేం. ఇప్పుడీపోస్టుకి ఎంత డిమేండో నీకు తెలీదు. ఏదో కులం వాడివని నీకిద్దామని పిలిపించేను కానీ"

"మీ రెలాంటి ప్రతిఫలం కోరుతారో నా పరిధిలో వుంటే మీ కోర్కె తీర్చడానికి శాయశక్తులా ప్రయత్నిస్తాను"

"నాకో అమ్మాయి పెళ్ళికుంది. దాన్ని నువ్వు చేసుకోవాలి"

"అంతేనా. ఇంకా ఏమో అనుకున్నాను"

"ఒప్పుకున్నట్టేగా"

"ఏం సార్ నేను బేరం పెడతాననుకున్నారా?"

"నే నడిగిన దానికిది జవాబు కాదు"

"అలాగే నా కుద్యోగం ముఖ్యం. ఎలాగూ ఓ అమ్మాయి మెళ్ళో తాళి కట్టాలి కదా"

"అయితే నువ్వు కొన్నింటికి మాటివ్వాలి"

"అడగండి"

మా అమ్మాయిని పెళ్ళాడిన తర్వాత ఏదో వుద్యోగం కోసం చేసుకున్నాను అన్నట్టుగా కాకుండా భార్యగా చూడాలి"

"అలాగే"

"నేను కానీ కట్నం ఇవ్వను"

"నేను తీసుకోను"

"మీరిద్దరూ అన్యోన్యంగా వుండాలి"

"అలాగే"

"మా అమ్మాయిని నెలకోసారైనా మా ఇంటికి తెస్తుండాలి"

"అలాగే"

"మా అమ్మాయికి విహార యాత్రలంటే ఇష్టం. ప్రతి వీకెండ్‌కి ఎక్కడికైనా తీసుకెళుతుండాలి"

"అలాగే"

"మా అమ్మాయి హిందీ, ఇంగ్లీష్ మూవీస్ ఎక్కువ చూస్తూంటుంది"

"అలాగే"

"మా అమ్మాయి కాశ్మీర్ సిల్కు, గాజీ సిల్కు, పట్టుచీరలు తప్ప మరేం కట్టదు."

"అందంగా వుండడానికి మంచి బట్టలు కావాలికదా"

"మా అమ్మాయి నవల్సు ఎక్కువ చదువుతుంటుంది కొంటూ వుండాలి. ఇంట్లోనే చిన్న లైబ్రరీ ఏర్పాటు చేసుకోవాలి"

"అవును పుస్తక ప్రపంచానికి రాస్తాను"

"మా అమ్మాయికి ఫొటోగ్రఫీ హాబీ"

"నాక్కూడా ఆ టేస్టు వుంది"

"మా అమ్మాయికి ఫ్రెండ్స్ ఎక్కువ. వాళ్ళు వస్తుంటారు ఏమీ అనుకోకూడదు"

"అలాగే"

"ఇక నువ్వు వెళ్ళొచ్చు"

"ఏం సార్, ఎప్పుడొచ్చి జాయిన్ కావాలి?"

"నువ్వు సెలెక్ట్ కాలేదు"

"ఏంటిసార్ అన్నీ ఒప్పుకున్నానుగా"

"అందుకే నువ్వు సెలక్ట్ కాలేదు" ●

యండమూరి
వీరేంద్రనాథ్

సీరియల్

# డబ్బు డబ్బు

అడ్వర్టయిజ్‌మెంట్లు చూసి 'అప్లయి' చేసిన గాంధీ లక్ష్మి ఇచ్చిన ధైర్యంతో రాజారామమోహనరావుని కలిశాడు - ఇద్దరికీ తెలివి తేటల యుద్ధమే అయింది! తెలివి తేటలని 'కేష్' చేసుకోడం కోసం తెగించిన గాంధీ, ఆయనతో పందెంకట్టి 'అగ్రిమెంట్'కు దిగాడు—౬ సంవత్సరాల్లో 50 లక్షలు సంపాదించి హారికనీ గెలవడానికి—

చేతిలో 10 పైసలతో పాకదాటి వచ్చాడు........

—ఇక చదవండి—

# 6

మనిషి జీవితపు రకరకాల అను భవాల్లా రంగురంగుల లైట్లు వెలిగి ఆరి పోతున్నాయి. అర్ధ నగ్నపు స్త్రీ బొమ్మ రోడుమీద పోయే వాళ్ళని లోపలికి ఆహ్వాని స్తోంది. చుట్టూ తడిక ప్రహారీగోడలా కట్టబడి వుంది. కొంత మంది జనం గుంపులుగా, కొంత మంది ఒంటరిగా మొత్తంమీద అందరూ హుషారుగా లోపలికి వెళుతున్నారు. లోపలనుంచి వస్తూన్న వాళ్ళు మాత్రం దిగులుగా వస్తున్నారు. అయినా చీకట్లో అది అంతగా కనిపించలేదు.

గాంధీ అప్రయత్నంగా అటువైపు చూసి మెయిన్ గేటు దగ్గిర నిలబడ్డ కుర్ర వాడిని, తన ఈడు వాడినే గమనించి, "ఒరేయ్-లేవరా" అని కేక వేసేడు.

'లేవరా' తలతిప్పి గాంధీని చూసి 'హాయ్' అన్నాడు.

లేవరా అసలుపేరు ఎవరికీ జ్ఞాపకంలేదు. కాలేజీలో చదువుకొనే రోజుల్లో అతగాడికి అసలు లెక్కలు వచ్చేవి కావు. "లెక్కలు రాని వాడు" అని వాణ్ణి మాస్టారు 'లెరావా' అని ఒకసారి తిట్టాడు. అదే లేవరాగా స్థిరపడింది.

"ఇక్కడున్నావేమిటి" అని గాంధీ అడిగాడు.

"ఇదే బిజినెస్ చూసుకుంటున్నాను" అన్నాడు. ఈ అమ్యూజ్‌మెంట్ పార్క్ నాదే."

అప్పుడు చూసేడు గాంధీ అతడిని పరీక్షగా! చదువుకొనే రోజుల్లోకన్నా కొంచం కండ పట్టాడు. అసలే నల్లటి వాడు-ఇప్పుడు బుగ్గలు కొంచం మెరుస్తున్నాయి. అత డేసుకున్న సిల్కుచొక్కా - నేసిన కూలీలకిచ్చిన కూలీనిసైతం జూదంలో ఓడ గొట్టి తిరగలాక్కున్నట్టు గర్వంతో మెరుస్తూంది. బుగ్గన బిగించిన కిళ్ళీ జీవితం అనుభ విస్తున్న తృప్తినీ, జేబులోంచి కనబడ్తూన్నవోటు జీవితం సమకూర్చుకున్న స్థిరత్వాన్నీ చూపెడుతున్నాయ్.

"ఏమిటీ బిజినెస్?" గాంధీ అడిగేడు.

"అమ్యూజ్ మెంట్ పార్క్ అంటే తెలీదా?"

—నా జీవితంలో అమ్యూజ్‌మెంట్ లేదు అనుకున్నాడు గాంధీ.

"లోపలికి వెళదాం రా"

ఇద్దరూ లోపలికి నడిచేరు. పెద్ద పెద్ద కొట్లలా వున్నాయి ఇరువైపులా. మార్గా నికి కర్ర అడుగా కట్టబడివుంది. ఒకో్క కొట్టులో ఒకో్క ఆట ఆడబడ్తూంది. ఒకదాంట్లో కేరంబోర్డు లాటి గళ్ళబోర్డు వుంది. పింగ్ పాంగ్ బంతులు మూడటిని, దూరం నుండి ప్రేక్షకుల్లో ఒకరు విసురుతున్నారు. బోర్డులో ఆరు రంగులు వున్నాయి. ఎరుపు, పచ్చ, తెలుపు, పసుపు, నీలం. దాదాపు అరవై చిన్న గళ్ళు.











ఒక్కొక్కరూ ఇష్టమైన రంగుమీద పందెం కాస్తున్నారు. పింగ్ వాంగ్ బంతులు మూడు ఏదే రంగుల్లో పడితే ఆ రంగు మీద కాసిన వాళ్ళకి రెట్టింపు డబ్బు ఇస్తారు. ఆరు రంగులూ; మూడు బంతులు కాబట్టి-గెలవటం ఓడిపోవటం-ఛాన్సులు సగం సగం....

"అదృష్టంమీద ఆధారపడి వుంటుంది" అన్నాడు లేవరా "... మా అదృష్టం బాగోలేకపోతే ఇంత మంది జనాలకి ఒక్కోరోజు డబ్బంతా పంచి ఇవ్వవలసి వుంటుంది."

గెలవటానికీ ఓడి పోవటానికీ మధ్య ఛాన్స్ సగం సగం అయితే ఈ లెక్కలు రానివాడి వంట్లోకి కండా, వంటి మీదకి సిల్కు చొక్కా ఎలా వచ్చాయి? ఇందులో ఏదో ట్రిక్కుంది. గాంధీ లెక్కల బుర్ర చురుగ్గా ఆలోచించింది.

తన దగ్గర ఆరు రూపాయలున్నాయనుకుందాం. ఆరు రంగులమీద ఒక్కో రూపాయి కాస్తే....ఏమవుతుంది-బంతులుపడిన మూడు రంగులకీ రెండేసి రూపాయల చొప్పున తన ఆరు రూపాయలూ తిరిగి తనకి వస్తాయి. ఉహు... అదికాదు ఆలోచించవలసిన పద్ధతి. ఇంకేదో మెలికవుంది. అతడు బోర్డువైపు దృష్టి సారించేడు.

ఈసారి విసిరిన బంతులు మూడు ఎరుపు రంగులో పడ్డాయి. గాంధీ లేవరా వైపు తిరిగి, 'ఇపుడేమవుతుంది' అని అడిగాడు. "ఎరుపురంగుమీద రూపాయి కాసిన వాడికి నాలుగు రూపాయాలు ఇస్తాం."

గాంధీ కి ట్రిక్ అర్థమైంది, ఒక రంగులో బంతులు పడినకొద్దీ మేనేజ్‌మెంట్‌కి లాభం. అతడు ఆడుతున్న జనంవైపు జాలిగా చూసేడు. తామెలా వంచింపబడుతున్నామో తెలియకుండా, అమాయకంగా ధనవంతులకి తమ శ్రమని దోచిపెడుతున్న శ్రామికుల్లా వున్నారు అక్కడి జనం. పట్టుదలగా ఆడుతున్నారు. అప్పుడప్పుడు గెలుస్తున్నారు. ఎక్కువసార్లు ఓడిపోతున్నారు.

"కంగ్రాచ్యులేషన్స్" అన్నాడు గాంధీ. ఇద్దరూ ఆఫీసు గదివైపు నడుస్తున్నారు.

"ఎందుకు"

"నిన్ను లెక్కలు రానివాడు అన్న వాళ్ళందరూ తెలివి లేని వాళ్ళు"

లేరావా నవ్వి "ఎందుకలా అనుకుంటున్నావ్" అని అడిగేడు. గాంధీ తను కనుక్కున్నది చెప్పాడు. ఇద్దరూ గదిలోకి ప్రవేశించారు. లక్షలు సంపాదించే వారందరి ఆఫీసుల్లాగే అదీ చాలా చిన్నగా వుంది. విరగటానికి సిద్ధంగా వున్న టేబుల్., చెక్క కుర్చీలూ....

"ఇదంతా అదృష్టంమీద ఆధారపడి లేదంటావ్" అన్నాడు లెక్కలు రానివాడు. లేదన్నాడు గాంధీ దృఢంగా.

"బొమ్మా బొరుసుమీద నీ అభిప్రాయం ఏమిటి-నువ్వు లెక్కల దిట్టవికదా· కనీసం దాంట్లోనైన ఛాన్సు సగం సగం అని వప్పుకొంటావా"

గాంధీ తలూపి, "పదిసార్లు నాణెం ఎగరేస్తే బొమ్మ పడటానికీ, బొరుసు పడటానికి గల ఛాన్సు చెరిఅయిదు సార్లు-ఎవరైనా వప్పుకొంటారు" అన్నాడు.

"నీ దగ్గిరెంత డబ్బుంది?" అని అడిగేడు లేవరా.

"పది పైసలు"

"పైసా పైసా పందెంవేసి మనిద్దరం బొమ్మా బొరుసూ ఆడదామా."

"పది పైసల్తోనా?" ఆశ్చర్య పోయేడు గాంధీ.

"నా యీ రాబడి అంతా అదృష్టంమీదే వచ్చిందనే నేను అనుకొంటున్నాను. నువ్వేమో ఏవేవో లెక్కలుకట్టి ఇది అదృష్టం కాదనీ, ట్రిక్ అనీ అంటున్నావ్. నీ లెక్క ప్రకారం బొమ్మా బొరుసూలో ఏ ట్రిక్కూ వుండదుకదా. నే నెలాగూ లెక్కలురాని వాణ్ణి కాబట్టి, నా తెలివి తక్కువ తనాన్ని మరోసారి నిరూపించుకొందామను కొంటున్నాను.

గాంధీ అహం దెబ్బతిన్నది. కోపం, రోషం నిండిన కంఠంతో 'సరే' అన్నాడు. ఇద్దరూ ఆడటం మొదలు పెట్టారు. ముందు లేవరా ఎగరేసేడు బిళ్ళని. బొమ్మ అన్నాడు గాంధీ. బిళ్ళ గాలిలో ఎగిరి బల్ల మీద పడ్తూంటే ఊపిరి బిగపట్టాడు గాంధీ. చిన్న చప్పుడుతో అది బల్లమీదపడి, గిర్రున తిరిగి, ఒకవైపుకి పడిపోయింది.

బొమ్మ!

గాంధీ సంతృప్తిగా ఊపిరి పీల్చుకున్నాడు. లేవరా గాంధీకి పైసా ఇచ్చాడు. అలా వరుసగా అయిసార్లు గాంధీ గెలిచాడు. పెట్టుబడి పదిపైసలు. పదిహేను పైసలు అయినాయి. తరవాత పందెం పైసానుంచి అయిదు పైసలకి పెంచారు. మొదటి సారి ఓడిపోయాడు. తరువాత వరుసగా పదిసార్లు గెలిచాడు. లేవరా చేబులు తడుపుకొని, పక్కకి వంగి, పక్కరూమ్‌లోవున్న ముసలాయన్తో "మేనేజర్‌గారూ-ఒ రూపాయి చిల్లర పంపండి" అన్నాడు.

తరువాత మళ్ళీ ఆట ప్రారంభం అయింది· కొన్ని గెలుపులూ కొన్ని ఓటములూ తరువాత అరగంటలో 'లేవరా' ఆ రూపాయలు కూడా పోగొట్టుకున్నాడు. లేవరా మేనేజర్ దగ్గిర ఇంకో రూపాయి అడిగి తీసుకున్నాడు. ఈ సారి విజయలక్ష్మి అతడివైపు మొగ్గింది. గంట తిరిగేసరికి గాంధీజేబు ఖాళీ అయింది. ఆఖరి అయిదు పైసలు ఇచ్చేస్తూ "ఇక నేను మానేస్తున్నాను" అన్నాడు.

"ఏం"

"నా దగ్గిర ఇక డబ్బులు లేవు" అంటూ లేచేడు. ఇద్దరూ బైటకొచ్చారు. గాంధీ మనసంతా విషాదంతో నిండిపోయింది. అయిదు సంవత్సరాల్లో పది పైసల్ని యాభై లక్షలు చేద్దామనుకున్నాడు. మొదటిరోజే పదిపైసలూ పోగొట్టుకున్నాడు. మెయిన్ గేటు దగ్గిర 'లేవరా' నిలబడిపోయాడు. 'వెళ్ళొస్తాను' అన్నాడు గాంధీ. లేవరా తలూపి, అతడు




వెళ్ళబోతూంటే నెమ్మదిగా 'గాంధీ' అన్నాడు. గాంధీ ఆగేడు.

"బిజినెస్‌కి మరీ ఎక్కువ తెలివితేటలు అక్కర్లేదు. ఉన్నా ప్రమాదమే, అన్నిటి కన్నా ముఖ్యమైనది అదృష్టం."

—నే నొప్పుకోను అనుకున్నాడు గాంధీ-పైకి అనటానికి ఆసమయం అతడిదికాదు. ఓటమివైపు వున్నాడతడు. తలవంచుకొని నెమ్మదిగా చీకటిలోకి నడిచేడు అతడు....

......................

నిర్మానుష్యమైన వీధులగుండా నడిచి తిరిగి మెయిన్ రోడ్‌కి వచ్చాడు అతను. బాగా చీకటి పడింది. పదిపైసలు పోయాయని తెలిస్తే లక్ష్మి పెట్టబోయే చివాట్లు-చేసే ఎగతాళీ జ్ఞాపకంవచ్చి, ఇంటికి వెళ్ళటానికి భయపడుతున్నాడు. పుస్తకాల షాపు ముందు నించి వెళుతుంటే లోపల్నించి పాకెట్ పట్టుకొని వస్తూన్న హారిక కనబడింది. అతడు ఆమెకు కనబడకుండా వుండాలని చప్పున కారువెనక్కి వెళ్ళాడు కానీ, అంతలోనే ఆమె అతడిని చూసి 'హలో' అంది. ఎందుకో తెలీదుగానీ, గాంధీ కొద్దిగా సిగ్గుపడి 'హలో' అన్నాడు.

'ఎక్కడికి వెళుతున్నారు'

'ఇంటికి'

'రండి. కొంచం టీ తాగివెళదాం'

అతడు విస్మయంతో తలెత్తి ఆమెవైపు చూసి, ఆమె అది చాలా క్యాజువల్‌గా అడిగిందనీ, ఆ సొసైటీలో అది చాలా కామన్ అనీ గ్రహించాడు 'వద్దు వెళతాను' అన్నాడు.

'పర్లేదు రండి' అని కార్ డోర్ తెరిచింది. డ్రైవరు ముందుకు పోనిచ్చేడు.

పదినిముషాల తరువాత వాళ్ళు ఒక ఖరీదైన రెస్టారెంట్‌లో వున్నారు.

"ఎంత వరకూ వచ్చింది మీ పందెం" అడిగిందామె. గాంధీ తలెత్తాడు. ఆమె అంది. "ఆరోజు ఇంటర్వ్యూకివచ్చి పందెం కట్టేరుగా మానాన్నగారితో-నాకీ ఉద్యోగం ఎందుకు? అయిదు సంవత్సరాల్లో యాభై లక్షలు సంపాదిస్తానూ—అని."

—అంటే ఆ ముసలాయన కూతురికి పందెంగురించి పూర్తిగా చెప్పలేదన్నమాట అనుకున్నాడు గాంధీ. అతడికి ఆ విషయం ఎంతో తెరిపి ఇచ్చినట్టయింది. అంత వరకూ దగ్గరున్న బిడియం పోయింది. అయినా తనే తెలివి తక్కువవాడు. ఏ తండ్రయినా 'నిన్ను యాభై లక్షలకి పందెం పెట్టానమ్మాయ్' అని ఎలా చెప్తాడు? ఒకవేళ అదృష్ట వశాత్తూ తనాడబ్బు సంపాదిస్తే, ఆరోజు ఆయన మొహం చూడాలి. కూతురికి ఏమని చెప్పుకుంటాడు. ఈ అమ్మాయి వప్పుకొంటుందా! అతడికి నవ్వొచ్చింది. యాభై లక్షలంటూ సంపాదించాలేగానీ— ఆ తరువాత వప్పుకోవటం—వప్పుకోకపోవటం తనమీద ఆధారపడి వుంటుంది. అతడు తలెత్తి చూసేడు. ఏదో ఆలోచిస్తూ హారిక టీ తాగుతూంది.

పైనుంచి లైటు వెలుతురు విశ్లేషణంచెంది ఆమె ఎర్రటి పెదవిని మరింత ఎర్రగా ప్రకాశిస్తూంది. ఆమె మొహంలో అందంకన్నా నమ్రతతో కూడిన హుందాతనంవుంది. ఆమె కళ్ళలో పదహారేళ్ళవయసు తెచ్చే మెరుపుకన్నా విజ్ఞానం ఎక్కువ వుంది. ఆమె పెదాలమీద అస్పష్టమైన నవ్వు కదలటం చూసి, 'ఎందుకు నవ్వుతున్నారు' అని అడిగాడు. ఆలోచనల్లోంచి కదిలి, 'ఏంలేదు' అంది తిరిగినవ్వి.

"ఏమిటవి" విషయం మారుస్తూ అడిగేడు.

"పుస్తకాలు" అంది. "అక్షిబ్రా...."

కొంచంసేపు నిశ్శబ్దం. "మీ పందెం ఎంతవరకూ వచ్చింది?" తిరిగి ప్రశ్నించింది.

"నేనూ, నా పార్ట్నరూ చెరి అయిదు పైసలూ నష్టపోయేం ఇప్పటికి" అన్నాడు చాలా బింకంగా"....అయినా ఏ బిజినెస్సయినా మొదట్లో ఆ మాత్రం నష్టం వస్తుందనుకొంటాను."

"మీ పార్ట్నరెవరు?" ఉత్సుకతతో ప్రశ్నించింది. "ఓ బిచ్చకత్తె" అన్నాడు "గుడి మెట్ల మీద వుంటుంది."

"చాలా ఇంటరెస్టింగ్ పర్సనాలిటీ మీరు" అందామె. అతను మాట్లాడలేదు. స్టీరియో స్పీకర్ లోంచి సంతూర్ తీవెల ప్రకంపనాల సంగీతం సముద్రం మీద వర్షం నీరు పడుతున్నట్టు శబ్దం.

"పదిపైసలు ఎలా నష్టపోయేరు మీరు?" అడిగింది. అతను పూర్తిగా చెప్పాడు. అందులో సిగ్గు పడే విషయం ఏమీ లేదు. అంతాచెప్పి చివరికి అన్నాడు" . ..బిజినెస్‌లో అంతా అదృష్టమేనట. తెలివి తేటలు అవసరం లేదట. ఆ విషయం మాత్రం నేను వప్పుకోను అతడు గెలిస్తే గెలిచి వుండొచ్చుగాక. అది వేరే సంగతి .... .

"రంగు గళ్ళల్లో బంతులు విసిరే వాళ్ళనుంచి డబ్బులు సంపాదించేవాడు అంత సులభంగా అదృష్టాన్ని నమ్ముకొన్నాడంటే నేనూ నమ్మను" అందామె సాలోచనగా. ఒక్కక్షణం ఎవరి ఆలోచనల్లో వారున్నారు. ఆమెకేదో అర్థమైనట్టు నవ్వింది.

"ఒకనాణేన్ని పదిసార్లు విసిరితే అయిదుసార్లు బొమ్మా—అయిదుసార్లు బొరుసు పడుతుందని థియరీ ఆఫ్ ప్రొబబులిటీ చెబుతుంది. అవునా"

తలూపేడు గాంధీ.

"అయితే మొదటిసారి బొమ్మ—రెండోసారి బొరుసూ పడక్కర్లేదు—వరుసగా మొదట అయిదుసార్లూ బొమ్మా—తరువాత అయిదుసార్లూ బొరుసూ కూడా పడవచ్చు ఆ థియరీ చెప్పేదల్లా ఏమిటంటే, ఇదిసగం, అదిసగం పడుతుందనే!"

దానికి తలూపేడు గాంధీ.

"వరుసగా అలా బొమ్మపడి మీరు గెలుస్తూంటే అతను లోపల మేనేజరు దగ్గిర్నించి

అందాల సుందరి శ్రీదేవి...అపురూపమైన ఆమె అందానికి తోడ్పడేది లక్స్.

ఎంత సున్నితమైన అందం శ్రీదేవిది!
మురిపించేసే ఆమె చర్మ సౌందర్యం
ఓహ్! ఆమె ఆ అందానికి మెరుగులు
దిద్దుకునేందుకు తోడ్పడేది లక్స్
అని ఆమె భావన

"నా చర్మ సౌందర్యానికి ఆ మృదుత్వం, ఆ అందం అందించేందుకు నాకు లక్స్ కావాలి" అంటుంది శ్రీదేవి






**శుద్ధమైన, సౌమ్యమైన లక్స్—**
**సినిమా తారలకు సౌందర్యాన్నిచ్చే సబ్బు**

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి విశిష్ట ఉత్పాదన

HTS HLL-5601

డబ్బు తెప్పించాడు. కానీ తరువాత ఓరుసు పడటం ప్రారంభించిన దగ్గిర్నుంచీ, పెట్టుబడి పెట్టటానికి మీదగ్గిర డబ్బులులేవు. అమ్యూజ్‌మెంట్ పార్క్ థియరీ అదే! ఏస్టేజిలో అయినా మీరే మానెయ్యాలి తప్ప; పార్కు మేనేజిమెంటు ఆడుతూనే వుంటుంది. మీరెపుడు ఆట మానేస్తారు? పూర్తిగా డబ్బులయిపోయ్యాకా ..." ఆమె నవ్వింది. "ఆస్టేజి ఎప్పుడో ఒకప్పుడు రాక తప్పదు. అప్పటి వరకూ అతడు ఆడుతునే వుంటాడు." ఆమె బిల్ తాలూకు డబ్బులు ట్రేలో పడేస్తూ అన్నది...." అందుకే అమ్యూజ్‌మెంట్ పార్క్‌లో అందరూ డబ్బు పోగొట్టుకుంటారు. ఆ లెక్కలు రానివాడు ప్రజల్ని మోసం చెయ్యటానికి చాలా తెలివిగా థియరీ ఆఫ్ ప్రోబబులిటీని వాడుకుంటున్నారు. మీరూ వెళ్ళి అదే వలలో చిక్కుకున్నారు."

అతడు అప్రతిభుడయ్యాడు. ఆమె లేస్తూ అన్నది.

"బిజినెస్‌లో అవతలివాడి శక్తి సామర్థ్యాల్ని ఎప్పుడూ తక్కువ అంచనా వెయ్యొద్దు...."

అంతేకాదు — తనకన్నా ఆర్థికంగా బలమైనవాణ్ణి కూడా బిజినెస్‌లో ఎదుర్కోకూడదు—అనుకొన్నాడు గాంధీ. ఇద్దరూ బైటకొచ్చారు.

"........ఎక్కడ మీ ఇల్లు?"

అతడు కంగారుపడి, "ఇక్కడే, చాలా దగ్గిర. నడిచి వెళతాను" అన్నాడు. అతడి ఇంటి దగ్గిరికి కారురాదు. అంతా బురద.

ఆమె కార్లో కూర్చొని "మరి తిరిగి మీరు పెట్టుబడి ఎలా సంపాదిస్తారు?" అని అడిగింది.

"అవునెలా సంపాదించాలి?"

"నన్నడుగుతారేమిటి?" అందామె ఫక్కున నవ్వి. "యాభై లక్షలు సంపాదించవలసినవాళ్ళు." అంతలో అతడి మొహం ఎర్రబడటం చూసి, నొచ్చుకుంటూ, 'సారీ' అన్నది.

"ఇట్సాల్ రైట్"

"నేనైతే సలహా చెప్పలేనుగానీ, ఇంగ్లీషు సామెత ఒకటి గుర్తొస్తోంది ..."

"ఏమిటి?"

డ్రైవరు కారు ముందుకు కదిలిస్తూంటే ఆమె అన్నది-"పారేసినచోటే డబ్బులు వెతుక్కోవాలి...." అతడు అలాగే నిశ్చలంగా నిలబడి వున్నాడు, కారు చీకట్లో అదృశ్యమయింది.

# 7

అతను తిరిగి అమ్యూజ్‌మెంట్ పార్క్‌కి వెళ్ళేసరికి తొమ్మిదిన్నర అవుతూంది. దాదాపు కట్టేస్తున్నారు. శేవరా అతడిని చూసి ఆశ్చర్యపోయి, 'ఏం ఇలా వచ్చేవ్' అన్నాడు.

"ఊరికినే. ఏం తోచక"

"మళ్ళీ డబ్బులు తెచ్చావా" అని అడిగేడు. ఓడిపోయినవాళ్ళు ఇంటికెళ్ళి డబ్బు తీసుకొచ్చి మరీ పోగొట్టుకోవటం అతడికి తెలుసు.

"లేదు. తేలేదు"

"మరి-?" అర్థంకానట్టు అడిగేడు శేవరా.

"నీతో ఓడిపోయేక-నా బుర్ర పూర్వంలా పనిచేయటంలేదని ఎందుకో అనుమానం




అవి ఎక్కువ కావాలి"

రాత్రి పదిన్నర అవుతూ వుండగా గాంధి ఆ పార్కులోంచి బైటకొస్తున్నాడు. పదిపైసల్ని ఒక్కరోజులో వెయ్యిరెట్లు చేసి, ఆ డబ్బుతో ఇంటికి బయల్దేరాడు. అతడి చేతిలో వందనోటు నలుగుతూంది.*

# 8

అతను ఆశించినంత ఆనందం లక్ష్మి మొహంలో కనబడలేదు' 'కంగ్రాచ్యులేషన్స్' అని వూరుకొంది. అతను ఆశ్చర్యంతో "అదేమిటి-పది పైసల్ని ఇరవై చేస్తానని వెళ్ళిన నేను వంద రూపాయల్తో తిరిగొస్తే అలా మామూలుగా కంగ్రాచ్యులేషన్స్ చెప్తా వేమిటి?" అన్నాడు.

ఆమె మాట్లాడలేదు.

"-చెప్పవేం? నీకు ఆనందంగా లేదూ? ఇది మన మొట్టమొదట గెలుపు"

ఆమె నెమ్మదిగా తలెత్తి చూసింది. "ఇది గెలుపేనంటావా"

అతను షాక్ తిన్నట్టు చూసి, 'కాదా' అన్నాడు. నిజానికి ఆమె ప్రశ్న అతడికి అర్థం కాలేదు ఆమె అన్నది-"నీకన్నా తెలివితక్కువవాణ్ణి నీ తెలివితేటల్తో మోసం చెయ్యటమే బిజినెస్సా?"

"ఇందులో మోసం ప్రసక్తి ఏముంది? ఇద్దరం ఆడేం. అతను ఓడిపోయేడు...."

"కానీ నువ్వు డబ్బు న్యాయబద్ధంగా సంపాదిస్తానన్నావ్"

"అలాగే సంపాదించాను. నేనేమీ హత్యలు, దొంగతనాలూ చెయ్యలేదే-"

"నాణెం ఎగరేసి-బొమ్మ పడుతుందా-బొరుసు పడుతుందా అని బెట్ చేయటం

* డబ్బు టు ది పవర్ ఆఫ్ డబ్బు చదవనివారితో పాఠకులు ఈ ఆట ఆడి పందెం గెల్చుకోవచ్చు, గన్‌షాట్‌గా మీరే గెలుస్తారు.

న్యాయబద్ధం కాదే-...."

"న్యాయబద్ధమే. కాదని ఎవరన్నారు?"

ఆమెలో ఒక్కసారి కోపం కట్టలు తెంచుకొంది. "కాంట్రాక్ట్ ఆక్ట్ తెలియనట్టు నటించకు గాంధీ! **Sec. 30 of The CONTRACT ACT lays down that all agreements by way of WAGER ARE VOID"** ఆమె మొహం అప్పటికే ఎర్రబడింది. "....వేగరింగ్ కాంట్రాక్ట్ అంటే కూడా ఏమిటో చెప్పాలా...."

గాంధీ నవ్వేడు. ఆమె కోపాన్ని చూసి అతడికి ముచ్చటేసింది. "నువ్వు 'లా' చదవ లేదుకదా. నీకీ విషయం ఎలా తెలిసింది?"

"నా ప్రశ్నకి సమాధానం అదికాదు . ."

"చెప్తా విను. ఇండియాలో వెగరింగ్ కాంట్రాక్టు ఇల్లీగల్ కాదు **VOID** అంతే! సెక్షన్ 294-**A** పీనల్ కోడ్ ప్రకారం కొన్ని మాత్రమే శిక్షార్హమైనవి. టాస్ వేసి బెట్ కట్టటం **Illegal** కాదు. 'న్యాయబద్ధం' అన్న పదానికి రెండు అర్థాలున్నాయి. **Legal** అనేది ఒకటి-**FORCEABLE BY LAW** అన్నది మరోటి. వెంట్రుకవాసంత ఈ తేడాని నేను జాగ్రత్తగా ఉపయోగించుకొని, ఈ వందా 'లీగల్'గా సంపాదించాను" అన్నాడు. **"....ILLEGAL IS DIFFERENT FROM IMMORAL** అని న్యాయశాస్త్రమే చెబుతూంది. ఇందులో చీటింగ్ ఏమీ లేదు. చీటింగ్ ఇల్లీగల్ కాబట్టి... "

ఆమె మాట్లాడలేదు. మనసులో మాత్రం అనుకొంది. "ఆత్మవంచన చేసుకొంటున్నావ్ గాంధీ. నిజంగా...."

o o o o

ఆ మరుసటి సాయంత్రం అతడు పత్రికాఫీసుకు వెళ్ళి అడ్వర్టయిజ్‌మెంట్ మేనేజర్ని కలుసుకున్నాడు. నేనొక ప్రకటన ఇవ్వదల్చుకొన్నాను. మొదటి పేజీలో...."

"ఎంత స్పేస్ కావాలి"

"ఆరు సెంటీమీటర్లు, డబుల్ కాలమ్"

"-ఎన్నిరోజులపాటు"

"అయిదురోజులు వరుసగా"

మేనేజరు లెక్కకట్టి ఎంతవుతుందీ చెప్పాడు. "-అంతలేదు నాదగ్గిర" అని, తన దగ్గిరున్న వందరూపాయలకు సరిపడా ఎంత స్పేస్ వస్తుందో అంతలో ఇమ్మన్నాడు.

"సరే.... మేటరు వ్రాసి ఇవ్వండి." గాంధీ వ్రాసేడు. నాలుగే వాక్యాలు. చిన్న హెడ్డింగు. వ్రాసి, కాగితాన్ని మేనేజరుముందుకు తోసేడు. చాలా మామూలుగా కాగితాన్ని అందుకొని మేనేజరు చదివేడు. చదువుతూంటే అతడి ముఖంలో మార్పొచ్చింది. ఇంటరెస్టింగ్‌గా గాంధీవైపు చూసేడు. "-ఏమిటిది?"

"ప్రకటన"

"అదికాదు నేను అడుగుతున్నది. దీని అర్థం"

"పత్రికల్లో ప్రకటన ఇచ్చేటప్పుడు దాని అర్థం చెప్పాలా?"

అతడు దెబ్బతిని "అక్కర్లేదు. కానీ చాలా ఇంటరెస్టింగ్‌గా వుంది ప్రకటన. అందుకే అడిగేను" అన్నాడు. గాంధీ డబ్బుకట్టి రసీదు తీసుకొని లేచి వస్తూంటే అతను మళ్ళీ పిలిచేడు. "-మీరు ఒప్పుకొంటే నేను మీతో చేరతాను" అన్నాడు. గాంధీకి అర్థం కాలేదు. 'ఎలా'.

"మీరు అయిదురోజులపాటు వరుసగా ఈ ప్రకటన ఇవ్వండి. తక్కువపడిన డబ్బు నేను అప్పుగా ఇస్తాను. ఈ ప్రకటన ద్వారా మీరు సంపాదించినదాంట్లో నాకు పది శాతం




కమీషన్ ఇవ్వండి." ఇంత మంచి ఆఫర్ వస్తుందనుకోలేదు గాంధీ. ఆనందంతో చప్పున 'సరే' అనబోయేడు. అంతలో గుర్తొచ్చాయి లక్ష్మి చెప్పిన మాటలు. " . తొందరపడి బిజినెస్‌లో ఎవరికీ మాట ఇవ్వకు ."

అతడు ఆగిపోయాడు. "చూద్దాంలెండి· ముందు ఈ ప్రకటనమీద వచ్చే ఉత్తరాలు చూసుకొని తరువాత ఆలోచిద్దాం" అని కదిలేడు

.........

ఆ మరుసటి రోజు పేపర్లో కుడివైపు మూల చిన్న అక్షరాల్తో వచ్చింది ఆప్రకటన.

**డబ్బుకోసమా మీ అన్వేషణ?**

**చాలా కొద్ది పెట్టుబడితోకానీ-అసలు పెట్టుబడి లేకుండాగానీ లక్షలు లక్షలు సంపాదించవచ్చు......కొద్దిగా తెలివితేటలుంటే చాలు. మీ వెనుక మేం వున్నాం. వెంటనే సంప్రదించండి...డాక్సు నెం. 1806.**

ఈ ప్రకటన పడిన సాయంత్రం గాంధీ పాకముందు పోలీస్ వ్యాన్ వచ్చి ఆగింది.

o o o o

ఇన్‌స్పెక్టర్ అవినాష్‌కి నలభై ఏళ్ళు. జీవితంపట్ల ఒక నిర్దుష్టమైన అభిప్రాయం కలవాడు అతడు. చాలా చిన్న స్థితిలోంచి పైకి వచ్చాడు. చిన్నతనంలోనే అతడి తల్లి దండ్రులు చనిపోయేరు-స్కాలర్‌షిప్‌లమీద బి. ఏ. పాసయ్యేడు. ఆ తరువాత సబ్ ఇన్‌స్పెక్టర్‌గా చేరి, ప్రమోషన్‌మీద ఇన్‌స్పెక్టరయ్యాడు. పోలీస్ డిపార్ట్‌మెంట్ మిగతా వాళ్ళలా కాకుండా చాలా నిజాయితీ ఆఫీసర్‌గా అతడు పేరు తెచ్చుకున్నాడు అతడి భార్య అతడి ఇరవై ఆరోఏట చచ్చిపోయింది. తరువాత తిరిగి వివాహం చేసుకోలేదు. తన సమయాన్నంతా పనిలోనే కేంద్రీకరించాడు. అతడి నిజాయితీ, పనిచేసే విధానం చాలామంది పై అధికారులకి సమస్య అయింది. చాలాసార్లు బదిలీ చేయబడ్డాడు. ఒక చోటనుంచి ఒకచోటకి. ఏదైనా క్లిష్టమైన కేసు నిర్వర్తించవలసి వస్తే అవినాష్‌ని అక్కడికి ట్రాన్స్‌ఫర్ చేయటం ఆనవాయితీ అయిపోయింది. అయితే అతడు దాన్ని ఒక ఛాలెంజిగా తీసుకొన్నాడు. ప్రస్తుతం అతడు పనిచేస్తున్న కేసు 'రామ్‌తీర్థ' అనే ముఠాకి

సంబంధించినది. అత్యంత తెలివితేటల్తో—చాలా పకడ్బందీగా దేశంలో పనిచేస్తున్న ఒక ముఠాకి నాయకుడు రామ్‌తీర్థ. ఒకప్పుడు అతడు ఇంజనీరింగ్ గ్రాడ్యుయేటు. నిరుద్యోగిగా చాలాకాలం వుండి, ఈ వ్యవస్థపట్ల విరక్తిచెంది—చిన్న చిన్న మోసాలు చేయటం ప్రారంభించేడు. తొందర్లో అతడి చుట్టూ చిన్నగుంపు పోగయింది. అయితే చాలా తెలివితెటలున్న వారినే అతడు తనలో చేర్చుకున్నాడు. మామూలు దొంగతనాలూ, దోపిడీలూ కాకుండా, తెలివైన పథకాల్తో ప్రజల్ని మోసం చేయటం అతడికి వెన్నతో పెట్టిన విద్య. అరబ్ దేశాల్లో యువకులకి ఉద్యోగాలిప్పించే పథకం క్రింద చాలా రీసెంట్‌గా అతడు పది లక్షలదాకా దోచుకున్నాడు. పోలీసులు ఎంత వల వేసినా అతడు దొరకటంలేదు. అవినాష్‌కి ఆ కేసు అప్పజెప్పబడింది.

ఇంటి ముందు వాన్ ఆగగానే ముందు బైట కొచ్చింది లక్ష్మి. ఆమె దాన్ని చూసి స్థాణువైంది. ఇంతలో గాంధీకూడా బైటకొచ్చాడు. వాన్‌లోంచి సబిన్‌స్పెక్టర్ దిగాడు అతడే ఒక రౌడీలా వున్నాడు. అతడిపేరు లతీఫ్. ముందుకెళ్ళాడు "గాంధీ ఎవరు?" అతడి కంఠం బొంగురుగా ప్రతిధ్వనించింది.

"నేనే"

"వాన్ ఎక్కు"

గాంధీ విస్మయంతో 'ఎందుకు' అని అడిగాడు.

"పేపర్లో డబ్బు సంపాదించే ప్రకటన వేసింది నువ్వేగా"....అవునన్నాడు గాంధీ. ఈలోపులో లక్ష్మి ఏదో మాట్లాడబోయింది. గాంధీ ఆమెని వారిస్తూ "పేపర్లో ప్రకటన ఇవ్వటం ఇల్లీగల్ కాదే" అన్నాడు.

"ఓహో—నీకు కొద్దిగా ఇంగ్లీషుకూడా తెలుసే" హేళనగా అన్నాడు లతీఫ్. గాంధీ బట్టలు చూస్తే అతడు బస్ క్లీనర్ కన్నా అధ్వాన్నంగా వున్నాడు. లతీఫ్ అతడి భుజాన్ని నొక్కిపట్టి "ఏది లీగలో — ఏది ఇల్లీగలో మాకే చెబుతున్నావా—పదబే...." అంటూ తోసేడు. గాంధీ ముందుకు తూలేడు. అయ్యో అంటూ లక్ష్మి ముందుకెళ్ళింది. అప్పటికే అక్కడ గోళీలాడుకొనే కుర్రవాళ్ళు, పక్క పాకల ఆడవాళ్ళూ చేరేరు.

గాంధీ వాన్ ఎక్కాడు "నేనూ వస్తాను. నన్నూ తీసుకెళ్ళండి" అంటూంది లక్ష్మి. గాంధీ ఉలిక్కిపడి "వద్దు వద్దు" అన్నాడు. అతడికి ఉమీజాబీ గుర్తొచ్చింది. ఈలోపులో డ్రైవర్ స్టార్ట్ చెయ్యటం, వాన్ కదలటం జరిగింది.

సీటుకి ఆనుకొని కూర్చొన్నాడు గాంధీ—బండి కుదుపులకి అతడి శరీరం ఎగిరెగిరి పడ్తూంది. నిస్త్రాణగా కూర్చొని, ఆలోచనల్లోకి జారిపోయేడు.

ఎంత చిత్రంగా వుంది! న్యాయబద్ధంగా డబ్బు సంపాదిస్తానని పందెంకట్టి—మొదటి చర్యలోనే పోలీస్‌స్టేషన్‌కి వెళుతున్నాను! ఎవరన్నారు మెలో డ్రామాలేదని? అది మన జీవితాల్లోనే వుంది!!!

అతడికి అప్రయత్నంగా నవ్వొచ్చింది. కళ్ళుమూసుకొని తనలో తనే నవ్వుకొన్నాడు. కళ్ళు మూసుకోకుండా వుండివుంటే ఆ ఇరుకుసందుల్లో పక్కగా నిలబడ్డ హారిక కారు కనబడి వుండేది.

ం ం ం ం

"ఇక్కడ ఎవరూ లేరటమ్మా" అన్నాడు డ్రైవరు కారుదగ్గిరకి తిరిగివచ్చి. "ఇక కారు ముందుకెళ్ళాడు...."

ఆమె అడ్రసు కాగితం పట్టుకొని దిగింది—ఆమెకి చాలా ఇంట్రెస్టింగ్‌గా వుంది. గాంధీ తిరిగి తన డబ్బు ఎలా సంపాదించాడో తెలుసుకోవాలని. అతడు తప్పక ఏదో

విధంగా ఆ డబ్బు తిరిగి గెల్చుకుంటాడని ఆమె మనసు చెబ్తోంది.

ఆమె ఖరీదైన చీరె చివర్లు క్రింది బురదకి తడిశాయి - ఆమె వాకబు చేసుకుంటూ ముందుకెళ్ళింది అంత ఖరీదైన అమ్మాయి తమ ప్రాంతాల్లోకి రావటాన్ని జనం విడ్డూరంగా చూస్తున్నారు. చిన్న చిన్న కుర్రవాళ్ళు కొద్దిదూరంలో ఆమెని వింతగా అనుసరిస్తున్నారు. అరగంటలో ఆమెకి ఇల్లు దొరికింది. కానీ చుట్టుపక్కల వాళ్ళు చెప్పిన విషయం విని స్థాణువైంది. "పోలీస్‌వాన్ వచ్చి అతడిగాణ్ణి పట్టుకుపోయింది. ఎందుకూ అని అతగాడు అడుగుతూనే వున్నాడు. విన్లేదు-ఆళ్ళు ఎక్కించుకు పోయారు. ఎనకే లచ్చిమి ఎల్లింది...."

ఆమె పూర్తిగా విన్లేదు-వడివడిగా వచ్చి కారు ఎక్కి ఇంటికి తిరిగి పోనిమ్మంది. ఆమెలో రకరకాల ఆలోచన్లు-పరస్పర విరుద్ధమైన భావాల ఘర్షణ ...

ఆమె డ్రైవర్ని చాలా తొందర పెట్టింది. పోలీస్‌స్టేషన్‌లో అనుమానితుడ్ని ఎలా ఇంటరాగేట్ చేస్తారో ఆమె పుస్తకాల్లో చదివింది. ఆమె అభిప్రాయం కరెక్టే. లతీఫ్ గాంధీమీద థర్డ్ డిగ్రీ ఉపయోగించడానికి సిద్ధపడుతున్నాడు.

"చెప్పు రామతీర్థకీ నీకూ ఏమిటి పరిచయం?"

"రామతీర్థ ఎవరు?"

"లాఠీ గాంధీ మోకాళ్ళమీద పడింది గాంధీ పళ్ళ బిగువున బాధ అదిమిపెట్టాడు....

....కారు ఆగగానే హారిక ఇంట్లోకి వడివడిగా వెళ్ళింది. రెండు నిముషాలపాటు డైరీ వెదికింది....

అక్కడ లతీఫ్ గాంధీ రెక్కపట్టుకొని పైకి లేపి అడుగుతున్నాడు... "-ఎలా లక్షలు డబ్బు సంపాదించటం? అంత సులభంగా ఎలా?..." అతడి చేతివేళ్ళు గాంధీ భుజంలోకి నొక్కుకుపోతున్నాయ్.

హారికకి కావల్సిన నెంబరు దొరికింది. చకచకా నెంబర్లు తిప్పింది. అరనిముషం తరువాత రిసీవర్ ఎత్తిన ధ్వని. "హల్లో" అన్నారెవరో.

"శ్రీనివాసరావుగారున్నారా" అని అడిగింది. శ్రీనివాసరావ్ ఆంధ్రప్రదేశ్ హోం మినిస్టర్!

(ఇంకా వుంది)






'స్వీట్ సిక్స్టీన్' అంటారు నిజమే! ఆ వయసులో మగపిల్లలకంటే ఆడపిల్లలే ఎక్కువ కలలు కంటారు. చిన్న అనుభవమే ఆ సున్నితంగా ఉండే మనసును ఆనందంతో ఉర్రూతలు ఊగించవచ్చు. లేక లోతుగా గాయం కూడా చెయ్యవచ్చు. నా జీవితంలోనూ అలాంటిదే ఒక సంఘటన, ఈనాటికీ, ఏనాటికీ మరపురానిది జరిగింది!

ఇప్పుడు నా వయసు నలభై సంవత్సరాలు. వివాహం అయింది. ఇద్దరు రత్నాల లాంటి బిడ్డలు, ఆదరించి ప్రేమించే భర్త. అయినా ఒంటరిగా ఉన్నప్పుడు అనుకోకుండా పదహారు ఏళ్ళ వయసులో కన్న

## రాధాకుమారి

కలలు కల్లగా మారిన రోజు - ఆ రోజు నేను అనుభవించిన బాధ, ఆతర్వాత ఎన్నో రోజులు నా మనసును చుట్టి పొగమంచులా వాస్తవాన్ని చూడనివ్వకుండా చేసిన ఆ అనుభవం ఈనాటి తల్చుకుంటే నవ్వొస్తోంది. అదో మధురమైన మిళితమైన అనుభూతిలా ఆనందం కూడా కలుగుతూ ఉండేది.

అప్పుడు నాకు పదహారేళ్ళు. పదో క్లాసు చదువుతున్నాను మా ఇంట్లో నేను అందర కంటేచిన్నపిల్లను. నలుగురు అన్నయ్యలు అందరూ నన్ను అపురూపంగా చూసుకొనే వారు.

మా పెద్దన్నయ్య బ్యాంకులో పని చేస్తున్నాడు. నేను అందంగా ఉంటాను అనేవారు, పగటి కలలు కనేదాన్ని అదే సమయంలో ఒకసారి మా అన్నయ్య స్నేహితుడు మా యింటికి వచ్చాడు. అతనుకూడా అన్నయ్య చేసే బ్యాంకులోనే పని చేస్తున్నాడు. తెల్లగా పొడుగ్గా ఉన్నాడు. నేను తలుపు చాటు నుంచి చూసాను. నా గుండె దడదడ లాడింది. నా కలల్లో రాజకుమారుడు ఇతనే అనిపించింది.

'అమ్మచేతిలోని మజ్జిగ గ్లాసులు అందు కొని (అది వేసవికాలం-అతను కాఫీ వగైరా తాగడట) నేను వాళ్ళముందుకెళ్ళి గ్లాసులు టేబుల్ మీద పెట్టాను.

"నువ్వెందుకమ్మా తెచ్చావ్? అమ్మ ఏం చేస్తోంది?" అన్నాడు అన్నయ్య. అన్నయ్య మాటలోనే నాకు అలా నేను రావడం ఇష్టంలేదని అర్థం అయింది పలక్కుండా వెనక్కి వెళ్ళిపోతున్న నాకు "మా చెల్లాయి, రాధ!" అని అన్నయ్య అనడం వినిపించింది.

నేను వెనక్కి చూశాను. అతను నాకేసి చూశాడు. ఇద్దరి కళ్ళూ కలుసుకున్నాయి. క్షణంసేపు సృష్టంతా నిలబడిపోయినట్టు అన్పించింది — లోపలకు వెళ్ళిపోయాను. తలుపుదగ్గిర పుస్తకం చేతిలోపట్టుకొని

కవితకి కార్టూన్ :




ఆమె కన్నులలో ననంతాంబరపు
నీలి నీడలు కలవు

-కృష్ణశాస్త్రి

వాళ్ళమాటలు వింటూ కూర్చున్నాను. అతని కంఠం నాకు కోటివీణలు ఒకసారి మ్రోగుతున్నట్టూ, ఆ శబ్దంలో నేను కరిగి పోతున్నట్టూ అన్పించింది, అతను వెళ్ళి పోయాడు, వెళుతూ, వెళుతూ నాకోసం అతని కళ్ళు వెదికే ఉంటాయని ఊహించు కున్నాను. సినీమాలూ, నవలలూ చూసే దాన్ని — చదివేదాన్ని—నాకిష్టమైన హీరోలందర్నీ అతని రూపంలో ఊహించు కుంటూ కలలు కనసాగాను.

అతను అప్పుడప్పుడు మా ఇంటికి వస్తూ ఉండేవాడు. అతను అన్నయ్యకోసంకాదనీ, నేను కన్పిస్తానేమో ననే ఆశతోనే వస్తు న్నాడనీ ఊహించుకునేదాన్ని. ఒకరోజు అన్నయ్య వచ్చి "శ్రీధర్ (అతనిపేరు) నిన్ను ప్రేమిస్తున్నాడు చెల్లాయ్ నిన్ను పెళ్ళిచేసుకుంటాడట - నీకు ఇష్టమేనా ?"

కవితకి ...




కాగితం పొలం
కలం హాలమేసి దున్నితే మొలకెత్తేది
అక్షరాల పైరు

-దేవిప్రియ

అని అడుగుతాడని ఊహించసాగాను. అన్నయ్య దేనికి చెప్పినా అందుకేనని ఎదురు చూసేనాకు నిరాశే ఎదురయ్యేది. స్కూలుకు వెళ్ళేదాన్ని. కాని ఇంటికి వచ్చిన మగవాళ్ళకళ్ళ పడటం మావాళ్ళకు ఇష్టం ఉండేదికాదు. శాస్త్రపరదా పాటించే కుటుంబం!

రాత్రిళ్ళు నిద్రపోయేదాన్ని కాదు. నేను చిక్కిపోతున్నానని డాక్టర్లకు చూపించే వాళ్ళు. ఆరోజు అన్నయ్య ఊళ్ళోలేడు, ఎవరో తలుపుకొడితే తలుపు తెరిచాను, అలాగే నిలబడిపోయాను. ఎదురుగా శ్రీధర్.

అతను చూస్తూ నిల్చున్నాడు.

"రండి లోపలికి" గొంతులో వణుకు.

"మోహన్ లేడా?"

"ఊరికి వెళ్ళాడు."

అంతలో అమ్మవచ్చి అతన్ని ఆహ్వానించింది. "వెళ్ళొస్తానమ్మా! మోహన్‌తో పనిఉండి వచ్చాను" అంటూ అతను వెళ్ళి పోయాడు.

నేను నాగదిలోకి వెళ్ళి కళ్ళు మూసుకొని పడుకున్నాను. అతను నన్ను పరిశీలనగా చూడటం మళ్ళీ మళ్ళీ ఊహించుకో సాగాను, అవును! అతను నన్ను ప్రేమిస్తున్నాడు. ఇవ్వాళ నా పెళ్ళి గురించి అడగటానికే వచ్చి ఉంటాడు అనుకున్నాను.

ఆరునెలలు గడిచాయి, అతను వస్తూనే ఉన్నాడు. నా కళ్ళు అతనికోసం వెదుకుతూనే ఉన్నాయ్. నేను తలుపుచాటునుంచి అన్నయ్య చూడకుండా తొంగి చూసేదాన్ని. అతను ఆసంగతి పసికట్టి అప్పుడప్పుడు వాకిలికేసి చూసి చిరునవ్వు నవ్వేవాడు.

ఒకరోజు స్కూలునుంచి వస్తున్నాను. అతను అప్పుడే స్కూటర్ దిగాడు. నా కాళ్ళు తడబడ్డాయి. వీధివాకిట్లోనే నిలబడి పోయాను.

"స్కూల్ నుంచి వస్తున్నారా?" చిరునవ్వుతో ఆప్యాయంగా పలకరించాడు.

నేను సిగ్గుతో మెలికలు తిరిగిపోయాను, ఏదోగా అన్పించింది.

"ఎందుకమ్మా అంతసిగ్గు! నేనూ నీ అన్నయ్యలాంటి వాణ్ణే!" అన్నాడు.

ఒక్కసారిగా కాళ్ళకింద భూమి జరిగింది. కళ్ళముందున్న ప్రతి వస్తువు గిర్రున తిరిగింది, పడబోతూ గడప పట్టుకొని తమాయించుకున్నాను. మరుక్షణంలో పరుగులాంటి నడకతో ఇంట్లోకి వెళ్ళాను. నాగదిలోకి వెళ్ళి తలుపులు బిగించుకున్నాను, భోరుమని ఏడ్చాను.

మోసపోయిన హీరోయిన్లా కొంత కాలం బెంగతో కుమిలి పోయాను.

ఏమనుకున్నాడో, ఆతర్వాత శ్రీధర్ మళ్ళీ మా ఇంటికి రాలేదు.

మరో ఆరునెలలకు నాకు పెళ్ళి కుదిరింది. చేసుకోనని చెప్పే ధైర్యంలేదు. మొదటి రాత్రి నామనసు ఇంతకుముందే వేరే వ్యక్తికి అంకితం అయింది అని చెప్పాలనుకున్నాను, చెప్పేధైర్యం లేకపోయింది.

ఇప్పుడు ఆలోచించుకుంటే భయం వేస్తుంది? నిజంగా, ఫ్రాంక్‌గా అలా చెప్పి ఉంటే ఏమయ్యేదో?!

# హిమాలయం - కలుపుమొక్క

## జ్యోతి

గ్రీష్మకాలపు సాయంకాలం—చల్లని గాలికి చెదిరే ముంగురులని చూస్తూ కూర్చున్నాడు అతను. అతని పక్కన ఆమె. సాగర సమీపాన ప్రవహించే నదిలా. మబ్బుపక్క సౌదామినిలా. ఒకరి కళ్ళల్లోకి ఒకరు చూసుకుంటూ, మాట్లాడుతూ ఉప్పొంగుతున్నారు. ఉప్పొంగుతూ మాట్లాడుతున్నారు.

చల్లటిగాలి. అరుణ భాస్కరబింబం—నీటిలో బింబం ప్రతిబింబం....కదిల్చేగాలి, కదిలే ధూళి, కలిగేహాయి. అన్నీ ఏకాంతాన్ని హాయిపరుస్తూ-ఏదో అన్నాడతను. దానికామె పడీ పడీ నవ్వుతోంది. కొంటెగా చూస్తోంది. నాలుక కొసతో పెదాల్ని తడుపుతూ.

అతనికి ఆనవ్వే మత్తెక్కించేది. ఆనవ్వే కవ్వించేది. అతని హృదయంలో ఉద్రేకం. పున్నమి వెన్నెల సోకిన సాగర జలంలా. అతనిచేయికింద ఆమెచేయి. అతనికి ప్రపంచం స్థంభించింది. ఆమె, తను ఇదే ప్రపంచం. హఠాత్తుగా ఆమె చెక్కిళ్ళపై, పెదవులపై అతని పెదవుల ముద్ర.

ఆమె అతని కౌగిలిలో నలిగిపోతోంది వేశ్యతలలోని సిరిమల్లెలా.

ఆమె కొంటెచూపులో కోపపుఛాయలు, కవ్వించే నవ్వులో అపహాస్యపు సవ్వడి.

ఆమె మొహంలో అసహ్యపు రేఖలు. ఆమెను పేరుపెట్టి ఆర్ద్రంగా, ఆర్తిగా పిలిచాడతను ఆమెను గుండెలకు హత్తుకుంటూ. అతని పేరును కోపంగా, నీచంగా పలికిందామె అతన్నించి విడిపోతూ.

అతని హృదయంలో అవమానపు భావం, హాసంలో బాధ రేఖలు. మనసులో అహంకారపు ఆధిక్యం.

ఆమె కోపాన్ని ఆమె వదనం "రిఫ్లెక్ట్" చేస్తోంది.

అతని భావాల్ని అతని హాసం దాచలేపోతోంది.

"సారీ" అతని మాటలామె హృదయం చేరకుండానే ఈథర్ మింగేసింది.

"అమ్ రియల్లీ సారీ" అనంత శూన్యాన్ని గులకరాయితో పూడ్చాలన్న తపన అతనిది. నిశ్శబ్దంగా లేచిందామె. మెల్లగా అడుగులు వేస్తూ కదిలి, కనుమరుగైంది. రైలు వెళ్ళిపోయిన పట్టాల్లా. నిశ్చలంగా.

o o o o

ఆరోజు రాత్రి—ఆమె మనసులో సంఘర్షణ, ఒకకోణం అంటోంది. దీన్ని ఆలోచనాశక్తి అందాం. తను తొందర పడ్డదా.. ఆవిధంగా నవ్వకుండా, అతన్ని కవ్వించకుండా ఉంటే అతను....

తన పరిధిలో తానుండే వాడా ? మరో కోణం అరుస్తోంది. దీన్ని అహం అందాం.

తనేం తొందరపడ్డది ? జోకేస్తే నవ్వింది అంతేగా ?!

ఆమాత్రానికే ఉద్రేకపడితే ఇంక అతనేం మగాడు ?

మూడో కోణం నచ్చచెప్తోంది. దీన్ని జ్ఞానం అందాం-అయినా అతనికేకాంతం కల్పించడం తనదే తప్పేమో ?! అంతచనువివ్వకుండా ఉండాల్సిందేమో !!

రెండోకోణం హుంకరించింది. అతనికి తెలుసు తనకిలాంటివి గిట్టవని, తనకావల్సింది స్వచ్ఛమైన స్నేహితం - దాన్ని ప్రేమ అనడం తనకిష్టంలేదు....అయినా

అతను తొందరపడ్డాడు.

కేవలం నవ్వుకీ, చూపుకీ ఉద్రేకపడే ఇతను— రేపొద్దున్న నా చెల్లెలు పైట జారితే?—

లేక ఏ బజారు స్త్రీయో కవ్విస్తే? రెచ్చగొడితే ?—

నో—తను అతని నింక ఆరాధించలేదు. ఆ అధ్యాయం సమాప్తి. "అంతే" అరిచింది. అసలు తనకి అతనపై ఏర్పడ్డ ఆకర్షణ స్వరూపం....? పరిణామరూపేణా తరవాతైనా, పరిమాణ రూపేణా చిన్నవి ఒకటి, మూడుకోణాలు. వాటి ప్రశ్నలకి జవాబుండదు. ఊరుకోవల్సి వచ్చింది. మూర్ఖుడి ముందు వివేకుల్లా.

o o o o

మూడు గ్రీష్మాలు గడిచేయి.

అతనెందుకో ఆఊరొచ్చాడు. ఆమెను చూశాడు. ఆశ్చర్యపడ్డాడు. ఆనందపడ్డాడు తత్తరపడ్డాడు-సర్దుకున్నాడు,

"గుర్తున్నానా ?" అడిగాడతను. చల్లని చిరునవ్వు జవాబిచ్చిందామె.

"బాగున్నారా ?" అడిగింది. చిన్న నవ్వు విసిరేడతను, ఆమె వంకే కన్నార్పకుండా చూస్తూ.

"ఏమిటలా చూస్తున్నారు ?" చిరుకోపంగా అడిగిందామె.

తేనెపట్టు రేగింది. ఆగింది - చిన్నగా నిట్టూరుస్తూ "కాలం నీలో తెచ్చిన మార్పుల్ని" అన్నాడు.

"అంటే ?"

"నువ్వుని మీరు చేశావ్. విద్యార్థివి టీచరయ్యావ్ ఇంకా...."

"మారుతుంటేనేగా కాలం విలువ తెలిసేది. సరే ఎక్కడుంటున్నారు ?" అడిగింది.

"లాడ్జిలో .... ను....మీరు ?" చెప్పిందామె. బస్సులూ, స్కూటర్లూ వెళ్ళిపోతున్నాయి.

"సాయంత్రం తప్పకుండా వస్తారుగదూ !" చిన్నగా అభ్యర్థించింది.

"ష్యూర్, ష్యూర్" ఆమె ఛాతీపైపే తదేకంగా చూస్తున్న అతను చూపులు మార్చేడు.

o o o

ఆరోజు మధ్యాహ్నం—

తాము విడిపోయిన రోజు తాలూకు డైరీ చదువుతున్నాడతను. తెల్లటి కాగితంపై ఎర్రటి అక్షరాలు.

"తను తొందరపడకుండా ఉండాల్సింది. అయినా ఆ నవ్వు, ఆచూపు మనల్ని పిచ్చివాణ్ణి చేశాయి. ఉద్రేకం తప్ప మరేంలేదు. అయినా, అంత చిన్న తప్పుకి ఇంత పెద్ద శిక్షా ?! అయినా వేలికొసలు తగిలితేనే స్పందన పొందే దశనుంచి మానవులె దిగితే ఎంత బాగుండును! అసలీ స్పందనలన్నింటికీ కేంద్రం మనస్సంటారే! మరి ఈ స్పర్శామాత్ర స్పందన జనిత క్షణాలేమిటో! అయినా ముచ్చటపడి ముద్దెట్టుకుంటేనే ఇంత రాద్ధాంతం చేసిన ఈమెతో తను రేపెలా కాపురం చెయ్యగలం ? మన భార్య ఆత్మాభిమాని కావాలి.

కానీ అహంకారి కాకూడదు. అసలు మనకి ఆమెపై ఏర్పడ్డ ఆకర్షణ స్వరూపం?.... అగ్నిపర్వతం. మన జీవితాకాశాన చుక్కలా మెరిపి ఉల్కలా రాలిపోయిందామె?!

పుస్తకం మూసేశాడతను. హృదయం తెరిచేడు,

ఫాను ఆపేడు—లేచి తయారయ్యాడు. గడియారం చప్పుడు టిక్కూ టిక్కూ, లబ్ డబ్, టిక్కూ టిక్కూ, లబ్ డబ్.

o o o

ఆరోజు సాయంత్రం ఆమె గదిదగ్గర అతను.

"లోపలకు రావచ్చా ?" అడుగుతున్నాడు.

"ఉండండి. బయటే కుర్చీలేస్తాను, కూర్చుందాం. రూమంతా ఫుల్" కుర్చీ వేసిందామె. కాఫీ తెచ్చిచ్చింది. కప్పందుకుంటున్నప్పుడు ఇరువురి చేతివేళ్ళ స్పర్శ, అతనిలో చిన్నస్పందన. అగ్నిపర్వతం

ఒళ్ళు విరుచుకున్నట్టు.

ఆమెలో ఏం అలజడిలేదు— అతని హృదయంలో ఒకటే సంఘర్షణ. ఎలా ప్రారంభించాలి ? ఎలా చెప్పాలి ?

కుర్రాడిలా "నువ్వేం అనుకోనంటే నిన్నోమాటడగాలి" అనాలా ? లేక

సందిగ్ధంగా "నీతో ఓమాట చెప్పాలి? " అనా లేక,

సూటిగా "నిన్ను పెళ్ళి చేసుకుంటాను. అం..దు..కే..ఇ..న్నా..ళ్ళూ.. ఆ. గా..ను" అనాలా !

సంఘర్షణ ఆగింది. ఎలాగో భావ ప్రకటన చేశాడు. వేదాంతిలా నవ్విందామె. లేచి లోపలికెళ్ళి ఓ తెల్లకాగితం తెచ్చిచ్చింది.

అది ఆమెకీ మరో లెక్చరర్ కీ జరగబోతున్న పెళ్ళికి అచ్చుకోసం రాసి ఉంచిన శుభలేఖ నమూనా. ఏ రైలూ ఆగక తనమీద నుంచి వెళ్ళిపోతుంటే చూసే పట్టాల్లా— చూస్తున్నాడతను.

"ఏమిటలా చూస్తున్నారు ?" అందామె

"ఇందులో తప్పేవరిదా అని ఆలోచిస్తున్నాను" కాయితం ఇచ్చేస్తూ అన్నాడు.

సాలోచనగా అందామె. ఒక నిముషం తర్వాత.

"బహుశా ఇద్దరదీకాదు. ఆ వయసులో ముట్టుకుంటేనే మైల పడిపోతానన్న నా భావం ముట్టుకుంటే ఏదో పొందినట్లు, మీ అదోరకపు ఆనందం, ఇదంతా చూస్తే మనిద్దరి మధ్యా పరస్పర అవగాహన లేదేమో ననిపిస్తోంది. అసలు మనిద్దరి మధ్యా ఏర్పడినది ప్రేమకాదేమో! పసితనం నుండి విడివడి మనం పరిపూర్ణ యువతగా పెరిగామని మనంతట మనం నిర్ధారించు కోవడానికి పడే ఆరాటంలో భాగమేమో ఈస్త్రీ పురుష పరిచయాలూ, సంబంధాలూ-బహుశా మనలాంటి సాంప్రదాయపు కుటుంబాలనుంచి వచ్చిన వాళ్ళకి కాకపోతే ఆవయసులో సహజంగా ఏర్పడే లైంగిక ఆకర్షణ అయినా కావచ్చు. అలాంటి వాళ్ళిలాగే ఏదో ఓ కారణం చూసుకు విడిపోతారే తప్ప జీవితాన్ని పంచుకోవడానికి ఉద్యుక్తులవరు" ఇంకా ఏదో అంటోందామె. అతనామెను చూస్తున్నాడు.

హిమాలయాన్ని కలుపు మొక్క చూసినట్టు.

"శుభాకాంక్షలు. వస్తాను-సెలవ్"

కదిలేడు. వెనుకనుంచి ఆమె అంటోంది.

"గది చూడకుండానే వెళుతున్నారు"

— —

(గురువు; తిరిగిరానిక్షణాలు రచయిత, ముళ్ళపూడి నాగేశ్వరరావుకు ప్రేమతో)

## జస్ట్ ఏ మినిట్

దీపావళి ప్రత్యేక సంచికకు కథలు (మాంఛివి) సెప్టెంబర్ 10 లోగా అందితే చాలు!

అన్నట్టు రచయిత/త్రులు తమ రచనల బరువు/కార్టూన్ల బరువునూ కొంచెం చూసుకుని మరీ పంపండేం— ఏవంటే, మీకూ/మాకూ పోస్టల్ వారి బేరింగు-డ్యూలు తప్పదు సుమీ!

పోతే-మీ మీ రచనలు అందాయనీ, అందలేదనీ-ఇలాఇబ్బందిలేకండా అంచక్కా రిజిష్టర్డ్ పోస్ట్ చేస్తే మంచిది కదండీ! అలా జాగ్రత్తచేసి పంపినవాటికే ఉత్తర ప్రత్యుత్తరములు జరుపబడును.

అంచేత గమనించండి!



"ఎంతపని చేశావు సీతా! ఎంతపని చేశావు.

నీ చేరువలో ప్రేమను దండిగా పండించు కుంటూ నిండు నూరేళ్ళు గండిపేట చెరువు వరకు చెట్టా పట్టా లేసుకు తిరగాలనుకున్నానే.... అలాంటిది ఈనాడు నాకు, నాకు........వేళకి 'టవల్' అందించక... హు...." కసిగా కిటికీ ఊచల్ని పట్టుకుని శూన్యంలోకి చూస్తూ బాధతో బిర్రబిగుసుకు పోయాడు శేషావతారం.

స్నానం చేసేటప్పుడు టవల్ అందించటంలో అరక్షణం ఆలస్యమైనంత మాత్రాన ఇంతగా సాగదియ్యాలా అని తడిసి పోవాలని....ఆ మంచులో మునిగి పోవాలని...." వింత కోరికను వెలిబుచ్చుతుంటే ఇదేదో వ్యాధిలక్షణమని అనుమానపడింది.

"వద్దండీ జలుబు చేస్తుంది" అని తను అనగానే గభేలున జుట్టు పీక్కుంటున్న అవతారాన్ని చూడగానే అనుమానం ధృవపడిపోయింది.

అందుకే పదిహేను రోజులనుండి ఏక



బాధపడిన సీతామహాలక్ష్మి పదిహేను రోజుల క్రితమే పట్నంకాపురానికొచ్చింది. పదవతరగతి వరకు చదువుకున్న సీత పెళ్ళయ్యేవరకూ పల్లెలోనే వుండటంతోనూ, ప్రేమ సినిమాలు చూసే అలవాటు లేకపోవడంతోనూ శోభనం గదిలోనే భర్త వింత ప్రవర్తనకు అబ్బురపడిపోయింది. పుట్టెడుసిగ్గుతో గదిలోకి అడుగు పెడితే సిగ్గులేకుండా కిటికీలు తెరిచి "ఆ చంద్రమామను చూడు.... ఆ వెన్నెట్లో బిగిని ఏదేదో మాటాడుతుంటే అర్థంకాక 'సక్కుబాయి' లా కొంత బాధపడి ఆనక అదీ కష్టం కావడంతో అర్జెంటుగా తండ్రికి ఉత్తరంకూడా రాసేసింది.

"ఆడది సహకరిస్తే దాంపత్యం నందన వనమవుతుంది. కాని నావు అది అనురాగానికి అర్థం తెలీని ఎడారిగా మారుతుంది. ఆ ఎడారిలో ఒంటరికోయిలలా బ్రతకడమే నీ లక్ష్యమైతే....హు!"

అతడి చేతులు మరింత బిగుసుకు

హాస్యకథల పోటీలో

పోతుంటే అధైర్యంగా కిటికీ వూచల వేపు చూసింది.

"ఏమండీ...."

ఆమె కంఠం వినగానే నిర్లిప్తతకు పురిపెడు నిట్టూర్పును జోడిస్తూ "ఊ" అంటూ కొద్దిగా తలతిప్పాడు.

"ఒక్కమారు...."

వరమడుగుతున్నట్టుగా అతనివేపు చూసింది.




"ఏమిటది"

ఆర్ద్రతను నింపుకున్న బేస్‌వాయిస్‌తో తలను పూర్తిగా ఓ ప్రక్కకు వాల్చి గంభీరంగా చూసాడు.

"నిన్న ఇంటి యజమాని వచ్చాడు...."

"వచ్చి...."

"బంగారంలాంటి కిటికీ వూచల్ని అలా వంచటం అన్యాయమన్నాడు"

"ఊ........" క్షణంపాటు ఉలిక్కిపడి ఊచలు ఇనుపవే అన్న నిర్ధారణకు వచ్చాక చేతిలో [illegible] పెట్టుకుని "ఎంత మాట న్నాడు! అతడినా దేవుడుకూడా క్షమించడు సుమా" అనుకుంటూ గాఢంగా శ్వాస వదిలాడు.

"అప్పుడు నువ్వేమ[illegible]"

"మావారు అదే [illegible] బాధపడినప్పుడల్లా కిటికీ వూచలు పట్టుకుం[illegible]టారని...."

"ఆ...." గుండెల్లో [illegible]పం గుచ్చుకున్నట్టుగా ఎడంచే[illegible] [illegible]వేపు అద్దుకున్నాడు.

"కోపం పట్టలేక [illegible] నించి పడేస్తుంటారని...."

---

ఎన్నికయిన కథ

"ఊ...." గునపం వీపు లోతువరకు దిగినంత బాధగా మెలితిరిగిపోయాడు.

"....చెప్పడానికి మనసొప్పక ఇక ముందు పూచలు వంగకుండా జాగ్రత్త పడతానని మాటిచ్చానండి" అమాయకంగా జవాబు చెప్పింది....

"ఎంతపని చేసావు సీతా.... ఎంతపని చేసావు....మా బామ్మ నాకు ఉగ్గుపాలతో పూచల్ని గుండచేసి పట్టలేదని చెప్పలేకపోయావా.... పూచల్ని వంచటానికి నేనేం వస్తాదునుకానని స్పష్టపరచలేకపోయావా" అంటూ ఆవేశంతో ఊగిపోతూ పూచలు నిజంగా పూడేట్టున్నాయన్న ఆలోచన రాగానే 'బామ్మా' అంటూ బామ్మగారి ఫోటో పట్టుకున్నాడు.

వ్యాధి లక్షణంలో ఇదీ దైనందిన కార్యక్రమమే అని తెలిసిన సీత కాఫీ చేయాలని వంటింట్లోకి వెళ్ళింది.

"ఎందుకు వెళ్ళిపోయావు బామ్మా. నన్ను వదిలి ఎందుకు వెళ్ళిపోయావు...." బావురుమంటున్న భర్త గొంతు వినపడగనే 'ఎప్పుడు పోయారండి . ఎలా పోయారు' అంటూ పరుగున వచ్చింది....

"ఎంత మాటన్నావు సీతా.. పోవటమంటే పైకి పోవటమా.... బామ్మ తీర్థయాత్రలకి వెళ్ళలేదూ...." మంచి క్లారిటీతో కోపాన్ని ప్రదర్శించిన భర్తవేపు బిక్కమొహం వేసుకుని చూసిన సీత నెమ్మదిగా వంట గదిలోకి నడిచింది.

ఆ ఫోటోలోని బామ్మబొమ్మ కదిలినట్టనిపించింది.

తీర్థయాత్రలకు బయలుదేరుతూ "నా బాధ్యత తీరిపోయిందిరా శేషూ! తెలుగు సినిమాలు చూసి చూసి మొహంమొత్తింది. అందుకే తీర్థయాత్రలవేపు మనసు మళ్ళింది. నేను లేకపోతే ఒంటరిగా సినిమాకూడా చూడలేని వెధవాయివి. ఎలా వుంటావో ఏమో....ఆ కళ్ళనీళ్ళేమిట్రా, ఓనెలరోజుల్లో రానూ....అంతవరకూ మీ ఆవిడతో చెట్టాపట్టా లేసుకుంటూ చక్కగా సినిమా డైలాగుల్ని వల్లెవేస్తూ గడిపేయరా అబ్బి" అన్న బామ్మ మాటలు గుర్తుకొచ్చాయి.

'బామ్మా' దుఃఖాన్ని దిగమింగుకుంటున్నట్టుగా ఫోటోని మరింత దగ్గరగా జరుపుకునేసరికి గతమంతా ఫ్లేష్‌బేక్‌లో కనిపించసాగింది.

పుట్టుకతోనే తల్లిదండ్రుల్ని మింగేసిన తనను పెళ్ళయిన పణ్ణాళ్ళానికే మొగుడ్ని మింగేసిన బామ్మ చేరదీయటం, దూరపు బంధువైనా అంతా తానే అయి అప్పడాలు, వడియాలూ అమ్ముతూ తనను చదివించడం, తల బోడి అయినా తలపులు బోడి కాని బామ్మ భర్తను మరిచిపోలేని దుఃఖంలో విందుగా ప్రేమసినిమాలు చూడడం, అలా చూస్తూ తను ఓ సినిమానటుడు కావాలని కోరటం... పరీక్ష పోయినా పల్లెత్తుమాటనకుండా చూసిన సినిమాలోని సంభాషణలు వల్లె వేస్తుంటే ఆనందంతో అప్పడాలు, పప్పుచారుతో గోరుముద్దలు తినిపించటం....అన్నీ... గుర్తుకొచ్చి మరో మారు 'బామ్మా' అంటూ గొణిగాడు.

"నీకు తీరని ద్రోహం చేసాను బామ్మా. నీ కోరిక తీర్చలేకపోయాను. నన్నా భగవంతుడుకూడా క్షమించడు...."

మలేషియా తెలుగు మహాసభలకని బయలుదేరి మెడ్రాస్‌లోనే మొహం వాచేట్టు బాధలుపడి వెనక్కి మరలిన డెలిగేట్స్‌లా, వేషాలకోసం మెడ్రాస్‌లో అడుగుపెట్టి పానగల్ పార్కులో పడ్డ పడరాని పాట్లను గుర్తు చేసుకుని గుండెలవిసేలా ఏడవాలని విశ్వప్రయత్నం చేసాడు.

"బామ్మా....తెలుగు సినిమాలు చూసే అవకాశం లేక తీర్థయాత్రల్లో ఎన్నికష్టాలు పడుతున్నావో కదా" అనుకుంటూ బయలుదేరే ముందురోజు మూడు 'షో'లు చూసిన బామ్మ మాటల్ని గుర్తు చేసుకుంటూ కలవరపడిపోయాడు.

'కాఫీ' ఆఫీసుకు టైమవుతోందన్న సూచనగా కాఫీని చేతికందించిన భార్యను

డ్రీమ్ సీన్‌ను డిస్టర్బ్ చేసిన కాలింగ్ బెల్‌లా భావించాడు.

మళ్ళీ ఏం మొదలుపెడతాడోనని బెదురుతో ముడుచుకుపోయింది.

ఆమె నమ్మకం వమ్ము కాలేదు.

"సీతా . .స్వాతి చినుకులు ఆల్చిప్పలో పడి అమాంతం ముత్యాలుగా మారినట్లు కషాయంలో పాలు కలిపినపుడు " అంటూ ప్రక్కకు చూసేసరికి సీత కనిపించ లేదు.

ఆమె నిర్లక్ష్యానికి అతని గుండెలు వ్రయ్యలైనట్లుగా బిగుసుకుపోతూ "సీతా" అంటూ ఉద్రేకంతో అరిచాడు.

పరుగున వచ్చింది వంటగదిలోంచి.

"నువ్వింతవరకూ ఎన్ని సినిమాలు చూసావు? వాటి పేర్లేమిటో చెప్పగలవా." ఆమె అనుచిత ప్రవర్తనకు సినిమాలు చూడకపోవడమే కారణమన్న నిర్ణయానికి వచ్చేసాడు.

"సతీ సక్కుబాయి .. వరలక్ష్మి వ్రతం;" మరేదో చెప్పబోయేంతలో "సత్య న్నారాయణ వ్రతమహిమ, నాగుల చవితి, వెంకటేశ్వర మహాత్మ్యం, . ఇవినా. . ఇంతకంటే సినిమాలు ఎందుకు చూడ లేకపోయావు" అంటూ నిలదీసాడు.

సిగ్గుతో ఆమె తల వాలిపోయింది ఆమెను కట్టుకోవడంలో జరిగిన అసలు పొరపాటు అప్పటికి అర్థమైంది అవతారం సిరి.

"హు! ఆరాధన చూసివుంటే తెలిసుం డేది అనురాగానికి అర్థం. ప్రేమనగర్ చూసివుంటే తెలిసుండేది ప్రేమకు నిర్వచ నం . ప్రేమ సినిమాల్ని పదేసిసార్లు చూసిన మా బామ్మదగ్గర పెరిగివుంటే తెలిసేది నా హృదయాంతరాళంలో .. "

"పోన్లెండి ...నాకు తెలీదు .పోనీ నా పొరపాటేమిటో తెలియచెప్పరాదూ ..." ఉక్రోషంగా అడిగింది

'హు' అంటూ ఓ చిన్నమూలుగుతోనూ బాని దగ్గుతెర గొంతుకడ్డం పడినట్టుగానూ

కవితకి కార్టూన్ :




ప్రపంచమొక పద్మవ్యూహం!
కవిత్వమొక తీరని దాహం!!.

-శ్రీశ్రీ

గుండెలు పట్టుకుని "అవును ఆడది మట్టి ముద్ద. ఆ ముద్దను కోరిన బొమ్మగా మార్చుకోవాల్సింది మగవాడే కదా" అన్న సినీసూక్తిని గుర్తు చేసుకున్నాడు.

అనుకున్నదే తడవుగా గంభీరంగా మారి పోయి గట్టిగా నిట్టూర్చాడు.

"చూడు సీతా. భర్త ఆఫీసునుండి రాగానే భార్య ఏం చేయాలో తెలుసా... ఆప్యాయంగా ఎదురురావాలి 'ఏమండీ' అంటూ అతడి ఒడిలో వాలిపోయి గోముగా జుట్టులోనికి వేళ్ళుపోనిచ్చి 'బాగా అలిసి పోయారుకదూ' అంటూ లాలనగా పెన వేసుకు పోవాలి"

"ఛీ సిగ్గు" అంటూ కళ్ళు మూసుకుంది.

"అబ్బా.. ." మొదటిసారం బెడిసికొట్టి నందుకు క్రోధంతో జుట్టు పీక్కున్నాడు.

అవతారం తరచుగా జుట్టుకూడా పీక్కుంటాడని తెలిసిన సీత ఎన్నిసార్లు వేశానికి బెదిరిపోలేదు. కాని వూడి అతని చేతిలో కొచ్చిన జుట్టును చూసి బాధపడింది. . ఎక్కువసేపు అక్కడ నిలబడలేక పోయాడు అవతారం. బట్టతలను గుట్టుగా వుంచె

ప్రయత్నంగా ఉన్న వెంట్రుకల్ని అటూ ఇటూ సర్ది ఆవేశంగా బయటకు నడిచాడు.

ఆఫీసుకు వెళ్ళాక అదేపనిగా ఆలోచించాడు. సిటీ మొత్తంమీద ఎన్ని ప్రేమ సినిమాలాడుతున్నాయో లెక్క చూసుకున్నాడు....అలాంటి సినిమాలు చూపించనిదే సీతలో మార్పు సాధ్యంకాదని నమ్మిన అవతారం అయిదు గంటలకల్లా ఇంటికొచ్చేసాడు.

అంట్లు తోముతున్న సీత భర్తను చూడగానే తెచ్చిపెట్టున్న ఉత్సాహంతో పైకి లేచింది. ఉస్సురోమంటూ కుర్చీలో కూర్చున్న భర్తను అమాంతం వాటేసుకుని "ఏమండీ! అలిసి పోయినట్టున్నారుకదా" అంటూ పౌరాణికఫక్కీలో పరామర్శించింది.

ఊహించని యీ పరిణామానికి బిత్తరపోయిన అవతారం 'ఎంతపనిచేసావు సీతా....ఎంత పని చేసావు' అంటూ గద్దించాడు.

ఏం జరిగిందో తెలిసి సీత ఏమిటన్నట్టుగా చూసింది.

"తియ్....ముందా మురికి చేతుల్ని నా జుట్టులోనుండి బయటకు తియ్" విసుక్కుంటూ దూరం జరిగి పరుగున బాత్ రూమ్‌లోకి వెళ్ళాడు.

అయిదునిముషాల్లో స్నానం కానిచ్చేసి "సీతా వెంటనే తయారుకా. నా అభిమాన నటుడి సినిమా. అందులోనూ ప్రేమ కథా భరితమైన మంచిసినిమా చూద్దాం" అంటూ తొందరచేసాడు....

"వంటండీ" అంది నాన్చుతూ.

"హు! వంట" అలవాటుగా విసుకు పోయాడు.

"జీవితమంటే వంటేనా సీతా! ఓగంట ఆలస్యమైనంత మాత్రాన తంటా ఏమిటి.. మన బ్రతుకులు వలపుల 'పంటగా' మన 'జంట'...." పదాల కరువు మూలంగా ప్రాసలతో వాక్యాన్ని పూర్తిచేయలేక కొంతసేపు పెనుగులాడి సీతతోపాటు ఆఘమేఘాలపై సుదర్శన్‌టాకీసు చేరుకున్నాడు.

థియేటరుకు చేరుకుని పాతపోస్టరుపై ఏటవాలుగా ప్రియురాలిమీద వాలి కళ్ళతో వూసులాడుతున్న వృద్ధ కథానాయకుడ్ని చూసి సంబరంతో బుకింగ్ వేపు పరుగెత్తి షాక్ తిన్నట్టుగా ఆగిపోయాడు.

బాధతో విగుసుకుపోతూ పర్సు కాలరు పట్టుకుని సీరియస్‌గా చూస్తున్న భర్తను సమీపించిన సీత 'ఏంజరిగిందండి' అంది భయంగా....

"అయిపోయింది సీతా....మన కలలన్నీ కల్లలుగా మారిపోయాయి....మన ఆశలు అడియాసలుగామారి కోరికలకు గోరీ కట్టాయి...."

"అబ్బా....ఏంజరిగిందండీ"

"జరగరానిదే జరిగింది....ఇంతే....మా జీవితమింతే" కొద్దిగా తూలుతూ వెనక్కి తిరిగాడు.

"అయ్యో....ఏంజరిగిందండీ...." అదురుతున్న గుండెలతో హడావుడి పెట్టేసింది పర్సు ఎవరైనా కొట్టేసారేమో అన్న సందేహంతో....

"హౌస్‌ఫుల్ సీతా....టిక్కెట్లు అయిపోయాయి...."

ఆమాట వినగానే ఆమెకు గుండెదడ తగ్గింది.

"పోనిద్దురూ....అంతేగా .... తర్వాత చూడొచ్చు"

ఇంటికి తిరిగొచ్చాకకూడా కిటికీవూచలు పట్టుకుని శూన్యంలోకి చూస్తూ చాలాసేపు వుండి పోయాడు.

అతని వేడి నిట్టూర్పులతో వూచలు వేడెక్కిపోతున్నాయి.

"పొద్దుపోయింది. భోజనానికి రండీ" అంది మామూలుగా.

నా గుండెల్లో రగులుకుంటున్న దావానలం నీకెలా చెప్పను సీతా....ఎలా చెప్పను....హు"

"అయ్యొ రామా! సినిమా టిక్కెట్టు దొరక్కపోతే ఇంత ఇదైపోవాలటండీ...." అతని వాలకం చూస్తుంటే వ్యాధి ముదురు

తున్నట్టనిపిస్తోంది. మరోప్రక్క ఒళ్ళు మండిపోతోంది.

"నా జీవితంలో బామ్మతో కలిసి వందల సినిమాలు చూసాను....ఏనాడూ....ఏనోటా ఇంత దారుణాన్ని నేను చవిచూడలేదు."

"నిజమే. మీ ప్రవర్తన నిజంగానే దారుణంగా వుంది. నిజానికి అది సినిమాగురించి కాదనుకుంటాను. మీకస్సలు నామీద ఇష్టం లేదు. మీకు మరెవరిమీదో మనసుంది.... అందుకే....అందుకే రోజురోజుకీ మీరిలా ప్రవర్తిస్తున్నారు ..." ఉక్రోషంతో వూగిపోతూ అడిగింది. ఇన్నిమాటలు మాటాడిన సీతను చూస్తుంటే క్షణంపాటు ఉల్లాసభరితుడయ్యాడు....ఇంకా ఏడిపించాలని ఆమె అలా మాడాడుతుంటే వినాలనీ అనిపించింది.

"చెప్పండి ...నేనన్నది నిజమేనా .." రెట్టించింది.

"అవును సీతా....నిజమే."

"ఎవరామె"

"అది...." గాఢంగా నిట్టూర్చి "అదంతా ఓ పెద్ద కథ ." ఫ్లేష్‌బేక్‌కై ప్రిపేరు అవుతున్నట్టుగా కిటికీదగ్గరికి జరిగాడు.

"ఏమండీ... కోపముంటే నన్ను తిట్టండీ. కాని దయయుంచి.. ."

"ఆ! ఉంచి...."

"పిల్లులు దూరితే వంటగదిలో పాలు తాగేస్తాయన్న విషయాన్ని గుర్తుంచుకోండి."

"అంటే.. "

"ఆ పూచల్ని అలా వంచి పిల్లులు దూరేటంత సందు చేయకండీ"

'అబ్బా' అపెండిసైటిస్‌తో మెలికలు తిరుగుతున్నవాడిలా నేలపై చదికిలపడి గట్టిగా జుట్టు పీక్కున్నాడు.

ఆ షాక్కి ఆకలి చచ్చిపోయిన అవతారం అలాగే నిద్రపోయాడు. సినిమా ప్రేమికుల సంభాషణలతో రాత్రంతా కలవరిస్తూ ఆలస్యంగా నిద్రలేచాడు.

"అంటే వ్యాధి చాలా ముదిరిపోయి

కవితకి కార్టూన్ :




కవిత్వం నా మాతృభాష!

-సినారె

నట్టుందమ్మా" సీతను పొరడిస్తున్న మామగారి గొంతువినగానే ఉలిక్కిపడి పైకి లేచాడు.

సీతపైకోపంతో మామగారితో మాట్లాడకూడదనుకున్నాడు.

ఆఫీసుకు బయలుదేరుతుంటే గదిలో కొచ్చారు మామగారు.

"బాబూ అవతారం........ నీ గురించి అమ్మాయి ఉత్త........"

"ఏం ముచ్చట్ల చూడాలని వచ్చారు...."

"....రం రాసింది ...అందుకని ప్రొద్దు"

"పగిలిన నా గుండెలలో...."

" ...కే వచ్చాను....అసలు నీఆరో.. ."

"... మీ ప్రతి బింబాన్ని చూసుకుని పగలబడి నవ్వండి....అంతే కానీ ..."

"....గ్యం సంగతి జాగ్రత్త...."

వీరావేశంతోటి ఎలక్ట్రిక్ ట్రెయిన్‌లా ఆఫీసుకు పరుగెత్తాడు అవతారం....

సాయంత్రం కాస్త ఆలస్యంగా ఇంటికి వచ్చిన అవతారం మామగార్నిగాని, మామగారి ప్రక్కన కూర్చున్న డాక్ట

కవితకి కార్టూన్ :




క్రీబంకి **ALGEBRA** చిహ్నాల
లాంతోటూ పాంకోళ్ళూ తొడిగి
సాహిత్య పౌరోహిత్యం ఇస్తే
వెర్రికాదు-**SURREALISM** సోదరా!

-శ్రీశ్రీ

---

రనబడే మరో శక్తిని గాని గుర్తించనట్టుగా తెలుగు హీరోలా కృత్రిమంగా నవ్వుతూ గదిలోకి దూరేశాడు.

ఎరు ఆందోళనలాంటిది కలిగినా ధైర్యాన్ని చిక్కబట్టుకున్న డాక్టరు 'మెడికల్ చెస్ట్'తో అవతారం గదిలోకి దూరాడు.

పక్క రేడియోలో అభిమానుల వుత్తరాలు అరగంట పాటు చదువుతుం వుండిపోయిన అనౌన్సర్ అసలు పాట వేయబోతుండగా డాక్టరు బయటకి వచ్చాడు.

"డాక్టర్...." డగ్గుత్తికతో అరుస్తూ డాక్టరు సమీపంలో నిలబడ్డారు సీతా— సీత తండ్రీను. ..

సుఖంగా బయటకు రాగలిగాడన్న తృప్తితో డాక్టరు రెండు నిముషాలపాటు మాట్లాడలేకపోయాడు.

"అయ్యా.... బట్టతలకి మందులేని విషయం మీకు తెలియనిది కాదు... ఇహపోతే ఎంతగట్టిగా పీక్కుకున్నా జుట్టువూడకుండా మంచి మందిస్తాను అయితే...."

"అదికాదు సార్ ....అసలు ఆ జబ్బు...."

"సినీమానియా అంటారు. అంటే.... తెలుగులో దీనికి అర్థం చెప్పడం కష్టం.... అయినా దాని లక్షణాలు చెబుతాను.... యీ వ్యాధి వున్నవాడు సినిమాల్లోని నాయకుల్లా మాట్లాడమని భార్యను వేపుకు తింటాడు. అలా మాటాడకపోతే జుట్టు పీక్కుంటాడు ...అసలు దీనికి మందులేదు.."

"పోనీ మీరేరోజూ వచ్చి మానసికంగా ఏమన్నా ట్రీట్‌మెంటిస్తే ." సీతతండ్రి ప్రాధేయ పడుతుండగా హఠాత్తుగా పైకి లేచాడు డక్టర్....

"అమ్మమ్మ.... నేనా....వేరే డాక్టరు నెవరైనా చూసుకోండి...." అంటూ వెళ్ళిపోయాడు.

"అమ్మాసీతా...." కూతురు తలనిమురుతూ కొన్నిక్షణాలు వుండిపోయాడు సీత తండ్రి....

"కట్నంలేకుండా పెళ్ళికి సిద్ధపడ్డాడని తృప్తిపడ్డానుగాని యీదరిద్రుడికిలాంటి వ్యాధి వుందన్న విషయం గుర్తించలేకపోయాను....ఇక ఎవరూ ఏమీ చేసేదిలేదు. మీ ఆయన జుట్టు, మీకిటికీ వూచలతోపాటు నీకాపరాన్నికూడా నువ్వే చక్కదిద్దుకోవాలి" అంటూ సాంత్వన వచనాలు పలికి వెళ్ళిపోయాడు.

"నాన్న వెళ్ళిపోయారు...."

అవతారం గదిలోకి వెళ్ళి గాద్గదికంగా అంది.

"హు ! మీనాన్న వెళ్ళి పోయినందుకు అంత బాధపడిపోతున్నావు. కాని నీముందే వుంటూ కనుచూపుమేరలో కనిపించని అనురాగంకోసం నేనెంత అర్రులు చాచి ఎదురు చూస్తున్నానో....నీప్రేమలహరిలో ఓలలాడాలని ఎంత వేసారిపోతున్నానో ఎప్పుడేనా ఆలోచించావా? అనురాగానికి అర్థం

# 33 కోట్లు + 1

కుహనా ప్రజాస్వామ్య కిరీటధారి
కుతంత్ర మంత్ర తాంత్రిక నరయాగ పూజారి
కుటిల పన్నగ పన్నాగ పలిత పాశ్చాత్య కేశ కపటసన్యాసి
ఖండిత పౌరహక్కు శిరసుల జపమాలాలంకృత రక్త దాహదేహి
నిత్య వంచనా శిల్ప రంజిత నవనవ నినాదలోహ ఖడ్గపాణి
అరాచక శూలి, అరిషడ్వర్గ పరివేష్ఠిత తమోధన బలశాలి
క్షణక్షణ స్వీయదేహారాధనా హూామధూమసంచారి
అత్యాయిక ఢమరుకాధ్వనీలోల కల్లోల కపాలవీధుల సంచారి
సాయుధ కిరాయి వేగుల పిశాచ గణాధిపతి
పువ్వుల్ని తినే వనమాలి
ఆదర్శం వంశపారంపర్య స్వార్థకాలనాగు చీలిన నాలుక
అంతరంగం వంశవృక్ష వెలుగులు ఘోషించే ఖనన కాలనాళిక
ఫ్యూడల్ పెట్టుబడిదారీ జంతువుల సంపర్కఫలం
మానవరూపాన అవతరించిన మరో దేవతావతారం
నియంత
మతం శరణం గచ్ఛామి
కులం శరణం గచ్ఛామి
ధనం శరణం గచ్ఛామి.

నగ్నముని

తెలియకపోతే కనీసం రచయిత్రుల నవలలు విరివిగా చదివి నా ఆవేదన్ని అర్థంచేసుకోవాలని ప్రయత్నించావా....?"

"ఆగండి" అరిచినట్టుగా పిలిచి అతని వాగ్ధాటికి వారధి వేసింది.

"చదువుతాను రచయిత్రుల నవలన్నీ చదువుతాను—తెచ్చి పడేయండి.... అంతకంటే ముందు మీరా కిటికీ వూచల్ని వదలండి"

"అబ్బా .." జుట్టు పీక్కోబోయి చేయి

కవితకి కార్టూన్:




ఏదేశ చరిత్ర చూసినా
ఏమున్నది గర్వ కారణం?
నరజాతి చరిత్ర సమస్తం
పరపీడన పరాయణత్వం !!

-శ్రీశ్రీ

పెట్టిన పరిసరాలలో అలాంటిదేమీ అందక పోయేసరికి విస్త్రాణగా బయటకు నడిచాడు.

ఆరాత్రే లైబ్రరీనుండి కొన్ని, కొన్నివి మరికొన్ని ప్రముఖ రచయిత/త్రుల ప్రేమ నవలలు తెచ్చి రాసిలా ఆమెముందు పోసాడు....

ఆమె ఆవేశంగా పుస్తకాలవేపు చూసింది.

ప్రేమపంజరం, ప్రేమపిచ్చి, రెల్లు గడ్డిలో ప్రేమజంట, పచ్చగడ్డిలో పురివిప్పిన ప్రేమ, అనకాపల్లిలో కురిసిన అనురాగ వర్షం....

ఆరాత్రే మొదలుపెట్టి అహోరాత్రులు శ్రమించి పుస్తకాలను చదవటం మొదలు పెట్టింది.

ఆమె ఏకాగ్రతకు అవతారం అబ్బుర పడిపోయాడు. అమందానంద కందళిత హృదయంతో ఆమెతో మార్పుకు ఎదురు చూస్తూ గెడ్డంకూడా పెంచేసాడు.

పాతిక రోజులుగా ఆమె దీక్షకు భంగం కలగకుండా చూసి తబ్బిబ్బయిపోయాడు.

అన్ని రోజులూ సంభాషణలు వల్లించ డానికి తోడులేక బోలెడంత బక్క చిక్కి పోయాడు. రోజు రోజుకీ మారిపోతున్న ట్టని పించిన సీతను చూస్తూ పుంఖాను పుంఖాలుగా ప్రేమకథల్ని రాసిన తెలుగు రచయితత్రులకి జోహార్లు చెప్పుకున్నాడు..

ఒకరోజు........

ఆలస్యంగా ఆఫీనునుండి ఇంటికి వచ్చిన అవతారం పుస్తకల నన్నింటినీ ఓ పక్క పేర్చి కొత్త అవతారం ఎత్తిన దేవతలా కిటికీ పూచల్ని పట్టుకుని నిలబడ్డ సీతను చూసి పరా మర్శించడానికిదే మంచి అద నుగా తలచాడు.

"సీతా"

"ఊ...."

"ఎలా వున్నాయి నవల్సు...."

"అద్భుతంగా వున్నాయి.... పొందిన జీవితానికీ, పోగొట్టుకున్న జీవితానికి మధ్య అనుసంధానంలా...."

"అబ్బో... అబ్బో.... నీకు బోలెడంత భాష వచ్చేసింది"

"అంతేకాదు....బాధగాకూడా వుంది."

"దేనికి" అని అడగలేదు అవతారం....

"ఆరడుగుల హీరోలాంటి భర్తఉంటే"

అయిదడుగులు దాటని అవతారం గొంతు తడారిపోయింది.

"ట్వీడ్ సూట్స్ వేసుకుని అతడు ఇరవై గజాల కార్లలో ప్రయాణం చేస్తున్నపుడు ప్రక్కన కూర్చుంటే...."

కాటన్‌పర్టు వేసుకుని డొక్కు సైకిల్ పై ఆఫీసుకు బయలుదేరే అవతారం కుడి చేతితో గడ్డం పట్టుకుని ఎడంచేతితో గుండెలు పట్టుకున్నాడు.

"....అద్రిల్ ఎంత బాగుంటుందో.... ప్చ్....దురదృష్టవంతురాల్ని .... ఆనాడే బావ అడగ్గానే అంగీకరించివుంటే పూవుకు తావిలా హరివిల్లు అంచున కూర్చుని మధు

రోహాల తూగుటుయ్యాలలో మైమరచి"

"స్టాప్...." బలంగా రెండుచేతుల్తో గెడ్డం పీక్కున్నాడు.

"అలా లాక్కోకండి తలకాయవూడి పడే ప్రమాదముంది...."

"చెప్పు....ఎవడాబావ....ఏమాకథ...."

"ఏం చెప్పను....చేజారిన పెన్నిధిగురించి .......కాలిపోయిన గతం గురించి ఎలా చెప్పను...."

"చెప్పితీరాలి...." నేలపై చదికిలబడి కాళ్ళు నేల రాస్తూ మారాం చేసాడు.

"....అదంతా ఓ పెద్దకథ...." గాఢంగా నిట్టూరుస్తూ కిటికీకి క్లోజ్‌గా నిలబడింది.

"వూచలు పీకేయకు....అసలు సంగతి చెప్పు...."

మరపురాని గతమది....మనోజ్ఞమైన కాలమది...."

"సినిమా డైలాగుల్చెప్పకు....తలకొట్టుకుని చావగలను"

"స్మృతుల శకలాల్ని సమాధి చేసుకుని దానిపై వైవాహిక శిథిల హార్మ్యాన్ని కట్టుకుని...."

"అమ్మో...." అంటూ పిచ్చివాడిలా బయటకు వరుగెత్తాడు. డయల్ చేసిన టెలిఫోన్‌లా టెలిగ్రాఫ్ ఆఫీసుకు పరుగెత్తి అర్జెంటుగా మామగారికి టెలిగ్రామ్ ఇచ్చేసాడు.

ఉన్న డబ్బుల్తో ఓ పెగ్గు పోసుకుని ఫుల్ బాటిల్ రమ్ము కొట్టినట్టు తూలి పడుతూ ఇంటివరకూ వచ్చి లోపలికి వెళ్ళలేక, వెళ్ళటానికి మనస్కరించక గోడవారనున్న చెత్తకుండీదగ్గర చదికిలపడిపోయాడు.

'ఇలా ఇలా జీవితం....పోతే పోనీ యీ క్షణం' అని కూనిరాగం తీస్తుంటే దగ్గర కొచ్చిన కుక్కను చూసి కరుస్తుందేమో అనుకున్నాడు.

మామగారు ఉన్నపళాన సరఫరా అయ్యేడు. అల్లుడి అభియోగాలన్నింటినీ విన్న మామగారు "అయ్యో ఖర్మా!..దానికసలు జావాతేడు జోషాణంతేదు" అన

కవితకి కార్టూన్ :




రేపటి తీరం చేరవలసిన
నాటు పడవ
గడ్డకట్టిన నది మధ్యన
చిక్కుపడిపోయింది యెలా?

-దేవిప్రియ

గానే క్షణంపాటు బిగుసుకు పోయాడు.

'నిజం'

"నిజం. మీబామ్మతోడు...."

"బామ్మతోడా....అయితే నమ్మతా"

"నిజంనాయనా...."

"మరైతే అబద్ధం ఎందుకు చెప్పినట్టు.."

"నా డైలాగుల్తో మీడైలాగుల్ని ఢీకొట్టాలని...." ఎగతాళిగా అంది సీత.

"ఆ"

"మీ చచ్చుసినిమా డైలాగులికి ఫుల్‌స్టాప్ పెట్టించాలని."

"ఊ"

"నన్నుక్షమించు సీతా...."

రెండడుగులు ముందుకేసాడు.

"పశ్చాత్తాపంతో మీ హృదయం ప్రక్షాళనమైంది"

రెండడుగులు ముందుకేసి నవ్వు ఫక్కిలో అంది.

"మనం మామూలుగా మాట్లాడుకుందాం...."

ఆమెను దగ్గరకు లాక్కున్నాడు.

మామగారు బయటకు నడిచాడు. ●



జ్యోతి కూడా నన్నో పట్టాన వదిలి పెట్టలేదు. అరుణ కోపంతో నాతో మాట్లాడక పోవడం-యాత్రల్లో వున్న అమ్మకి ఒంట్లో బాగుండలేదని వుత్తరం రావడం—జ్యోతి ఆకాశరామన్న వుత్తరం నాకోటి రాసి తనకో ఆకాశరామన్న ఉత్తరం వచ్చిందని భయం నటిస్తూ ఎత్తులు వేయసాగింది జ్యోతి [illegible] ఎక్కువగ్గాయి. అందుకే అదేం పట్టించుకోలేదు. ఇదంతా తిక్కగా జ్యోతి చేసిందని తీసిపారేశాను. ఆ వెనక ఆ తలిదండ్రుల హస్తం కూడా వుందని ఆ తర్వాత కాని తెలియలేదు. నీకోసం విజయవాడలో వెతికి నిరాశగా హైదరాబాదు వచ్చేసరికి మరో ఆకాశరామన్న వుత్తరం–రావుగారి దగ్గర నుండి అర్జంటుగా రమ్మని కబురు. ఏమిటా అని వెడితే రెండు ఆకాశరామన్న ఉత్తరాలు వచ్చేయట. నేను వాళ్ళింట్లో [illegible]గా [illegible]న్నాను. దానికి రకరకాల వ్యాఖ్యానాలు బయలు దేరాయట—జ్యోతి మంచం దిగట్లేదట—[illegible] ఏవో చెప్పి ఆడపిల్ల మీదకి అపవాదు వస్తే అది మాసిపోదని, నేను "ఊ" అం[illegible] [illegible]ర్తం పెట్టిస్తానని మొదలు పెట్టేరు. నేను [illegible]విధాల మర్యాదగా [illegible] ళ్ళు వినలేదు. నేను శాంతంగా చెప్తున్న కొద్దీ వాళ్ళు [illegible]లికేస్తే చేతికి చేసికే కాలకే అన్నట్లుగా మాట్లాడసాగారు. ఆఖరికి కాస్త గట్టిగా అన్నాను "అలాంటి వుత్తరాలు కాని, పుకార్లు కాని నమ్మద్దే" ని "అదెల్లా సాధ్యమోయ్ !" అన్నారు రావుగారు "అయితే నాకు జ్యోతి గురించి చెడుగా వుత్తరాలు వచ్చేయి—నమ్మమంటారా ?" అన్నాను. దాంతో ఇద్దర నోటికీ తాళం పడింది. కాని నన్ను తరచు బాధిస్తూనే వుండేవారు.

"మీరా ! ఆ రోజు నిన్ను ఇక్కడ చూసి ఎంత ఆశ్చర్య పోయానో—ఎంత ఆనందించానో నీకు తెలియదు. తర్వాత నీ ఈ పరిస్థితికి నేనే కారణమని ఎంత కుమిలి పోయానో కూడా నీకు తెలియదు. నీతో మాట్లాడబోతే నువ్వా సావకాశమే ఇవ్వలేదు. అరుణ వచ్చేకా అన్నీ సర్దుకుంటాయని ఆశించేను. అది జరగలేదు ఆ రోజు హాస్పిటల్

దగ్గర బాబుని చూసిన రోజు—నా పరిస్థితి వర్ణనాతీతం. నీతో మాట్లాడబోతే కఠినంగా శాసించేవు—ఒక్కొక్కసారి అరుణకి అంతా చెప్పేద్దామా అనిపించేది. అసలే కోపంలో వున్న నువ్వు ఏ అఘాయిత్యానికి ఒడికడతావోనని భయపడి వూరుకొనే వాడిని.

"మీరా! మొదటి నుండీ జరిగినదంతా వివరంగా ఇందులో రాశాను. మొదట నీ మీద నాకెలా కోపం వుండేదో కూడా దాచకుండా రాశాను. నీకు ఇష్టమైతే—నువు "ఊ" అంటే సంతోషంగా నిండు మనసుతో ఈ చివరనుండి చేతులుచాచి నిన్ను అందు కోవడానికి సిద్ధంగా వున్నాను....నన్ను నువ్వు క్షమించలేకపోతే నేను తప్పుకోవటానికి సిద్ధంగా వున్నాను. తప్పు చేసింది నేను—శిక్షకూడా నేనే అనుభవించాలి. మావయ్య మీ గురించి ఎంత బాధపడుతున్నాడో నీకు తెలియకపోవచ్చు—నాకు బాగా తెలుసు. నా గురించి పెద్దవాళ్ళని—వాళ్ళ మనసుల్ని బాధపెట్టద్దని కోరుతున్నాను. ఇక్కడికి రావటా నికి నువ్వే సుముఖంగా లేవని విన్నాను. ఇక్కడ అమ్మా, మావయ్యా ఎందుకో అనుకుంటు న్నారు—అది నాకు తెలుసు—అది నా గురించి—అదే నిజమైతే నేనే తప్పుకుంటాను. అన్నీ తెలిసి ఇవన్నీ ఎందుకు రాయటం అని నువు అనుకోవచ్చు. రేపు సాయంత్రం వరకూ నా అదృష్టాన్ని పరీక్షించుకుంటాను—నువు బాబుని తీసుకుని రాకపోతే నాకా అదృష్టం లేదని—నువ్వు వేసిన శిక్షని సంతోషంగా భరిస్తాను—నా ప్రయాణం ఏర్పాట్లు చేసుకుం టాను. ఎప్పటికీ తిరిగిరాకుండానే వుండాలనే ప్రయత్నంలో వెడతాను—కానీ, అమ్మని ఈ వయసులో బాధ పెట్టాలి—అమ్మ నన్ను క్షమిస్తుంది. ఆ నమ్మకం నాకుంది. అంతా వివరంగా ఎందుకు రాస్తున్నానంటే అమ్మ—అమ్మని ఒక్క నా పెళ్ళి విషయం తప్ప ఇంకే విషయంలోనూ బాధపెట్టలేదు.......ఎప్పుడేనా అమ్మని చూడ్డానికి వస్తే ఆ ఇంటికి వచ్చేవాళ్ళల్లో నన్నూ ఒకడిగా భావించి—నన్ను అసహ్యించుకోకుండా ఆదరించలేకపోయినా—విసుక్కోకుండా గుప్పెడు మెతుకులు నా చేతిలో పెట్టమని వేడు కోవటమే... . .....

"అసలు సంగతి రాయటం మర్చిపోయాను. నేను నీ కనుచూపుమేర కనిపించ కుండా—అసలు ఎప్పటికీ కనిపించకుండా వెళ్ళిపోతే నీకు ఇక్కడికి రావటానికి అభ్యంతరం వుండదనుకుంటాను. ఇలా రాస్తున్నందుకు మరోలా అనుకోవద్దు. నీకు నమ్మకం కుదర టానికే వివరంగా రాయాలిసి వచ్చింది; నువ్వు ఇక్కడికి వచ్చిన దగ్గరనుండీ నువ్వంటే అమ్మకి వల్లమాలిన అభిమానం. ఇప్పుడు చెప్పనే అక్కరలేదు. నీ గురించి అమ్మ చాలా బాధ పడుతోంది. అమ్మంటే నీకు ఎంత గౌరవమో—అభిమానమో నాకు తెలియ నివి కావు. అందుకని మీరా! నిన్ను బాబుతో ఇక్కడే వుండమని ప్రార్థిస్తున్నాను. నువు దగ్గరుంటే నేనులేనిలోటు అమ్మకి చాలాభాగం తగ్గుతుంది. దయచేసి నా యీ కోరికని తిరస్కరించవద్దని మరోసారి ప్రార్థిస్తున్నాను.

"మీరా! నన్ను క్షమించగలిగితే రేపురా! క్షమించలేకపోతే—అది నీ వల్ల కాకపోతే ...నేను నాలుగురోజుల్లో వెళ్ళిపోతాను. నేను వెళ్ళేలోగానే రమ్మని అడుగుతున్నాను. బాబు ఈ ఇంట్లో తిరుగాడుతోంటే చూడాలనే కోరికని చంపుకోలేకుండా వున్నాను. అయినా నేను వెళ్ళేలోగా నాకో ముఖ్యమైన సంగతి చెప్పాలి. అక్కడకొచ్చి నీతో మాట్లాడ్డానికి వీలు వుండదు. ఎవరికేనా అనుమానం రావచ్చు. నేను వెళ్ళేలోగా రావటం మర్చిపోవద్దు.... . ...

—శేఖరం

○ ○ ○ ○ ○

చీకటి పడిపోయింది. మీరా అలాగే కాగితాలు చేతిలో పట్టుకుని కూర్చుంది.




"చీకట్లో కూర్చున్నావేం మీరా!" అక్కడ కొచ్చిన కాంతమ్మ లైటువేస్తూ అంది.

మీరా ఉలిక్కిపడి చప్పున కాగితాలు పక్కన పెట్టుకుంటూ లేచి నిలబడింది.

కూతుర్ని అదివరకులా "అలా వున్నావేం?" అని అడిగే ధైర్యం కాంతమ్మలో లేదు. అసలు ఈ వారం పదిరోజులుగా కూతుర్ని పలకరించటానికే భయపడుతోందావిడ.

కూతుర్ని పలకరించాలనికూడా ముఖం అటు పెట్టుకున్న కూతుర్ని మాట్లాడించే ధైర్యంలేక అక్కడినుండి వెళ్ళిపోయింది.

శేఖరం రాసిన ఉత్తరం మరోమారు చూసి-కవర్లో పెట్టింది.

మొదట—గుండెలు కొట్టుకొంటోంటే మొదటిలైనుమీద నిలిచి చూసిన మీరా కళ్ళు—తనకి తెలియకుండానే ఆ ముత్యాల జారులవెంట పరుగెత్తినాయి—

అంతా పూర్తిగా చదివేసరికి మీరాకి అయోమయంగా అన్పించసాగింది—

అరుణో ఏదో రాసుంటుంది తనకి అనుకుంది తను. తనకేం తెలుసు?- అంటే! అతను రేపో-ఎల్లుండో... ఇంకాపైన ఆలోచించలేక పోయింది.

విజయ దగ్గరకొస్తే వాడిని గుండెలకి అదుముకుని నిశ్శబ్దంగా రోదించసాగింది.

అలా ఎంతసేపు ఏడుస్తూ కూర్చుందో!

ఆ రాత్రి తల్లి ఎంత బ్రతిమాలినా భోజనం చేయలేదు.

మీరా పరిస్థితిని ఇంకోలా వూహించుకున్న కాంతమ్మ "నాకిష్టం లేందే ఏం జరగద"ని వాగ్దానం చేస్తున్నట్లు అంది.

మీరా దేనికీ మాట్లాడ లేదు.

ఆ రాత్రి మీరాకి నిద్రన్నమాట లేదు.

పలు రకాలుగా ఆలోచించింది.

అంతరాత్మకి—మనసుకి ఘర్షణ జరిగింది—

ఎప్పుడూ అంతరాత్మదే పైచేయి—అదే గెలిచింది—

శేఖరం రాసిన గడువు గుర్తుకొచ్చే సరికి—మీరాకి గుండె ఆగిపోయినట్టయింది—

భగవంతుడు నన్నెందుకిలా పరీక్షిస్తున్నాడు—

ఎప్పుడేనా పరాగ్గా కునుకు పడితే—భయంకరమైన కలలు రావటం—దాంతో లేచి కూర్చోవటం.

ఆ రాత్రంతా అలాగే జాగరణ చేసింది.

o o o o o

మర్నాడు—

తల్లికి ఏం చెప్పాలా—ఎలా చెప్పాలా—ఏం తోచనిదానిలా తిరగసాగింది.

అతను రాసిన గడువు ప్రకారం తను వెళ్ళలేదు. అది అతను ఇంకోలా అర్థం చేసుకుంటే ?

ఇలా ఎటూ తేల్చుకోలేకుండా వుంది.

విజయకి నీళ్ళుపోసి వాడికి ఒట్టలేస్తూ గదిలోవుంది మీరా.

వీధి తలుపు తట్టిన చప్పుడయింది—

మీరా గుండెలు దడదడ లాడాయి.

"అతను ఈరోజు వెళ్ళి పోతున్నాడా ? తను వెళ్ళలేదు. . వెళ్ళేముందు ఆ ముఖ్యమైన సంగతేదో చెప్పాలని వచ్చేడా ?....

మళ్ళీ తలుపు తట్టిన చప్పుడయింది.

వణికే కాళ్ళతో—అదిరే గుండెతో నెమ్మదిగా నడిచి వెళ్ళింది.

ఘడియ మీద చెయివేసి ఆగిపోయింది.

మళ్ళీ తలుపు చప్పుడు.

వచ్చిన వ్యక్తికోసం వూపిరి బిగబట్టి నెమ్మదిగా ఘడియ తీసింది.

తలుపులు తెరుచుకుని ప్రకాశంగారు లోపలికి వచ్చేరు.

తెల్లబోయి తనకేసి చూస్తూన్న కూతుర్ని "మీరా" ఆప్యాయంగా పిలిచారు.

తేరుకున్న మీరా "రండి" అంది.

తనని చూస్తూనే ముఖం చిట్లించుకుని వెళ్ళిపోయే మీరా మొదట తెల్లబోయినట్టు చూడటం—తర్వాత ఆప్యాయత నిండిన స్వరంతో ఆహ్వానించటం—ఆయన తబ్బిబ్బయి పోయారు ఈరోజు. తను లేచినరోజు మంచిదనుకున్నారు. ఈరోజు లేస్తూనే ఎవరి ముఖం జూశానా అనుకున్నారు. "ఆ ! శేఖరం ! శేఖరం ముఖమే చూశాడు. మనసులోనే శేఖరాన్ని ఆశీర్వదించేడు.

ఆలోచిస్తున్నట్టుగా నిలబడిన ప్రకాశంగారిని చూసి "కూర్చుండి" అని లోపలికెళ్ళింది.

చొక్కా నెత్తిమీద కప్పుకున్న విజయ కళ్ళు కప్పుకు పోవటంతో అదే తమాషాగా తడుముకుంటూ వస్తున్నాడు.

ప్రకాశంగారు వాడిని చప్పున ఎత్తుకున్నారు. వాడు బిక్క మొహం వేశాడు.

ఆయన వాడిని అటూ, ఇటూ తిప్పి అక్కడున్న బొమ్మలతో ఆడించసాగారు.

దాంతో వాడు నవ్వేశాడు - ఆయన సంతోషానికి లెక్కలేదు.

ఆయన వచ్చేరని తెలిసీ కూడా కాంతమ్మ ఇవతలకి రాలేదు.

మీరా మనసు ఆవిడకి అర్థంకాలేదు. ఇందుకే రాత్రంతా అలా వుందేమో అను

కుంది.

మీరా విజయకి తల దువ్వుదామని దువ్వెనతో అక్కడికి వచ్చింది. విజయతో ప్రకాశంగారు తనూ ఓ చంటి పిల్లాడిలా ఆడటం చూసి అలాగే నిలబడిపోయింది.

తల్లిని చూడగానే విజయ్ పరుగెత్తుకొచ్చి తల్లి దగ్గరకొచ్చేడు.

అప్పుడు గాని మీరా వచ్చింది ఆయన చూడలేదు.

మీరా అక్కడే నిలబడి విజయ్‌కి తల దువ్వుతోంది.

ఆయన మీరా దగ్గరగా వచ్చి, "అమ్మా, మీరా!" అని పిల్చేరు.

"ఏమిటి" న్నట్లుగా తలెత్తి చూసింది మీరా.

"అత్తమ్మ ద్వారా అన్నీ విన్నావు కదమ్మా!.. ఇంకా నామీద కోపం పోలేదామ్మా!" ఆయన కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి. "మిమ్మల్ని నా గుండెల్లో దాచు కుంటాను తల్లీ! మీ కేలోటూ రానివ్వను. నేను మిమ్మల్ని మోసం చేయాలని ఏనాడూ అనుకోలేదమ్మా! కనిపించకపోతే నేనేం చేయనని కూడా నిర్లక్ష్యంగా వుండలేదు తల్లీ! మీ కోసం అన్వేషిస్తూనే వున్నాను. నా అదృష్టం బాగుంది-దేవుడు నామీద దయతల చేడు. మిమ్మల్ని నా కళ్ళబడేశాడు........ఇప్పుడు మీరు నన్ను క్షమించలేకపోతే.. " ఆయన గొంతు దుఃఖంతో పూడుకుపోయింది. పై మీది కండువాతో కళ్ళు ఒత్తు కున్నారు.

మీరాకే కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఆయన చేతిమీద చెయివేస్తూ "బాధపడకండి" అంది మెల్లగా.

ఆ చిన్న మాటకే ఆయన సంబరడిపోతూ. "నా మీద కోపం పోయిందామ్మా !" అన్నారు.

"మీ మీద నాకెందుకు కోపం ?"

"అత్తయ్య మిమ్మల్ని తీసుకు రమ్మని పంపించింది—వెడదామామ్మా" సందేహిస్తూనే అడిగారు.

"మీఇష్టం" అంది తల వంచుకుని.

ప్రకాశంగారి సంతోషం వర్ణించలేం మీరా ఇంత తొందరగా ఒప్పుకుంటుదని ఆయన వూహించ నైనా వూహించ లేదు. మీరాకి ఇష్టంలేందే కాంతం ఒప్పుకోదు తను ఇలా భయపడి సందేహించి దూర దూరంగా వుంటే ఈ సమస్య పరిష్కారం కాదని మీరాతో మాట్లాడాలని ధైర్యం చేసి వచ్చేరాయన మీరా చాలా ఖచ్చితమైన మనిషిలా ఆయనకీ అనిపించింది. ఏదేవో ఘాటుగానే అంటుందని ఆయన అనుకున్నారు.

"ఇప్పుడే వెల్దామమ్మా మీరా! ఈ పూట మంచిది కూడాను అమ్మతో చెప్పు" అన్నారు.

"మీరు చెప్పండి" అని గదిలోకి వెళ్ళిపోయింది మీరా.

ప్రకాశంగారు సంతోషంగా లోపలికి వచ్చేరు "కాంతం" అని పిలిచేరు. కాంతమ్మ పలకలేదు వెనక్కి తిరిగి చూడలేదు. ఆవిడ వంకాయలు కోస్తోంది

ప్రకాశంగారు కాంతం దగ్గరగా వెళ్ళి, "కాంతం. మీరా నన్ను క్షమించింది అక్కడికి రావటానికి ఒప్పుకుంది. తొందరగా తెములు" అన్నారు.

కాంతమ్మ నమ్మలేనట్టు చూసింది.

"నిజం, కాంతం ! తొందరగా తెములు. మళ్ళీ వర్జ్యాలు వచ్చేస్తాయి" ఆయన సంబరంగా చెప్తోంటే కాంతమ్మకి అయోమయంగా అన్పించ సాగింది,

ఆవిడ మీరా దగ్గరికి వచ్చింది. మీరా అల్మారా దగ్గర నిలబడింది.




కాంతమ్మ మీరా దగ్గరగా వచ్చి భుజంమీద చేయివేస్తూ "మీరా" అంది.

మీరా ఇటు తిరక్కుండానే "ఏమిటమ్మా" అంది.

"నువ్వు అక్కడకి వెళ్ళటానికి ఒప్పుకున్నావా !"

"అవును."

"నాకోసమే కదూ !...."

ఆవిడింకా ఏదో అనబోతుంటే మధ్యలోనే అంది మీరా "అందరి కోసమూ నువ్వేం సందేహించకు నాకిష్టమే "అని క్షణం ఆగి, మళ్ళీ అంది." అమ్మా ! అక్కడ కనక నేను వుండలేకపోతే....నే నేదేనా ఉద్యోగం చేసుకుంటాను. ఇదొక్కటే నువు ఒప్పుకోవాలి."

అక్కడ ఎవరేనా తనని హేళన చేస్తారేమోనని—అవమానిస్తారేమోనని మీరా భయపడుతోందనుకుంది కాంతమ్మ, "అలా దానికి అవమానం జరిగితే తనుమాత్రం ఒక్కక్షణం వుండగలదా ?" అనుకుంది.

శాంతమ్మగారి అనురాగ పూరితమైన మాటలు గుర్తుకొచ్చి కాంతమ్మకి కొండంత ధైర్యం కలిగింది.

o o o o o

ప్రహారీ గోడకిరు ప్రక్కలా నోళ్ళు తెరుగుకున్న పెద్ద సింహాన్ని చూసి, మొదటి రోజులా భీతి చెందింది మీరా, కాని, వాటిమధ్య నిర్మలమైన బోసినోటితో నవ్వుతున్న గాంధీ తాత బొమ్మని చూసి—మొదటి రోజులోనే ధైర్యం తెచ్చుకుంది మీరా.

మీరా తల్లి వెనకాలే నిలబడింది.

కాంతమ్మ వచ్చేముందు ఎన్నో దేవుళ్ళకి మొక్కుకుని వచ్చింది. ఈ తన నిర్ణయం

శుభసూచకం కావాలనీ—తనకి వలె తన కూతురు జీవితం వృథా అవకుండా అతి తొందరలోనే దాని జీవితం చక్కబడాలని—దాని బాగు కోసమే నేనా నిర్ణయానికి వచ్చేను తండ్రీ ! అంటూ అనేక విధాల మొక్కుకుంది

అదిరే గుండెతో—వణికే కాళ్ళతో తల్లి వెనకాలే తనుకూడా ఎంతో నమ్మకంతో కుడికాలు ముందు పెట్టింది—

అప్పి పరుగున వెళ్ళి ముందే చెప్పటంతో శాంతమ్మగారు ఎర్రనీళ్ళ పళ్ళెంతో వచ్చింది.

అన్నగారిని వదినగారిని అక్కడే ఆగమని మీరా చేతిలో విజయ్‌ని తను తీసుకుని మీరాని "వాళ్ళకి హారతి పట్టి కట్నం అడుగు" అంది. ఆవిడకి చాలా సంతోషంగా వుంది.

మీరా అయోమయంగా చూస్తూ నిలబడింది.

"ఏమిటే దీనా ఈ చాదస్తం" అంది కాంతమ్మ. ఆవిడకేమిటోలా వుంది.

కాంతమ్మ మాటలు శాంతమ్మగారు పట్టించుకోలేదు. మీరా పరిస్థితి కూడా ఆవిడ గుర్తించే స్థితిలో లేదు, "ఊ; మీరా ! కానీయి కట్నం నీకూ నాకూ వస్తుంది. ఎంత వసూలు చేస్తావో !" తొందర చేసింది.

శేఖరం గొంతు కోసం ఒళ్ళంతా చెవులు చేసుకుని ఎదురు చూస్తున్న మీరా, ఆవిడ చెప్పినట్టు యాంత్రికంగా చేసింది.

అంతా భయం భయంగా వుంది మీరాకి.

విజయ్‌ని ప్రకాశంగారి చేతికిచ్చి కాంతమ్మ మీరాల మీద చెరో చెయీ వేసి ఇద్దర్నీ లోపలకి తీసుకెళ్ళింది శాంతమ్మ గారు.

విజయ్ కొత్త కొత్తగా చూస్తున్నాడు

శాంతమ్మగారు గబగబా కాఫీ చేసి పట్టుకొచ్చింది.

ఆవిడకి ఎక్కడలేని ఓపికా వచ్చింది.

వాళ్ళంతా కబుర్లలో పడ్డారు.

మీరా కొత్త దానిలా—వాళ్ళకి కాస్త దూరంలో బిడియంగా నిలబడింది.

"కూర్చోమ్మా, మీరా" అని ప్రకాశంగారూ, శాంతమ్మగారు రెండు మూడుసార్లు అన్నారు. మీరా అలా బిడియంగా వుండడానికి వాళ్ళు ఇంకోలా అనుకున్నారు. కూతురు అలా వుండడంతో కాంతమ్మ మనసు బాధపడింది. "దాని జీవితం చక్కబడితే తనకింకేం కావాలి ? ఇన్నాళ్ళబాధా తెలిగ్గా మర్చిపోతుంది—ఎలా జరగనున్నదో !" అనుకని బాధ పడింది.

శాంతమ్మగారూ, "మీరా ! ఏమిటి కొత్తదానిలా నిలబడ్డావు ? ఇలా వచ్చి కూర్చో ! నాకు మీ అమ్మన్నా కొత్తేమోకాని నువ్వుకాదు. అయినా మనిద్దరం కలసి వాళ్ళమీద దెబ్బలాడుతూ వుండాలి" అంది.

కాంతమ్మకి ఆవిడ మాటలతో మళ్ళీ ధైర్యం వచ్చింది. "ఎలాగయినా దానిచేత అసలు సంగతి చెప్పించి—అన్నీ చక్కబడాలంటే అది ఆవిడవల్లే కావాలి—అది ఆవిడకే చెతనవును" అనుకుంది

శాంతమ్మగారి వెనకాలే వంటగదిలోకి వెళ్ళింది కాంతమ్మ

ఈరోజు ఇద్దరికీ ఎక్కడలేని ఓపికా వచ్చింది.

సంతోషంతో తెచ్చిపెట్టుకున్న ఓపిక శాంతమ్మగారిది.

లేకపోతే ఎప్పుడూ నీరసంగా మంచం దిగనివాళ్ళు ఇద్దరి కిద్దరికీ ఎంత ఓపిక వచ్చింది ! ఇద్దర్నీ మీరా చిత్రంగా చూడసాగింది.

మీరా వాళ్ళతో లోపలకి వెళ్ళలేదు. అసలు మీరాకి ఏపనీ చేయబుద్ధి కావటంలేదు.

ప్రకాశంగారు విజయ్‌ని ఆడిస్తున్నారు. కాస్సేపటిలోనే ప్రకాశంగారి దగ్గర విజయకి భయంపోయింది. వాడితో సమానంగా ఆయనకూడా కింద కూర్చుని ఆడుతున్నారు.

వాళ్ళిద్దరిని చూస్తూ అక్కడే కూర్చుంది మీరా.

వీధిలో కారు ఆగిన చప్పుడుకి ఫులిక్కిపడింది మీరా.

చప్పున పక్కగదిలోకి తప్పుకుంది.

ప్రకాశంగారికి జాలేసింది. "అన్నీ సవ్యంగా జరక్కపోతే—ఆడపిల్లకి బెదురే" అనుకున్నారు బాధగా.

నిలబడలేనేమో అన్నంత ఇదిగా వణుకుతున్నాయి మీరా కాళ్ళు. విపరీతంగా గుండె కొట్టుకోసాగింది—తనగుండె కొట్టుకోవడం తనకే వినపడుతోంది. శేఖరం గొంతుకోసం ఒళ్ళంతా చెవులు చేసుకుని ఆత్రంగా ఎదురు చూడసాగింది.

శేఖరం లోపలికి వచ్చినట్లు బూట్లు చప్పుడయింది. మీరా చెయి గుండెలమీదికి వెళ్ళింది. కొద్దిగా ఇటు తిరిగి తలుపు సందులోంచి చూసింది.

శేఖరం విజయ్‌నే చూస్తున్నాడు—

శేఖరాన్ని చూడగానే విజయ్ బొమ్మల్ని వదిలి ప్రకాశంగారి దగ్గరగా వెళ్ళేడు.

"ఓ గంటయిందిరా వచ్చి" అన్నారు ప్రకాశంగారు విజయని ఎత్తుకు నిలబడుతూ. విజయ్ కొద్దిగా నోరు తెరిచి శేఖరాన్నే చూస్తున్నాడు.

ప్రకాశంగారు శేఖరంకేసి రెండు మూడు అడుగులు వేసి, "వెడతావా బాబయ్య దగ్గరికి" అన్నారు విజయ్‌తో. విజయ్ ఆయన భుజం మీద తల వాల్చేశాడు.

ఆయనన్న మాటకి శేఖరం ముఖం తిప్పుకున్నాడు.

అప్పుడే శేఖరం ముఖం తలుపు సందులోంచి పూర్తిగా కనిపించింది మీరాకి.

ఆ ముఖంలో ఇందాక విజయ్‌ని చూసినప్పటి ఆనందం రూపుకన్నా లేదు. అతని ముఖం చూస్తే విరక్తి—పాదం గూడు కట్టుకున్నట్టుగా కనిపిస్తోంది.

"శాంతా! శేఖరం వచ్చేడు" కేకేశారు ప్రకాశంగారు.

ప్రకాశంగారు సోఫాలో కూర్చుని పక్కన విజయ్‌ని కూర్చో పెట్టుకున్నారు.

శేఖరం వాళ్ళకి ఎదురు సోఫాలో కూర్చున్నాడు.

శాంతమ్మగారూ ఆవిడ వెనకాలే కాంతమ్మ వచ్చేరు.

"మీ అత్తయ్యని తీసుకొచ్చావురా! నాకు పైసా కట్నం ఇవ్వలేదు మీ అత్తయ్య" అంది శాంతమ్మగారు వస్తూనే.

సోఫాలో వెనక్కి జార్లబడి కూర్చున్న శేఖరం కాంతమ్మని చూడగానే కాస్త ముందుకి వంగి కూర్చున్నాడు. ఆవిడతో ఏం మాట్లాడాలో అతనికి అర్థంకాలేదు.

కొద్ది క్షణాల తర్వాత "మీ ఒంట్లో కులాసాగా వుంటోందా?" అని అడిగాడు.

"ఆ, కులాసాగానే వుంటోందమ్మా!" అంది కాంతమ్మ. శేఖరంకేసి ఆప్యాయంగా చూస్తూ. "భగవంతుడు ఈ కలపడం ఎప్పుడో కలిపితే——మీరా ఈ ఇంటి కోడలు కాకపోనా!" నిట్టూర్చిందావిడ.

శాంతమ్మగారు లోపలకెళ్ళి శేఖరానికి టీ పెట్టి తీసుకొచ్చింది.

"మావయ్య కేదీ?" అన్నాడు శేఖరం

"నేను రాగానే తీసుకున్నారా. ఇంక ఇప్పుడు తీసుకోను" అన్నారాయన.

విజయ్ సోఫాదిగి తల్లి కోసం ఇటూ, అటూ చూశాడు, తల్లి కనిపించకపోయే




సరికి కాంతమ్మ దగ్గరికి వెళ్ళి ఆవిడ కాళ్ళని ఆనుకుని నిలబడ్డాడు.

శేఖరం టీ కప్పు కిందపెట్టి పాంటు జేబులోంచి చాక్ లెట్ తీసి విజయ్ కేసి చెయి జాపాడు. వాడు రాలేదు.

రెప్పవాల్చకుండా శేఖరాన్నే చూడసాగాడు.

శేఖరం అక్కడే వున్న బొమ్మ కారుమీద చాక్ లెట్ పెట్టి విజయ్ కేసి తోశాడు. అయినా విజయ్ తీసుకోలేదు. చాక్ లెట్ కేసి, శేఖరంకేసి ఓసారి చూసాడు

కాంతమ్మ ముఖం దించుకుంది—

తర్వాత మెల్లగా "తీసుకో" అంది.

అయినా వాడు తీసుకోలేదు.

శాంతమ్మగారు చాక్ లెట్ తీసి వాడి చేతికిచ్చింది వాడు తీసుకున్నాడు. "ఏం ? ఇప్పుడు కావల్సి వచ్చిందా !" అంటూ వాడి బుగ్గ సొగడిసి, "వాణ్ణి నా దగ్గర వుంచేయ వమ్మా, వదినా ! నేను పెంచుతాను" అంది.

"తప్పకుండా వుంచుకోండి" అంది కాంతమ్మ. ఆవిడగొంతు ఎలాగో వుంది.

ఇది గ్రహించిన ప్రకాశంగారు. "ఆ నీఇష్టమే!" అని శాంతమ్మగారికేసి తిరిగి "వాడిని ఉంచుకుంటే నన్నూ ఉంచుకోవాలి" అన్నారు నవ్వుతూ.

వాళ్ళ మాటలు పెళ్ళిళ్ళ మీదకి మళ్ళాయి.

శేఖరం ఖాళీ కప్పు కింద పెట్టి లేచి నిలబడ్డాడు.

"మళ్ళా ఎక్కడికేనా వెళ్ళాలా?" అని అడిగారు ప్రకాశంగారు.

"ఆ!" అన్నాడు వాచీ చూసుకుంటూ.

"వంట అయిపోవచ్చింది భోజనం చేసి వెళ్ళరా" అంది శాంతమ్మగారు.

"పనుంది ఇప్పుడే వస్తాను. నా కోసం చూడకండి" అని వెళ్ళిపోయాడు
"ఏమిటో ఒక్కరోజు వేళపట్టున భోజనం చేయడు. ఈరోజో రేపో వూరు వెడతాట్ట" బాధగా అంది కాంతమ్మగారు.
ఏవూరు? ఏదేనా పనుందా?" ప్రకాశంగారు అడిగారు.
"ఏం పనో చెప్తాడా! బొంబాయి వెళ్ళాలి. కాస్త ఆలస్యమయినా కంగారు పడద్దని అప్పగింతలు పెట్టేడు. ఏమిటో! పెళ్ళీ పెటాకులూ లేకుండా వాడలా వున్నాడు. వీడు పెళ్ళి మాట ఎత్తితేనే అలా వెళ్ళిపోతాడు. వాళ్ళకి ఏం లోటు రానిచ్చేను చెప్పు! కన్నబిడ్డలాగానే చూశానుగాని" ఆవిడ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.
"నువ్వేం చేస్తావే! చదువులు చెప్పించేవు—వాళ్ళు వింటే పెళ్ళి చేస్తావుగాని లేకపోతే నువ్వేం చేస్తావు," అన్నారు ప్రకాశంగారు.
పక్కగదిలో వున్న మీరా నిలుచున్న చోటనే నీరసంగా కూర్చుండి పోయింది; కళ్ళల్లో నిలవలేని కన్నీళ్ళు చెంపల మీదుగా కిందకి జారుతున్నాయి శేఖరానికి యింత విరక్తి వచ్చిందనే వూహ మీరా గుండెని కోసేస్తోంది.
గోడకి ఆనుకుని కళ్ళు మూసుకుంది.
'తను వచ్చిన సంగతి తెలియనట్టే వెళ్ళి పోయాడు'

ㅇ ㅇ ㅇ ㅇ

ప్రకాశంగారి భోజనం అయింది. ఆయన భోజనం చేస్తోంటేనే విజయ్‌కి కాంతమ్మ అన్నం పెట్టేసింది.
తర్వాత కాంతమ్మగారు మీరాని పిలిచింది. శేఖరం రాకుండా మీరాకి అన్నం ఇష్టంలేదు. ఏమని చెపుతుంది—? "ఇప్పుడేనా" అంది.
"ఇంకా ఎప్పుడూ, పదకొండు దాటింది రా" అని ఆవిడ అందరికీ వడ్డించింది.
మీరా తప్పని సరిగా వచ్చి కూర్చుంది. విజయ్ మీరా ఒళ్ళో కూర్చున్నాడు.
అందరి భోజనాలు అయినాయి.
శేఖరం రాలేదు—
ప్రకాశంగారూ, కాంతమ్మా, శాంతమ్మగారూ కాస్సేపు కబుర్లు చెప్పుకున్నారు.
కాంతమ్మ అందరి గురించీ అడిగి తెలుసుకుంది.
రెండు గంటలు దాటేవరకూ కబుర్లు చెప్పుకుని తలో చోటా పడుకున్నారు. అన్నం తిన్న కాస్సేపటికే పడుకున్న విజయ్ వాళ్ళు పడుకున్న పైమీకిలేచి కూర్చున్నాడు.
వాడికి మంచినీళ్ళు పట్టించి రెండు బిస్కట్లిచ్చి—వాడిని ఆడిస్తూ హాల్లోనే కూర్చుంది.
మూడు గంటలవుతోంది.
కారు ఆగిన చప్పుడుకి చటుక్కున లేచి నిలబడింది మీరా కానీ, లోపలికి వెళ్ళిపోలేదు. గుమ్మం దగ్గర కెళ్ళి నిలబడింది.
"తను భయపడి పారిపోతే ఈ సమస్య పరిష్కారం కాదు" అనుకుంది.
శేఖరం లోపలికి వచ్చేడు శేఖరాన్ని చూడగానే విజయ్ లేచి నిలబడ్డాడు. శేఖరం పాంటు జేబులోంచి బిస్కెట్ పాకెట్టు తీసి, విజయ్ ముందుకి చెయి జాపాడు తీసుకోమనన్నట్టు.
విజయ్ తీసుకోలేదు—అక్కడనించి కదల్లేదు.
మీరా ధైర్యంచేసి కొద్దిగా కళ్ళెత్తి శేఖరంకేసి చూసింది

# సూపర్ రిన్‌తో
# తళతళలాడే తెలుపు



## మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే తెలుపు




మీ బట్టలకు కళ్లు తిప్పుకోలేనంత తెల్లదనం— క్రమం తప్పకుండా సూపర్ రిన్‌తో ఉతికితే వాటి తెల్లదనం అద్వితీయం. మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే మరింత తెల్లటి తెలుపునిస్తుంది సూపర్ రిన్. ఎందుకంటే, సూపర్ రిన్‌లో తెలుపు చేసే శక్తి ఎక్కువ.

**తెలుపు చేసే శక్తిని మీకు మీరే రుజువు చేసుకోండి :**

మరే ఇతర డిటర్జంట్ బార్‌తోనైనా ఉతికినది





సూపర్ రిన్‌తో ఉతికినది

**సూపర్ రిన్‌తో**
**తెలుపు చేసే శక్తి ఎక్కువ**

శేఖరం చూపులు విజయ్ నే హత్తుకుని వున్నాయి. విజయ్‌ని తదేకంగా చూస్తూన్న ఆ కళ్ళల్లో ఎంత కాంతి !

శేఖరం బిస్కట్ పాకెట్ విజయ్ చేతికి దగ్గరగా జరిపాడు.

వాడు శేఖరాన్ని చూస్తూనే పాకెట్టు అందుకున్నాడు.

శేఖరం లోపలే నవ్వుకుని—గదిలోకి వెళ్ళిపోయాడు.

విజయ్ బిస్కట్ పాకెట్టుతో తల్లి దగ్గరకొచ్చి చూపించేడు.

పాకెట్టు విప్పి రెండు బిస్కట్లు వాడికిచ్చింది మీరా.

ఏం చేయాలో తోచని పరిస్థితిలో అలాగే నిలబడి పోయింది మీరా.

అప్పుడే అతనొచ్చి అర్ధ గంట అవుతోంది. అతని దగ్గరకెళ్ళి ఏదో చెప్పాలని.... వెళ్ళడానికి ధైర్యం చాలటంలేదు.

గేటు చప్పుడయితే ఎవరా అని చూసింది మీరా—బాచి వచ్చేడు.

"ఎప్పుడొచ్చారక్కా" అడిగాడు బాచి.

"పొద్దున్న వచ్చేం" అంది.

"శేఖరంగారు వున్నారా అక్కా ?"

"ఆ!-ఏం?" అంది "మళ్ళీ అతనెక్కడికేనా వెళ్ళిపోతాడా?" అనుకుని?

బాచి సంచీలోంచి పొడుగాటి కవరు తీశాడు. "ఇది ఆయన కియ్యాలి. పడుకున్నారా?" అన్నాడు.

"పడుకున్నట్టున్నారు—నేనిస్తాలే!" అని చేయిజాపింది. ఇదే సమయం అతనితో మాట్లాడాలంటే అనుకుంది.

బాచి మీరాకి కవరు ఇచ్చేడు.

"ఇంకా ఏమైనా చెప్పాలా" అని అడిగింది;

"ఇంకేం చెప్పక్కర లేదు - ఆయనే పంపేరు దీని కోసం. వస్తానక్కా. ఇంకా భోజనం చేయలేదు."

"సరే వెళ్ళిరా" అని లోపల కొచ్చింది.

విజయ్‌ని ఎత్తుకుని శేఖరం గదిలోకి వచ్చింది.

శేఖరం మంచంమీద దిళ్ళకి ఆనుకొని కళ్ళమీద చేతులుంచుకుని కూర్చున్నాడు-

మీరా గుండె పట్టుకున్నట్టయింది-

పాదాల సవ్వడికి శేఖరం కళ్ళు తెరిచాడు— వెంటనే లేచి నిలబడ్డాడు.

క్షణంలో సగంసేపు ఇద్దరి చూపులూ కలుసుకుని విడిపోయాయి-

శేఖరం చూపులు మీరా మీంచి విజయ్‌మీదకి మళ్ళేయి-ఈసారి విజయ్ నవ్వేడు.

మీరా ధైర్యం చేసి లోపలికి నాలుగడుగులు వేసింది.

"బాచి ఇచ్చేడు" అంటూ కవరు టేబుల్‌మీద పెట్టింది.

శేఖరం ఆ కవరు తీసుకుని-దాన్ని జాగ్రత్తగా తెరిచి కాగితాలు తీసి చూడ సాగాడు.

కాసేపు అతనేమన్నా మాట్లాడతాడేమోనని చూసింది;

అతనికా కాగితాలు చూడ్డం ఎప్పటికీ అయ్యేట్టుగా కనిపించలేదు మీరాకి

"భోజనానికి వస్తారా !" ధైర్యం తెచ్చుకుని నెమ్మదిగా అడిగింది.

శేఖరం కాగితాల్లోంచి దృష్టి మళ్ళించకుండానే "అయిందీ—చేసే వచ్చేను" ఏ భావమూ లేకుండా మామూలుగా అన్నాడు.

కాస్సేపు తటపటాయించిన మీరా గొంతు పెగల్చుకుని "మీ ప్రయాణం...." ఎలా




పూర్తి చేయాలో—అసలు ఎలా అడిగితె అతనికి కోపం రాకుండా వుంటుందో తెలియక ఆగిపోయింది.

కొద్దిగా కళ్ళెత్తి మీరాకేసి చూసిన శేఖరం వెంటనే మళ్ళీ కాగితాల మీదకి దృష్టి మళ్ళించి "తెల్లారగట్ట వెళ్ళిపోతున్నాను" అన్నాడు అలా అంటున్నప్పుడు అతని ముఖం అదోలా అయిపోవడం మీరా గ్రహించింది.

"మీరు వెళ్ళద్దు—" ఎలాగో దుఃఖాన్ని దిగమింగి అంది.

"నేను వెళ్ళి తీరాలి" అతని స్వరంలో ఈసారి తీవ్రత ధ్వనించింది

"వీడి సంగతి ఏం చేద్దామని...." మీరా గొంతు పట్టుకుంది. అతని వరస చూస్తే అన్న మాటకి తిరుగులేనట్టుంది

శేఖరం చూపులు విజయ్ మీదికి మళ్ళి అక్కడ స్థిరంగా నిల్చాయి

చేతిలో కాగితాలు మడతపెడ్తూ అన్నాడు "వాడికి నేనేం అన్యాయం చేయను—ఇదిగో! ఈ కాగితాలు వచ్చేకా నీతో చెప్పాలనుకుంటున్నాను" అతను క్షణం ఆగి కిటికీ దగ్గరగా వెళుతూ మళ్ళీ అన్నాడు. నా వ్యవహారాలన్నీ నా ప్రియ మిత్రుడు రాఘవరెడ్డి చూస్తాడు—విజయ్‌కి ఏలోటూ రావటానికి వీల్లేదు—ఫాక్టరీమీద నా వాటాకి వచ్చేదీ—ఇంకా పొలంమీద వచ్చేది ఓ పంటడబ్బూ విజయ్‌ది వాడికి మైనారిటీ తీరేవరకూ నువ్వు గార్డియన్‌గా వుంటావు—అదీ నువ్వు నామమాత్రమే—అన్నీ రెడ్డే చూసుకుంటాడు" అతను ఆగాడు.

అతను ఆ చెప్పటం తీరు చూస్తే నేను చెప్పిన దానికి తిరుగు లేదన్నట్టుంది

"ఇంక వాడికి నే నెందుకు ? వాడిని ఎవరికేనా అప్పగించి వెళ్ళండి—లేకపోతే ఏ అనాథ శరణాలయంకేనా అప్పగించి వెళ్ళండి"

"మీరా !!" తీవ్రంగా ధ్వనించింది అతని స్వరం. "అంత ఖర్మేం పట్టింది వాడికి.... అంటే—నీ వుద్దేశ్యం నాకర్థమయింది. నాదీ అనేది పైసాకూడా వాడికి ఖర్చు కాకూడదు—అదేకదూ నీ అభిప్రాయం ? ఈ విషయంలో మాత్రం నీ మాట వినదల్చుకోలేదు—విననూ—"

విజయ మీరా చేతిలోంచి కిందికి దిగాడు.

మీరాకి వెర్రి దుఃఖమొచ్చింది. తన మనసు అతనికి ఎలా అర్థమవుతుంది అతనికి అర్థమయేలా తనెలా చెప్పగలదు

మీరా కళ్ళల్లో తిరిగిన కన్నీళ్ళు శేఖరం చూశాడు. తను అంత తీవ్రంగా మాట్లాడి వుండకూడదనిపించింది. అతను మీరాకేసి రెండడుగులువేసి "నీ మనసుకి కష్టం కలిగించేమాట ఏదైనా అంటే క్షమించు మీరా! నిన్ను బాధ పెట్టాలని నా వుద్దేశం కాదు. ....మనిద్దరి మధ్యా వాడు నలిగిపోకూడదు—వాడి భవిష్యత్తు పాడవకూడదు... నామాట మన్నించి—ఇలా వెళ్ళిపోయేముందు నువ్వొచ్చినందుకు నాకు చాలా ఆనందంగా వుంది. అందుకు నీకు కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను "మృదువుగా పలికిన ఆ మాటలకి మీరాకి ఇంకా దుఃఖమొచ్చింది. "అయ్యో! నా బాధ ఇతనికి ఎలా చెప్పాలి— ఎలా చెబితే అతను నమ్ముతాడు-ఎలా చెపితే అతనికి కోపంరాదు?"

విజయ్‌కి అక్కడ ఆడుకోవడానికి వస్తువులేవీ లేవు. ఇటూ, అటూ చూస్తూ నిలబడ్డాడు. శేఖరం రేడియో మీద పెట్టిన బొమ్మతీసి వాడికిచ్చేడు.

అది తీసుకుని కింద కూర్చున్నాడు.

విజయ నెమలి బొమ్మతో ఆడుకొంటోంటే సంబరంగా చూస్తూ నిలబడ్డాడు శేఖరం.

అతను చెప్పదలచింది చెప్పేశాడు-ఇంకేం మాట్లాడడు అనుకున్న మీరా అతనికేసి తిరుగుతూ అంది. "మీకు వాడంటే ప్రాణం అని తెలుస్తూనేవుంది. నాగురించి మీరు అందర్నీ వదిలి వెళ్ళక్కరలేదు. విజయని మీ దగ్గరే ఉంచుకోండి—నేనే వెళ్ళిపోతాను"

"తల్లి నీ—బిడ్డనీ వేరు చేసేటంత మూర్ఖుణ్ని కాను" క్షణం ఆగి, మళ్ళీ అన్నాడు "నాకూ ఏదేనా చేయాలనే అనిపించింది—కానీ, నువ్వందుకు ఇష్టపడవనీ, అంగీకరించవనీ ఆ ప్రయత్నం మానుకున్నాను"

ఛి. ఛీ! తనేమని అంది, అతనేమనుకున్నాడు—విజయ్ విషయంలో కూడా అతను డబ్బు గురించే అనుకున్నాడు.

శేఖరం కిటికీ దగ్గరగా వెళుతూ అన్నాడు నిర్లిప్తత నిండిన స్వరంతో "మీరంతా ఒకళ్ళ కొకళ్ళు కావాలి-మధ్యన నేనెందుకు అపశ్రుతిలా! అయినా తప్పు చేసింది నేను, శిక్ష నేనే అనుభవించాలి—అందుకే వెళ్ళిపోదలుచుకున్నాను."

మీరా గోడవేపు ముఖం తిప్పేసుకుంది. ఎంత ఆపుకుందామన్నా మీరాకి, దుఃఖం ఆగల్లేదు. "నాకు తెలుసు మీరు నా మీద కోపంతో వెళ్ళిపోతున్నారు ...... ....." వెక్కిళ్ళమధ్య అంది.

"మీరా?" శేఖరం ఇటు తిరిగాడు,

మీరా గోడకేసి మొహంపెట్టి ఏడుస్తోంది.

శేఖరం మీరాకి కాస్త దూరంలో టేబిల్ దగ్గర నిలబడ్డాడు.

"మీరా! నా మీద బాధపడుతున్నావా? . అది నేను భరించలేను. నా మీద నీకు




ఎంత అసహ్యం వున్నా సరే—సంతోషంగా భరిస్తాను-వేలెత్తి చూపే తప్పు నేను చేసేను కనక; అంతేకాని నా మీద జాలిపడితే మాత్రం భరించలేను— అయినా నీమీద నాకెందుకు కోపం? నేను వెళ్ళేముందు—నామాట మన్నించి విజయని తీసుకుని ఇలా వచ్చినందుకు నాకెంత ఆనందంగా వుందో నీకు తెలియదు మీరా............... మీరా! నేను వెళ్ళేముందు నా ఈ ఆనందాన్ని—నిబ్బరాన్ని పాడు చేయద్దని వేడుకుంటున్నాను" అర్థిస్తున్నట్టుగా అన్నాడు.

"నా మీద కోపం లేకపోతే ఎందుకు వెళ్ళిపోతారు? ఇన్నాళ్ళు-మీకు మంచితనం గుర్తించనందుకు నాకు శాస్తి చేయాలని వెళ్ళిపోతున్నారు—నాకు తెలుసు.. " ఇంకా ఏడుస్తూనే అంది.

"మీరా!" బాధగా పిల్చేడు. "నీ మీద నాకు కోపంలేదు. ఎలా చెపితే నమ్మ్తావు—అయినా అన్నీ వుత్తరంలో వివరంగా రాశానే! పూర్తిగా చదవలేదా?"

"అసలు. ..నేను . నేను నిన్నటి వరకూ ఆ కవరు చించనేలేదు—అరుణ రాసిందని ఇచ్చేరు—అప్పుడగా నామనసు కుదురులేక అలాగే వుంచేశాను-నిన్న—నిన్న సాయంత్రమే అది చదివేను" ఎలాగో గబగబా చెప్పేసింది.

శేఖరంనుండి ఎటువంటి జవాబూలేదు. అసలు మీరా అన్న మాటలకి అతను ఎలా ఫీలయ్యాడో చెప్పడం కష్టం. అతని కళ్ళుమాత్రం గోడకేసి మొహం పెట్టుకున్న మీరానే నిశితంగా చూస్తూన్నాయి.

తల్లి ఏడుపుకి బిత్తరపోయిన విజయ్ లేచి నిలబడ్డాడు. వెక్కి మొహం వేసుకుని ఇద్దర్ని మార్చి మార్చి చూడసాగాడు.

ఇంకా మీరా ఏడుస్తున్నట్లు ఆ భుజాల కదలికవల్ల తెలుస్తూనే వుంది.

కొంతసేపటికి తేరుకున్న శేఖరం నెమ్మదిగా పిల్చాడు "మీరా!"

తను అసలు సంగతి చెప్పగానే అతను చాలా సంతోషిస్తాడనీ-అతని చల్లని స్పర్శకోసం తహ తహ లాడుతున్న మీరాకి అతను నూతిలోంచి పిల్చినట్టుగా "మీరా"

అని పిల్చేసరికి నిరాశే కలిగింది.

తనను తాను నిగ్రహించుకుంటూ "మీరా"! అన్నాడు మళ్ళీ టేబుల్ మీద చేతులాన్చి.

ఇప్పుడు తను భయపడ కూడదు—సంకోచించ కూడదు అనుకున్న మీరా మెల్లగా ఇటు తిరిగింది. కళ్ళెత్తి అతనికేసి చూసే ధైర్యంలేక అతని పాదాలమీదనే దృష్టి నిలిపింది.

కొద్దిక్షణాలు ఇద్దరి మధ్యా నిశ్శబ్దం—

ఆ నిశ్శబ్దాన్ని మీరా భరించలేకుండా వుంది

వున్నట్టుండి అతను అన్నాడు "మీరా! ఇందాకనే చెప్పేను నా మీద జాలిపడితే నేను భరించలేను—సహించలేనని—అయినా ఇలాంటి విషయాల్లో ఏదో ఆవేశంలో—ఒకళ్ళ మీద జాలితో, సానుభూతితో నిర్ణయాలు తీసుకోకూడదు అలా జరిగితే—ఆ తర్వాత జీవితం ఎంత నరకమో వూహించడం కష్టం."

కొద్దిగా కళ్ళెత్తి అతనికేసి చూస్తూ అంది "అంటే—నేను చెప్పింది మీరు నమ్మలేదు" ఇంకా వివరంగా చెప్పాలని వున్నా చెప్పలేక పోయింది.

శేఖరం మీరా కళ్ళలోకే సూటిగా చూస్తున్నాడు.

ఆ కళ్ళు తనని మోసం చేయవు—చేయలేవు. ఇన్నాళ్ళూ తనంటే—మొదటి నించీ మొదట్లో తనంటే ఎంత నిర్లక్ష్యమో ఆ కళ్ళే ప్రకటించేయి—తర్వాత తనంటే ఎంత అసహ్యమో కూడా ఆ కళ్ళే అనుక్షణం వ్యక్తం చేసేవి ... ...

అలా—సూటిగా—తనని దూసుకు పోయే ఆ చూపులకి నిలద్రొక్కుకోలేని మీరా—తనంటే శేఖరానికి ఎంత ప్రాణమో తెలుసుకున్న మీరా—ఇంక దేనికీ తట్టుకోలేను అనుకున్న మీరా—సర్వ సంకోచాలూ వదిలి ఒక్కంగలో అతన్ని చేరి—అతని హృదయం మీద తల ఆన్చి ఏడ్చేసింది అలా ఏడుస్తూనే "నన్ను వదిలి మీరెక్కడికీ వెళ్ళద్దు—విజయ్ మీద ఒట్టు—నిజంగా నిన్నటి వరకూ ఆ కవరు నేను చూడలేదు. అది చదివినప్పటి నుండీ నేనెంత నరకం అనుభవించేనో మీకు తెలియదు." అంది.

క్షణంసేపు అయోమయంగా అన్పించి తెల్లబోయినా ఆ స్పర్శ అతనికి అన్నీ చెప్పినట్టయింది. అతని ఎడం చెయి మీరా భుజాల చుట్టూ పడింది. కుడిచేయి మీరా తలమీద వేసి ఆప్యాయంగా నిమురుతూ నెమ్మదిగా మెల్లని స్వరంతో మృదు గంభీరంగా అన్నాడు "మీరా! వూరుకో! నీమీద నాకెప్పుడూ కోపంలేదు—ఇంకెప్పుడూ కోపంరాదు. నువు సుఖపడటానికి ఏమయినా చేస్తాను—ఇంతవరకూ నువ్వనుభవించిన ఈ నరకాన్నంతా—ఆ సంగతులన్నీ —ఏ సినిమాలోనో చూసినట్లో—ఏ కథలోనో చదివినట్లో అన్పించేటట్లు చేస్తానంటే నమ్ముతావా, మీరా!"

"నమ్ముతాను—ఆ వుత్తరమే నేను చూడకపోతే మీ మంచితనం నాకు తెలిసేది కాదు. మీ మంచితనం చేతులు చాచి రమ్మంటే నా అదృష్టం నన్ను ముందుకు నెట్టి మిమ్మల్ని చేరుకొనేలా చేసింది లేకపోతే నేనెంత దురదృష్టంలో పడి కొట్టు కొంటు న్నానో నాకు ఎప్పటికీ తెలిసేది కాదు."

"ఊహు! న్యాయం—ధర్మం నాలుగు పాదాల మీద నడిచినట్లు—మన ఇద్దరి అదృష్టం నాలుగు పాదాల మీద నిలిచి మన ఇద్దర్నీ ఒక దగ్గిరకి చేర్చింది" పొడిపొడిగా వున్న మీరా జుట్టులోకి వేళ్ళుదూర్చి నిమురుతూ—మీరా పాపటి మధ్య గడ్డం ఆన్చి కళ్ళు మూసుకున్నాడు శేఖరం.

తనదీ అనుకున్న ఈ బంగారు క్షణం—కదిలితే ఎక్కడ కలలా చెదిరి పోతుందో అన్నంత భయంగా అతన్ని లతలా అల్లుకుపోయి "ఇంక నాకేం భయంలేదు" అన్న నిశ్చింతతో అతని గుడిలాంటి గుండెల మీద తలఆన్చి నిశ్చింతగా కళ్ళు మూసుకుంది మీరా.

(సమాప్తం)

# పొడవని పొద్దు

## దేవరాజు మహారాజు

"ఓరి పోరడా ఇంక లేవవేందిరా" - తల్లి గొంతు కఠినంగా వినిపించేసరికి కళ్ళు తెరిచాడు పోశిగాడు. లెమ్మని అంతకు ముందునుంచీ తల్లి చెబుతూనే వుంది. తల్లి గొంతూ, ఆమె నీళ్ళగోళెం నింపుతున్న చప్పుడూ, గుడిసెముందునుండి గొర్రెజీవాలు అరుచుకుంటూ పోయిన చప్పుడూ, గుడిసె వెనుక 'జాలాటిబండ' దగ్గర కాకుల చప్పుడూ అన్నీ వినిపిస్తూనే వున్నాయి. కాని మగతగా బద్ధకంగా వుండడంవల్ల లేవాలనిపించడంలేదు. లేవడం, పశువుల్ని కొట్టుకుని పోవడం, దినమంతా ఎండలో తిరగడం........అదే పని. పనిలో కొత్తదనం లేదు. పనిలో ఉత్సాహం లేదు. అందుకే లేవాలనిపించడంలేదు. విసిగిపోయి తల్లి కఠినంగా కేకేసేసరికి లేవక తప్పింది కాదు. చిరుగులు పట్టిన పాత చాప, సరిగా చుట్టొచ్చి చుట్టరాక చుట్టి గుడిసె వెనుక పెంటవైపు పరిగెత్తాడు. మూత్రం పోస్తూ నిలబడితే చెరువుకట్టమీద బెస్త ఎంకులు గాలాలు పట్టుకుని తండ్రితో పోతున్నాడు. ఎంకుల్ని పిలుద్దామనుకున్నాడు. కాని అల్లంత దూరంలో పోతున్న దొరోళ్ళ పశువులు కనిపించాయి. గుండెలో ధక్కుమంది. గుండెలో దప్పు చప్పుడు మొదలయ్యింది. గిరుక్కున వెనక్కి తిరిగి నీళ్ళ గోళెంలోని నీళ్ళు దోసిలితో తీసుకుని నోరు, కళ్ళు కడుక్కున్నట్టు చేసి గుడిసెల్లో కొచ్చాడు. తన 'గుతుపకట్టె' వెతికి తీసుకుని, ఒట్టి లాగు ఎగేసుకుంటూ గుడిసెలోంచి గుతేరురాయిలాగా బయటపడ్డాడు.

"ఇగో పోశిగా!" తల్లి పిలుపు వినిపించి ఆగి వెనక్కి తిరిగాడు. పాతగుడ్డలో కట్టిన రాతివెండి గిన్నె తల్లి ఎదురుగా తెచ్చింది. "మాపటిది బువ్వంది కొంటవోరాదు"- అంది. తల్లివైపు సరిగా చూడకుండానే గిన్నె అందుకుని మళ్ళీ అంత వేగంగా పరుగందుకున్నాడు. గుండెలో యింకా దప్పు మోగుతున్నట్టుగానే వుంది. తాత ఎంత కొడతాడోనని-

'పోశిగా'-అని అందరూ పిలిచే పోశయ్యకు ఎనిమిదేళ్ళు నిండినయి. నల్లగా పీలగా వుంటాడు. వాడికి ఊరు, ఊర్లోని మనుషుల కన్నా, అడివి, అడివిలోని పశువులు, చేన్లు బాగా పరిచయం. కొద్ది సంవత్సరాల క్రితందాకా "మీ అయ్యేడిరా"- అని ఎవరైనా అడిగితే కళ్ళు చిత్రంగా తిప్పి 'దేవున్తానికి పొయ్యిండు'-అని చెప్పేవాడు. ఎదుటివాళ్ళ కళ్ళు చెమ్మగిల్లేవి. రాను రాను వాడికేదో అర్థమైపోయింది. అయ్యపేరెత్తగానే ముఖం మాడ్చుకుంటున్నాడు. అయ్యను తల్చుకుని అవ్వ ఏడుస్తున్నప్పుడు వాడి మనసునంతా ఎవరో తోడేస్తున్నట్లయ్యేది. అవ్వ ఏడుస్తూ ఏడుస్తూ వూళ్ళోని దొరల్ని, పటేళ్ళను తిడుతూ వుండేది. శపిస్తూ వుండేది. వాడికవేమీ అర్థం కాకుండేవి. తన తండ్రిని వాళ్ళేం చేసారో తెలిసేదికాదు. ఒకసారి తల్లి నడిగితే ఒళ్ళోకి లాక్కుని తల నిమురుతూ బిగ్గరగా ఏడ్చింది. పోశయ్యకు భయమేసింది.

వాడి గుండెలో దప్పు మోత యింకా

నో"-అని పురమాయించాడు. పోశయ్య వీరవైపు పరిగెత్తాడు. కొద్దిసేపటి తర్వాత "అమ్మా! బల్ద్రు గొట్కపోనొచ్చిన"-అని పసుపురంగు బంగళాముందు నిలబడ్డాడు. ఇంటివాళ్ళబ్బాయి వచ్చాడు. స్కూలు యూనిఫాంలో చక్కగా తయా




ఎక్కువైంది. 'తాతతోని గుద్దులు తప్పవ్' అనుకుని మొస దీసుకుంటూ వాగుదాకా పరిగెత్తాడు. అక్కడే తాత ఎవరితోనో మాట్లాడుతూ వున్నాడు. వంగి దండాలు పెడుతూ వున్నాడు. ఆ మాట్లాడే అతన్ని తనెప్పుడూ చూళ్ళేదు. ఎర్రగా బొద్దుగా వున్నాడు. తాతకన్నా చాలా చిన్న వాడు. అంత చిన్నోనికి తాత దండా లెందుకు పెడుతున్నాడో అర్థం కాలేదు తాత తనను చూసాడు. తన గుండె వూగు లాడినట్లయ్యింది. ఆలస్యంగా వచ్చినందుకు తిట్లు తప్పవ్ అని లోలోన వణికిపోతు న్నాడు. తాత ఏ ఆలోచనల్లో ఉన్నాడో-తిట్టలేదు. "గింత పొద్దెక్కెదాక పంటావుర పోరడ"-అని "ఇగ జూడు పట్నం లుండేటి శిన్న దొర కూడ ఎంత పొద్దాల లేసిండో" అని అతన్ని చూపించాడు. "ఆ- సర్ సర్ర బోయి పచ్చ బంగ్లోల్లయి బర్లు గొట్కరా

రయి వున్నాడు. వెంట్రుకలు నున్నగా దువ్వుకుని వున్నాడు. కాళ్ళకు తెల్ల మేజోళ్ళు, నల్లజోళ్ళు....అందంగా వున్నాడు. పోశయ్య అలా చూస్తూ నిలబడ్డాడు. తనకు కూడా అలా తయారవ్వాలని కోరిక. బడికి పోయి చదువుకోవాలని కోరిక...తనకంటే చిన్నవాడే యింటి వాళ్ళబ్బాయి. అయినా సరే పేరుపెట్టి పిలవొద్దట. 'శిన్నయ్యగారో'-అని పిలవాలట.

యింటి వాళ్ళబ్బాయి చిలిపిగా నవ్వి-"ఇదిగో నాకు రాసోక్కవడానికేమో మా

డాడీ యిచ్చారు"-అని పొడుగాటి వస్తువు చూపించాడు. పోశిగాడికి అర్థంకాలేదు. "ఏందది? సూపెట్టవా"-అని ప్రాధేయ పూర్వకంగా అడిగాడు.

"ఊ, నీకివ్వను—ఎవరికీ యివ్వొద్దంది చూద్దామనిపించింది. తను అరుగు కింద నిలబడ్డాడు. యింటివాళ్ళబ్బాయి అరుగుమీద నిలబడ్డాడు.

"ఒక్కసారి ఉట్టిగనే సూసిస్త"....అన్నాడు పోశయ్య. యింటివాళ్ళబ్బాయి



మా మమ్మి"

"ఇదీ బాల్‌పెన్. ఇలా ప్రెస్ చేసి రాస్కోవాలి"-అని యింటివాళ్ళబ్బాయి గోడమీద రాసాడు. నిజంగానే గోడమీద నీలి నీలి గీతలు కనిపించాయి. పోశయ్య కళ్ళు మెరిసాయి.

"ఏం రాశినవ్ ఆడ"

"ఫోర్ ట్వన్‌టీ" అని రాసా. నువ్వే 420" బొలబొలా నవ్వాడు యింటివాళ్ళబ్బాయి. పోశయ్యకు ఏమంటున్నాడో అర్థం కాలేదు. తను చదువుకుంటే తనకూ అర్థం అయ్యేది. ఒక్కసారి ఆ పెన్ను

"నో"— అని పెదాలు బిగించి, చేతుల్లో పెన్ను దాచుకుని తల అడ్డంగా తిప్పాడు. పోశయ్య — దగ్గరకెళ్ళి చూద్దామనుకుని కట్టె ఆసరాతో అరుగెక్కాడు. అది వూహించని యింటివాళ్ళబ్బాయి "మమ్మీ"....అని యింట్లోకి పరిగెత్తాడు.

"ఏమిట్రా సీను ఏమైంది?"—యింటావిడ పరిగెత్తుకొచ్చింది. సీను పోశయ్యని చూపించాడు. "పోశిగా బాబును బయపెడుతున్నావ్ .. తప్పుగాదూ. అట్ల దిరిగి దొడ్లెకు రాపో. బర్లకు కుడితి తాపించి కొట్కపోదువు గని. ."

"బయపెళ్లేదమ్మా - గది పెన్నంట! సూశిస్తనన్న గుత్తె"

"చదువు రావోనివి నీకవెందుకూ-ఫోఫో దొడ్లోకి ఫో" అమ్మగారు తనను తిట్టకుండానే తిడుతున్నట్లనిపించింది. సదువు రావోన్ని-సదువుకుంటే మంచి బట్టలు, పెన్నులు వస్తాయా? ఆలోచనలతో పోశిగాడు దొడ్లోకి వెళ్ళాడు. దొడ్లో బర్రెలను విడుస్తూండగా అమ్మగారొచ్చి "సాయంత్రం వొచ్చినప్పుడు పైసలిస్తగాని, బర్రెలను బాగా కడుక్కునిరా-ఏమంటున్న?"-అంది పోశిగాడు "ఆ" అన్నాడు, వెనకనే శ్రీని వాసొచ్చాడు. "మమ్మీ నేను స్కూలు కెళ్ళనుఫో"- అన్నాడు బుంగ మూతితో. "ఏం ఏమైయ్యింది?"

"బాలల సంవత్సరంమీద వ్యాసం రాసిమ్మంటే డాడి ఎందుకు రాయలేదు? ఆ పోను ఫో" — మళ్ళీ అదే బుంగ మూతి.... బాలల సంవత్సరమేమిటో, వ్యాసమేమిటో పోశయ్యకు అర్థం కాలేదు, ఆశ్చర్యంగా చూశాడు. యింటావిడ సీనూను లోనికి లాక్కెళ్ళింది. బర్రెలు కొట్టుకుని పోశిగాడు వీధిలో పడ్డాడు. వాగుదాకా వచ్చేసరికి తాతలేడు. వాగు దాటి కంచెవైపు పోతూ కనిపించాడు. పోశయ్య గేదెల్ని పరిగెత్తించాడు. కంచె చేరే సరికి తాత చుట్ట తాగుతూ రాయి మీద కూర్చున్నాడు.

"ఒస్తున్నావ్....నీ పోరని తల్వాలి.... ఎటుబోతే అటే బోతవేంరా లంజకొడ్కా" తిడుతూ రెండు దమ్ములాగాడు తాత.... "అగో-ఫో-గా ఆవుల మల్పిరాపో" ఆదేశించాడు. పోశిగాడు రెండు నిమిషాల్లో తిరిగొచ్చాడు, వాడి మనసులో సందేహం మెర మెర మంటోంది.

"తాత-"

"ఆ"- తాత నోట్లోంచి, ముక్కులోంచి పొగ.

"గప్పుడు వాగుకాడ గా పిలగాడెవలే"

"ఒశినీయక్క - పిలగాడంట వేంరా? కళ్ళు పోతయి. మన చిన్నదొర. ఆయిన కాడి జీతముండుకుంట పిలగాడంటావురా ముండకొడ్కా. తప్పుకాదు. మన దొరోరి చిన్నకొడుకు. పట్నంలుంటాడు. పెద్ద సదువులు సద్వవోల్లయిరి"

"దొరకన్న మంచి గున్నడు గాదె" సదువుకుంటే ఎరుపురంగు, అందం, ఆకర్షణ కూడా వస్తాయేమోనని పోశయ్య అపోహ-ఆశ!

"అవ్ మల్ల-ఎవలికొడుకు? దొరకొడ్కే నాయె—దొర లేకుండె వోయిసులుల్లప్పుడు?.......మన పెద్దొర గీశిన్న దొరంతున్నప్పుడు నేను నీయంతుంటి. గీన్నే పసుల గాస్తుంటి"

పోశయ్య మనసులో డప్పు చప్పుడు మళ్ళీ మొదలయ్యింది. యిన్నేండ్ల నుండి తాతకు యిదే పనా?

"యిన్నేండ్ల నుండి పసులే గాస్తున్నావ్"....

తాత బిగ్గరగా నవ్వాడు. పసులంటే ఎదో నిన్నియ్యాల పెద్దమనిషి నయ్యానని మల్ల పసులకాడి కొస్తాన. అంతకుముందు మోటగొట్టిన, భూమి దున్నిన. కుప్ప గొట్టిన అన్ని-పతొక్కపని చేసిన...."తాత ఉత్సాహంగా గతాన్ని నెమరేసుకున్నాడు. పోశయ్యకు మాత్రం ఉత్సాహంగా లేదు. కొద్దిసేపు వూరుకుని - భయం భయంగా పోశిగాడు "తాత-బడికి పోలమని మామయ్య చదుగుతనే"

తాత ఉత్సాహం ఒక్కసారి కడిగేసినట్లయింది. తపుక్కుమని ఊచాడు. "నీ బత్కు పాడుగాను. ఏం బుద్ధి పుట్టిందిర పోరడ నీకు. మంచిగ దొరతానుండక. తాబేదారు వైతవా, తాలుక్ దారు వైతవా? ఎన్నటికి మీనాయిన దొంతాన తీసుకున్న రెండొందలు ఎవలు తీర్చాలనుకున్నవే దొంగకాన?" తాత వేళన చేసాడు.

తాత మాటల్లోని అర్థం కొంత మాత్రమే అర్థమయ్యింది. చదువొద్దన్నందుకు

"మమ్మీ, ఈ దురద,
మంటను ఎలాగైనా ఆపవూ."



నైసిల్
ఉపయోగించండి
అతి శీఘ్రంగా
ఉపశమనమునిచ్చే
చెమటకాయల పౌడర్.




2 రకాల
డబ్బీలలో
దొరుకుతుంది.
'నీలం' మరియు
'చందనం.'

నైసిల్
తెచ్చుకోండి
చెమటకాయల
బాధ మరిచిపోండి.



ఔషధ యుక్త-నైసిల్
1. అధికమైన చెమటను నిరోధిస్తుంది.
2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధాన్ని కల్గించే సూక్ష్మ జీవులను నాశనం చేస్తుంది.
4. చర్మమునకు హాయి గొల్పుతుంది.

CASGLN-4-182 TEL

దుఃఖం లోపలినుండి తన్నుకొస్తోంది. బడికి పోతే మంచిగా నీడలో కూచోవచ్చు. మంచి బట్టలేసుకోవచ్చు. ఏ-ఫర్ ఏపిల్ చదువుకోవచ్చు. ఆడుకోవచ్చు. గంట కొట్టగానే యింటికెళ్ళిపోవచ్చు. ఇవన్నీ తనకు శేఖర్ చెప్పాడు. శేఖర్ హెడ్మాస్టర్ కొడుకు. తనతో బాగా మాట్లాడుతాడు. బడికి రమ్మని చెబుతుంటాడు. అప్పుడప్పుడు బలపాలిస్తుంటాడు. బడికి పోతే శేఖరం లాగానో, చిన్న దొరలాగానో, సినులాగానో వుండొచ్చునేమో. ఎన్నో ఆలోచనలు పోశయ్య మెదడును మేస్తున్నాయి.

"అరెరె-ఓరి పిల్లగా గట్ల సూస్తవేందిర? పసురాల్వోయి శేన్లు మేస్తుంటే?" - తాత కేకలు వినిపించే సరికి.... పసువులు పక్కనే వున్న వరి చేన్లోకి దిగాయి. లేచి పరిగెత్తాడు. పొలంమ్మీద పరుగెడుతూంటె తడి కాళ్ళకు బురదలోవున్న తుమ్మముల్లు గుచ్చుకుంది. "అమ్మా"-అని కేకేసి, పడ్చి దగ్గర ఎవరూ లేరు కాబట్టి తానే నిదానంగా తీసేసుకుని కుంటుకుంటూ పరిగెత్తి పశువుల్ని కొట్టుకొచ్చాడు.

పోశిగాడు బండపైకి వచ్చేసరికి తాత లేడు. బావివైపు వెళుతున్నాడు. దూరంగా కనిపించాడు. తాత బావివైపు పోతున్నాడంటే మధ్యాహ్నం తిండి తినే సమయమైందన్నమాట. పశువుల్ని అన్నీ చూసుకున్నాడు. వంటకాలవలో ముఖం కడుక్కున్నాడు. చుట్టూ చూసాడు. దూరంగా మైసం బావివద్ద పటేలోళ్ళు నారతో తాళ్ళు పేనుకుంటున్నారు. తాడిచెట్లనుండి గౌండ్ల లక్ష్మయ్య వస్తున్నాడు. వెనక అతని భార్య కల్లుకుండతో అనుసరిస్తోంది. కాలువలోని నీళ్ళు కళవెళ శబ్దం చేస్తున్నాయి. కోడెలు బరాబరా గడ్డి నోటితో పీకి తింటున్నాయి. చిన్న దుడ్డెలు (దూడలు) 'అంబా' అని తల్లి వెనకే నడుస్తున్నాయి. సూర్యుడు నెత్తిమీదికొచ్చాడు. పోశయ్య కడుపులో ఆకలి తీక్షణమైంది. రెండ్రోజులుగా తనొక్కడే కంచెలో పశువుల్ని మేపాల్సివస్తోంది....... మైసయ్య, యాదగిరి లేనందువల్ల ఏదో వెలితిగా, వెతుక్కున్నట్టుగా వుంది. వాళ్ళున్నప్పుడు ముగ్గురు కలిసి 'బువ్వ' తినేవారు. యాదగిరి పెద్దవాడు. పద్యాలు పాడేవాడు. కొద్ది రోజులు బడికి వెళ్ళాడు. అందుకని అ ఆ ఇ ఈలు రాయగలడు. అప్పుడప్పుడు బొగ్గుతో బండలమీద రాసి పోశయ్యను, మైసయ్యను ఆశ్చర్యంలో ముంచేవాడు. దొర యింటి ముందుగోడ కూలిపోతే కడుతున్నారు. వాళ్ళిద్దరు కూడా ఆ పనిలోనే వున్నారు. అన్ని పశువుల్ని పోశయ్యొక్కడే కాయాల్సొస్తుంది. తాత సహాయంగా వున్నట్టేకాని అస్తమానం చుట్టు పక్కలున్న బావులవద్దకు వెళ్ళి వాళ్ళతో బాతాఖానీ వేస్తుంటాడు.

పోశయ్యకు ఆకలి తీవ్రమైంది. గుడ్డలో కట్టిన గిన్నె విప్పుకున్నాడు, నాలుగు బుక్కలు పెట్టుకునేసరికి మైసంబాయి పటేలు కూతేసాడు. "ఎవలు ఎవలు ఎవ్రడో....పసులు ఒరశేన్ల బడ్డయి. ఒరిశేన్ల బడ్డయోయ్....ఓరి పిలగో" — వినబడడంతోనే పోశయ్య ఎడంచేతో కట్టె అందుకుని పరుగు లంకించుకున్నాడు. ముల్లు విరిగిన కాలు పరుగెత్తనీయలేదు. కుంటుతూనే పరిగెత్తాడు. కోపంకొద్దీ వరిచేన్లో పడ్డ పశువుల్ని కొట్టాడు. నీ యక్క....నీయవ్వ....బూతులు తిట్టాడు. పోశయ్య అలికిడి వినగానే పశువులన్నీ బుద్ధిగా దూరంగా పరిగెత్తాయి. మళ్ళీ పోశయ్య బండమీదికి చేరుకునేసరికి కాకులు కావు కావు మంటూ పోశయ్య గిన్నెలోని అన్నం తింటున్నాయి. పోశయ్య కట్టె విసిరాడు. కాకు లెగిరపొయ్యాయి. అన్నం కొంత బండమీద పడింది. ఒక్కక్షణం ఆలోచించాడు. ఆకలి బాగా మండిపోతుంది. బండమీది అన్నం ఇసిక లేకుండా దులుపుకుని తీసుకుని గిన్నెలో వేసుకున్నాడు. తన నోటిదగ్గర బుక్క లాక్కునే కాకులు తన




చుట్టూ ఎన్ని వున్నాయో పోశిగాడికి యింకా అర్థం కాలేదు.

అన్నం తిన్నాడుగాని సరిపోలేదు. ఆకలి తగ్గిందికాని పూర్తిగా తీరలేదు. కడుపు నిండా నీళ్ళు తాగాడు. గిన్నె కడిగాడు. పచ్చబంగళా ఆవిడ చెప్పిన పని జ్ఞాపకాని కొచ్చింది. బర్రెలను కడగడానికి ఉపక్రమించాడు. ఆ అమ్మ పైసలిస్తానంది. దొర పశువులతోపాటు అయ్యగారి పశువులు, పచ్చబంగళావాళ్ళ పశువులు కూడా కలుస్తాయి. దొరకు వాళ్ళకు ఏం సంబంధమో మరి? పోశయ్యకు తెలియదు. తాత కాయమని చెప్తున్నాడు. తను కాస్తున్నాడు. ఏమైతేనేం బర్రెలను కడుక్కొని తీసుకు పోతే పైస లిస్తానంది. పైసలతో బలపాలు కొనుక్కోవచ్చు. యాదగిరి రాగానే అక్షరాలు నేర్చుకోవచ్చు. అక్షరాలు వస్తే బళ్ళోకి రానిస్తారేమో -ఏమో యాదగిరి నడగాలి.

సూర్యుడు కొండలమీదికి దిగిపోతున్నాడు. దుమ్ము లేపుకుంటూ చిన్న మోటరు వూళ్ళోకి పోయింది. "దొర యాడికో పొయ్యొస్తున్నట్లున్నది" - అనుకున్నాడు పోశయ్య. పశువుల్ని కొట్టుకొచ్చి, ఊరివైపు దారి మళ్ళించాడు. కడిగిన బర్రెలు నల్లగా శుభ్రంగా ఉన్నాయ్. వాటిలో ఓ బర్రెమీదికెక్కాడు. బర్రె బెదిరి పరిగెత్తడం మొదలుపెట్టింది. 'చొ చొ చో'-అని దాని మెడ నిమిరాడు. పశువు నిదానించింది. ఎప్పుడో యాదగిరి పాడిన పాట పల్లవి జ్ఞాపకాని కొచ్చింది "నందామయ గురుడ నందామయా, తందాన పాటలే విందామయా" పదిసార్లు పాడాడు. ఆ తరువాత ఏదీ జ్ఞాపకం రాలేదు. పాడడం మానుకున్నాడు. ఊరు దగ్గరికి రాగానే బర్రెమీదనుంచి గెంతాడు.

దొర దొడ్లో పశువుల్ని విడిచి, కుడితి తాగించి, గడ్డి వేసి అయ్యవారింట్లో,

పచ్చబంగళాలో వాళ్ళ వాళ్ళ పశువుల్ని తోలి తిరిగొచ్చేటప్పుడు బంగళాముందు నిలబడి కూతేసాడు.

"అమ్మగారో....బల్ద్ర గడిగిన"

అమ్మగారు బయటకొచ్చి చూసి, నవ్వుకుంటూ పోయింది. పావుగంట తర్వాత వచ్చి ఇరవై పైసలిచ్చింది. అమ్మగారు అన్ని పైస లిస్తుందనుకోలేదు. ఎగిరి గంతేసే అంత పనైంది. అమ్మగారు లోనికి పోగానే పోశిగాడు అంతపని చేసాడు. నాలుగుసార్లు చూసుకుని ఇరవై పైసలు గుప్పిట్లో బిగ్గరగా పట్టుకున్నాడు, నడుస్తున్నాడు. పోతూపోతూ చెంగున ఎగిరి గంతేస్తున్నాడు. గుడిసెకు పోతువుంటే రచ్చబండదగ్గర పంచాయతీ ఆఫీసు రేడియోలో పాట వస్తోంది.

"ఈ బాలురు రేపటి పౌరులు

దేశపు వాకిటి జ్యోతులు"-పోశయ్య రేడియోలో చాలా విషయాలు విన్నాడు. కాని ఎప్పుడూ ఏదీ సరిగా అర్థం కాలేదు. ఈ పాట కొద్దిగా అర్థమయ్యేట్లుగానే అనిపించింది. కాని గుప్పిట్లో పైసల సంతోషం నిలువనీయలేదు. గుడిసెవైపు పరిగెత్తాడు.

గుడిసె చేరేసరికి చిమ్మని చీకటైంది. గుడిసెలో రోజులాగే దీపం మినుకుమినుకుమంటోంది. తల్లి కూలిపనినుండి అప్పుడే తిరిగొచ్చినట్లుంది. నీళ్ళ గోళెం దగ్గర చేతులు ముఖం కడుక్కుంటోంది. తల్లి దగ్గరికి పరిగెత్తిపోయి "అవ్వా యిగో"-అని పిడికిలి చూపాడు. తల్లిముఖం చిన్నగా వెలిగింది. "ఏందిర పోశాలు"-అడిగింది.

"పైసల్"

"యాడివి"

"బల్ద్ర గడిగితె అమ్మగారిచ్చింది - ఇగో"-పిడికిలి విప్పి చూపించాడు. ఐదు పైసల బిళ్ళలు నాలుగు కనిపించాయి. తల్లి ముఖంలో కొంత స్థిమితం, ప్రశాంతత కనిపించింది.

"నేనదే చూస్తాన. చేతిలొక్క పైస లేదు. కూళ్ళేమో పడకపాయె. ఇగతె. దుకణంమీదికి పోతాన. కారం ల గ్గింత ఉప్పనన్న కొన్కొస్త". పోశాలుకు భయమైంది. మనసులో డప్పు మోగినట్లు. తను యిరవై పైసలతో బలపాలు కొనుక్కుందామనుకున్నాడు.

"అ-ఫో నే బల్పాలు కొన్కుంట."

"బల్పాలా?" -వినగూడనిది విన్నట్టు ఆశ్చర్యం ప్రకటించింది.

"నీ రాతకు గదోటి తక్వయినాది యిట్తే" అని చేతుల్లోంచి పైసలు లాక్కుని గుడిసె బయటపడింది తల్లి విసుక్కుంటూ-పోశాలుకు ఏడు పొచ్చింది. కసి, కోపం, అసహ్యం ఏదో ఏమిటో తనకే సరిగా అర్థంకాదు. కాని మనసు ఉడికిపోతోంది. ఏడ్చి ఏడ్చి గుంజకు జారగిలబడ్డాడు, ముక్కు ఎగేస్తూ ఏడ్చాడు. తల్లి వచ్చిన అలికిడయింది, ఏడుస్తున్నందుకు తిడుతుందేమోనని నిశ్శబ్దంగా నేలమీదికి ఒరిగాడు. కుమిలి కుమిలి ఏడ్చాడు. నిద్ర పట్టేసింది. ఎంత సేపయ్యిందో, ఎంత రాత్రయ్యిందో తెలియదు.

తల్లి లేపి, కళ్ళు తుడిచి పొయ్యిదాకా తీసుకుపోయింది. గిన్నెలో వేడి వేడి గంజి, ఇన్ని మెతుకులు కనిపించాయి. పోశయ్యకు తినాలనిపించలేదు. లేవబోయ్యాడు-తల్లి పట్టుకుని కూచోబెట్టింది.

"మా నాయిన గాదు. బంగారి కొండగాదు. గట్లేడుస్తారు బిడ్డ. కళ్ళు జూడు ఎంతెర్రగయినయో - మీ నాయిన వుంటె మనకు గిన్ని కష్టాలెందుకు బిడ్డ?"—వేడి వేడి గంజి నోటి దగ్గర పెట్టింది. తల నిమిరింది. పోశయ్య నోరు తెరిచాడు. లోన ఆకలి కాలిపోతోంది. రెండు బుక్కలు మింగాడు.

"సద్వులు సద్వి రాజ్యాలేలే రాతలు మనకేడివి బిడ్డ? కూటికిలేనోల్లం. కూడు

గుడ్డ పువ్వోళ్లకు ఆ సద్వులు, మిద్దెలు. బంగ్లలువోళ్లకు ఆ సద్వులు, మనకేమై తది కొండ్క........ మీ నాయిన అనక పొయ్యేది, నిన్ను సద్వెచ్చి దొరబిడ్డను జేస్తనని-ఏది? నిన్ను నన్ను ఈ నర్కాపం లిడిశిపెట్టి-ఆ పుణ్యాతండ్రి మాయమాయె" తల్లి కండ్లొత్తుకుంటూ గంజి తాపించింది. కడుపులో వేడివేడి గంజి పెచ్చగా అనిపించింది. నీళ్ళతో మూతికూడా తల్లే తుడిచింది. పోశాలు లేచి వచ్చి తన పాత చింకి చాప పరుచుకున్నాడు. రచ్చబండ వద్ద వీధి నాటకం ఆడుతున్న చప్పుడు....

"గల్ గల్ మని భుజకీర్తులు అదరగ
గల్ గల్ మని భుజకీర్తులు అదరగ"

గుడిసెముందు కుక్క ఏడుస్తున్న చప్పుడు. గుడిసె వెనక నీళ్ళ గోళెం వద్ద తల్లి కుండలు కడుగుతున్న చప్పుడు... వినవస్తోంది. పోశయ్యకు నిద్రఎగిరిపొయ్యింది. అంతా చీకటి. గుంజకు మాత్రం ఉన్న దీపం మినుకు మినుకు మంటోంది. ఎర్రగా మండుతోంది. పోశిగానిలో బలీయమైన కోర్కె సజీవంగా మండుతోంది. వాడు బడికి పోదామనుకున్నాడు, కాని తిండి పువ్వోళ్ళకే చదువు అని తల్లి చెప్పింది. తనకు, మైసయ్యకు, యాదగిరికి, తాతకు తిండి సరిగా ఎందుకుండదు? గుడిసెలు, గుడ్డిదీపాలు తమ కెందుకున్నాయి? పచ్చ బంగళాలో వుండే సీనూ, వాగు దగ్గర తాతతో మాట్లాడిన చిన్నదొర మాటి మాటికి కళ్ళలో కనిపిస్తున్నారు.

ఆ తరువాత చాలా రోజులుగా పోశిగాడు ఆలోచిస్తూ పడుకుంటున్నాడు. మండే దీపాన్ని తదేకంగా చూస్తూంటాడు. ఏదో ధైర్యం కలుగుతోంది. పొడిచే పొద్దు కోసం ఎదురు చూస్తాడు. బళ్ళో చదువుకునే చదువుకన్నా బతుకు నేర్పే చదువు గొప్పదని వాడికి కొద్ది కొద్దిగా అర్థమవుతోంది.

వాడికింకా చాలా విషయాలు అర్థం కావడంలేదు. కాని ప్రశ్నలు తలెత్తుతున్నాయి. వాడి వయసుతో పాటు అవీ పెరుగుతున్నాయి. ●

# బంగారు క్షణాలు...

జె. సుబ్బలక్ష్మి

గోడ గడియారం రంగు రంగుమని రెండు గంటలు కొట్టింది. చాలా సేపటినుండి నిద్రపట్టక అటూ ఇటూ దొర్లుతున్న సీతమ్మ ఒక్కసారి ఆవలించి ఒళ్ళు విరుచుకోబోయింది. కాని కాళ్ళూ, చేతులూ బిగుసుకు పోయినట్టయి నిటారుగా చాపడానికి రాలేదు. పైగా అవన్నీ తనమీద తిరుగుబాటు చేస్తున్నట్టుగా అనిపించింది. 'ఇంకెంత కాలం మాచేత చాకిరీ చేయిస్తావు సీతమ్మా? అరవై ఏళ్ళపాటు సేవ చేసి చేసి అలసి పోయాం. ఇకనైనా మాకు విశ్రాంతి నివ్వకపోతే ఎలా? అని జాలిగా అడుగుతున్నట్టూ అనిపించింది.

సీతమ్మ తన ఊహకు తనే నవ్వుకుంది—'కాళ్ళూ, చేతులూ తమ కష్టాలు చెప్పుకుంటాయేమిటి ఎక్కడైనా! శరీరంలో జవసత్వాలు ఉడిగిపోయాక అవి కూడా బలహీనమై పోతాయి గాని! అనుకుని ఒళ్ళంతా నెమ్మదిగా కూడదీసుకుని లేచి కూర్చుంది.

కాసేపటికి నడుం నొప్పి పుట్టినట్టయి, మళ్ళీ పడుకుంది సీతమ్మ. కళ్ళు మూసుకుని ఎలాగైనా నిద్రపోవాలని ఎంతగానో ప్రయత్నం చేసింది. కాని ఎంతసేపటికీ నిద్రపట్టలేదు.

ఇక లాభం లేదనుకుని ఆమె లేచి మెల్లిగా గదిలోంచి ఇవతలికి వచ్చింది. అడుగులు చప్పుడు కాకుండా నడవటం ఆమెకు అలవాటు. గట్టిగా కాళ్ళు మోదుకుంటూ నడవటం గానీ, గిన్నెలూ, సామాన్లూ చప్పుడయ్యేలా పనిచేయడం గానీ ఆమెకెప్పుడూ అలవాటు లేదు.

డ్రాయింగ్ రూంలోకొచ్చి సోఫాలో కూర్చుంది. మెత్తని ఆ సోఫాలో వెనక్కి వాలి కళ్ళు మూసుకుంటే ఎంతో హాయిగా ఉన్నట్టనిపించింది. మళ్ళీ అంతలోనే ఒక నిట్టూర్పు విడిచింది! పాపం....తన భర్త బతికున్న రోజుల్లో తమకు తలకింద పెట్టుకోడానికి తలగడలైనా సరిగ్గా ఉండేవి కావు ఇక సోఫాలూ, కుర్చీ లెక్కడివి? అసలా మాట తల్చుకునే తాహతైనా ఉండేదా తమకు? కుక్కి మంచాలూ, ఈతచాపలూ తప్ప ఇంకేమీ ఎరుగరు ఆరోజుల్లో.

కాని ఇప్పుడు చక్కని మంచం, మెత్తని పరుపు, తెల్లని దుప్పట్లు, గలేబులు తొడిగిన తలగడలు, దోమతెర—అన్నీ ఉన్నాయి తనకు. కానీ ఏం లాభం? నిద్రమాత్రం కరువై పోయింది. రాత్రి భోజనంచేసి పడుకున్న వెంటనే ఒక్క కునుకు పడుతుందంతే. అర్ధరాత్రి దాటగానే మెలకువ వచ్చేస్తే ఇక తెల్లవార్లూ ఇలా పిచ్చిదానిలా ఒంటరిగా కూర్చునో, లేకపోతే పక్కమీదే దొర్లుతూనో కాలం గడపాలి.

కొన్నేళ్ళ క్రితమైతే ఇలా మధ్యలో మెలకువ వచ్చినప్పుడు లేచి తనకటూ



ఇటూ అడ్డదిడ్డంగా పడుకున్న పిల్లలను సరిగ్గా పడుకోబెట్టి, అస్తవ్యస్తంగా ఉన్న వాళ్ళ బట్టలను సర్ది తిరిగి నిద్రపుచ్చేది ఆ తరువాత, అంటే పెద్ద కొడుక్కి పెళ్ళయి, వాడికి పిల్లలు పుట్టిన తరువాత వాళ్ళను తన పక్కమీదే పడుకోబెట్టుకునేది రాత్రిళ్ళు లేచి పక్కకు జరిగిపోయిన వాళ్ళను తిరిగి పక్కమీదికి లాక్కొని తొలిగిన దుప్పట్లను మళ్ళీ కప్పి వాళ్ళను అక్కున చేర్చుకుని నిద్రపోయేది

అయితే ఈ ఇంటికొచ్చినప్పట్నుంచీ అలాంటి పనులేమీలేక మనసుకూ, శరీరానికీ ఏమిటోలా అనిపిస్తోంది

నలుగురు పిల్లలుగల పెద్దకొడుకు రామం బదిలీ అయి బెంగుళూరు వెళ్ళిపోయాడు. రెండో కొడుకు విశ్వంకూ ఢిల్లీలో ఉద్యోగం రావడంతో భార్యా, బిడ్డలను తీసుకుని వెళ్ళిపోయాడు ఇక మిగిలింది సత్యం ఒక్కడే వాడు కట్టించిందే ఈ ఇల్లు ఇంజనీరింగ్ చదివి కాస్త అభివృద్ధిలోకి వచ్చాక మంచి డబ్బుగల వాళ్ళమ్మాయిని ప్రేమించి పెళ్ళి చేసుకున్నాడు

సరళ తన కోడలయిన దగ్గర్నుంచీ ఆమెతో సామరస్యంగా మెలగాలని ఎంతగానో ప్రయత్నిస్తోంది. కానీ, తాను గొప్పింటి అమ్మాయే కాక ఒక ఇంజినీరు భార్యనన్న టెక్కు, బెట్టుసరి సరళలో కొంచెం ఎక్కువ కాబట్టి ఆమె తనతో అంత సన్నిహితంగా ఉండదు. ఆ విషయం గ్రహించి నప్పటినుంచీ తనుకూడా కాస్త జాగ్రత్తగానే ఉంటోంది. మనవణ్ణి తన దగ్గర పడుకోబెట్టుకోవాలన్న కోరికను కూడా అణిచివేసుకుంది....

—సీతమ్మ సోఫాలోంచి లేచింది. డ్రాయింగ్ రూంలోంచి వరాండాలోకెళ్ళే తలుపును ఏమాత్రం చప్పుడు చేయకుండా నెమ్మదిగా తెరచుకుని వరండాలోకి వచ్చి నిలబడి కటకటాల్లోంచి బయటి తోటలోకి చూడసాగింది.

చుట్టూ నిశ్శబ్ద నీరవం. గాలికి చెట్ల ఆకుల గలగలలు తప్ప ఎక్కడా ఎలాంటి అలికిడీ లేదు. కాని వెన్నెల వెలుగులో తోటలోని పువ్వులన్నీ వింత సోయగాలీనుతూ కళ్ళకు విందు చేస్తున్నాయి. ఇంటి ముందున్న ఆర్చిపై పాకించిన మల్లెతీగలో విచ్చిన మల్లెపూలు వెన్నెల్లో మరింత తెల్లగా మెరుస్తూ చక్కని సువాసనలు వెదజల్లుతున్నాయి పచ్చని చేమంతులు, రకరకాల గులాబీలు 'మేమూ ఉన్నామంటూ' తలెత్తుకుని వున్నాయి. నవ్వు పూలతో నిండిన పారిజాతపు చెట్టు నక్షత్రాలతో మెరిసి పోతున్న నభోమండలంలా వెలిగి పోతోంది.

అవన్నీ చూస్తూ మైమరచి పోయింది సీతమ్మ. ఎంతసేపలా నిలబడిందో ఆమెకే తెలియదు. కానీ ఒక్కసారిగా తోటలోకి మేడమీది కిటికీలోంచి లైటువెలుగు పడే సరికి ఆమెకు ఆశ్చర్యం వేసింది. 'ఇంత రాత్రప్పుడు వీళ్ళెందుకు లేచారబ్బా ?' అనుకుంది కానీ మళ్ళీ 'చంటాడు లేచాడు కాబోలు. వాడికి ఏపాలో పట్టడానికి కోడలు లైటు వేసివుంటుంది. అని తనకు తనే సమాధానం చెప్పుకుంది.

సావిత్రమ్మగారి దొడ్లో ఉన్నప్పుడైతే ఇలా అర్ధరాత్రిపూట ఏ ఇంట్లో లైటు కనిపించినా తను పరుగెత్తు కెళ్ళేది. అందరూ ఆదమరచి నిద్రపోయేవేళ వాళ్ళెందుకు మెలకువగా ఉన్నారా—అన్న సందేహం తనను ఇంట్లో ఉండనిచ్చేదికాదు. చంటి పిల్లలే గనుక గుక్కపెట్టి ఏడుస్తుంటే వాళ్ళ ఏడుపుకు కారణం కనిపెట్టి తనకు తెలిసిన చిట్కా ఏదో ఉపయోగించి వాళ్ళను ఊరుకోబెట్టి మరీ వచ్చేది ఇంటికి. ఎవరికైనా ఒంట్లో బాగుండక బాధపడుతున్నా లేక ప్రసవవేదన పడుతున్నా తను చూడలేక పోయేది. వాళ్ళదగ్గరే కూర్చుని ధైర్యం చెబుతూండేది. తన చేతనైన సహాయం చేసేది. వాళ్ళ బాధ నివారణ అయిన తరువాత తృప్తిగా ఇంటికి తిరిగొచ్చేది.

సావిత్రమ్మగారి దొడ్లో మొత్తం ఏడు వాటాలుండేవి. ఆ వాటాల్లో ఉన్న వాళ్ళందరూ చాలా తక్కువ ఆదాయం గల సామాన్య కుటుంబీకులే. వచ్చే జీతాలు చాలీ చాలక ఎలాగోలా బతుకుబండిని లాగుతున్న కష్టజీవులే. అయితే డబ్బుకు ఎంత కటకట లాడే వాళ్ళయినా—అదరాభిమానాలకూ, ఆప్యాయతకూ వాళ్ళల్లో కొరత ఉండేదికాదు. ఒకళ్ళ నొకళ్ళు వరసలుపెట్టి పిలుచుకుంటూ, ఒకళ్ళ కష్టాల కొకళ్ళు అదుకుంటూ అంతా ఒకే కుటుంబంలోని వ్యక్తుల్లా మెలిగేవాళ్ళు...

—ఇక్కడ అలాంటి ఇరుగూ పొరుగూ లేదు, అలాంటి మనుషులూ లేదు. 'నన్ను ముట్టుకోకు నామాల కాకి' అన్నట్టు ఎవరిళ్ళల్లో వాళ్ళు తలుపులు బిడాయించుకుని ఉండిపోతారు. ఒక పలకరింపూలేదు, పాడూలేదు—మరీ ఎదురు పడినప్పుడు చూసీ చూడనట్టు ఓ చిరునవ్వు పారేసి ముందుకు సాగిపోతూంటారు....

—పూల సువాసనలపై తేలివస్తున్న చల్లగాలి శరీరానికి హాయి గొలుపుతూంటే

# శుభ్రమైన తాజా శ్వాస... ఆరోగ్యంవిందే గట్టి పళ్ళు



## కోల్గేట్ డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకోండి. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క పాలిశని తత్వంగల నురుగు బాగా లోతుకుపోయి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

కోల్గేట్‌లోని తాజా మింటు రుచివలన బ్రష్ చేసుకుంటున్నప్పుడు ఎంతో హాయి.

**నోటి దుర్వాసనను ఆపండి... కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో దంతక్షయాన్ని ఎదుర్కోండి!**




DC.0.74 TL

చాలా సేపు అక్కడే నిలబడిపోయింది సీతమ్మ. మేడమీది గదిలోని లైటు ఆరిపోయింది. అంతలోనే కిలకిలా నవ్వులు వినిపించాయి.

సీతమ్మ పెదవులు చిరునవ్వుతో చిన్నగా విచ్చుకున్నాయి. పిల్లాడు పడుకున్నాడు కాబోలు, ఇద్దరూ హాయిగా నవ్వుకుంటున్నారు అనుకుంది. వెంటనే ఆమె మదిలో ఎన్నో మధురస్మృతులు చెలరేగి గిలిగింతలు పెట్టినట్టయ్యాయి. ఆ స్మృతులు తాలూకు జ్ఞాపకాలు తోటలోంచి వీస్తున్న చల్లగాలిలాగే శరీరాన్నీ, మనసునీ పులకింప చేస్తున్నాయి. భర్తతో పంచుకున్న ఆనందం ఇప్పటికీ చెక్కు చెదరకుండా నిలిచివుంది తనలో....

—కేశవరావును పెళ్ళాడి సీతమ్మ అత్తవారింట్లో అడుగు పెట్టినప్పుడు ఆమె వయసు పదహారేళ్ళు అప్పటికేవాళ్ళు సావిత్రమ్మగారి దొడ్లో ఉన్నారు పడు వాటాలవాళ్ళు వాకిట్లో మూగి వింతగా తనను చూస్తూండగా భర్తతో కలిసి ఇంట్లోకి అడుగు పెడుతుంటే సీతమ్మ సిగ్గుతో మొగ్గలా ముడుచుకుపోయింది; అడుగులు తడబడ్డాయి; కళ్ళు కిందికి వాలిపోయాయి. ఎవరకంటా పడకుండా గదిలో కెళ్ళి ఒంటరిగా కూర్చోవాలని అనిపించింది. కానీ లోపలికి వెళ్ళాక తమకంటూ ప్రత్యేకమైన గదే లేదని తెలిసింది ఆమెకు. ముగ్గురు మరుదులూ, నలుగురు ఆడబిడ్డలూ, అత్తగారూ, మామగారూ - మొత్తం జనాభా అంతా ఉన్న మూడు గదుల్లోనే సర్దుకోవాలి.

పగలంతా ఇంటి పనులే సరిపోయేవి. భర్తతో ఒక్క క్షణం తీరిగ్గా మాట్లాడే అవకాశం కానీ, అందుకు తగిన చోటు కానీ ఇంట్లో లభ్యమయ్యేవి కావు.

ప్రైవేటు కంపెనీలో పనిచేసే కేశవరావు ఉదయం తొమ్మిది గంటలకు వెళితే ఇంటికి తిరిగొచ్చేసరికి రాత్రి ఎనిమిది దాటేది. అప్పుడిక భోజనాల హడావిడి వచ్చిరాగానే కాసేపు తండ్రితో మాట్లాడి ఇంటి అవసరాలు కనుక్కుని ఆ తరువాత భోజనానికి లేచేవాడు. భోంచేయగానే మళ్ళీ చొక్కా తగిలించుకుని బయటికి వెళ్ళిపోయేవాడు. కిళ్ళీ, సిగరెట్టు-స్నేహితులతో కాలక్షేపం-అన్నీ పూర్తయి అతను తిరిగొచ్చేసరికి పదకొండు గంటలయ్యేది పగలల్లా పనిచేసి అలిసిపోయిన సీతమ్మ ఇక నిద్రకు ఆగలేక ఏ ఆడబిడ్డ పక్కనో ముడుచేసుకుని ఒరిగిపోయేది.

దగ్గరగా వేసిన తలుపును నెమ్మదిగా తోసుకుని కేశవరావు ఇంట్లోకి వచ్చేవాడు. ముందుగదిలో తమ్ముళ్ళూ, తండ్రీ నిద్రపోతుండేవారు. తన కోసం పక్కలేసి సిద్ధంగా ఉండేది. కానీ అప్పుడే పడుకోవడానికి అతనికి మనసొప్పేది కాదు. మెల్లగా రెండో గదిలోకి వెళ్ళేవాడు అక్కడ తన చెల్లెళ్ళమధ్య పడుకుని గాఢంగా నిద్రపోతున్న భార్యను చూస్తూ కాసేపు నిశ్శబ్దంగా నిలబడేవాడు. ఆ సమయంలో ఆమె అపురూప సౌందర్యంతో వెలిగిపోతున్న దేవత మూర్తిలాగా కనిపించేది. మనసులో మోహావేశం పెల్లుబుకుతూంటే నెమ్మదిగా ఆమె దగ్గరికి వెళ్ళేవాడు. ఆమెను ఉన్నపళంగా రెండు చేతులతో ఎత్తుకుని గుండెలకు చేర్చుకోవాలనిపించేది కానీ, బెదరిపోయి భయంతో కేకలు వేస్తుందేమోనని ఆ కోరికను తనలోనే అణుచుకునేవాడు. తల్లి ఏమైనా మెలకువగా ఉందేమోనని ఆవిడవంక తేరి పార చూసి ఆవిడ నిద్రపోతోందన్న విషయం ఖచ్చితంగా తెలుసుకున్న తరువాత భార్య మెత్తని అరికాళ్ళకు గిలిగింతలు పెట్టేవాడు. కళ్ళు తెరిచిన సీతమ్మకు ఎదురుగా భర్త కనిపించగానే నిద్ర మత్తు వదిలిపోయేది. అతను రమ్మని సైగచేస్తే చుట్టూ ఓసారి చూపులు సారించి "వీళ్ళందరూ ఉన్నా"రని కళ్ళతోనే హెచ్చరించేది కానీ అతను తేలిగ్గా చప్పరించేసి ఏం ఫరవాలేదన్నట్టు సైగచేసేవాడు. రమ్మని




పిలిచేవాడు. ఇలా కొంచెంసేపు కనుపైగల తోనే సంభాషణ జరిగాక అతన్ని ఊరించి, అతనిచేత బతిమాలించుకుని అప్పుడు అతని చెయ్యి ఆసరాగా పట్టుకుని నెమ్మదిగా లేచేది సీతమ్మ. ఇద్దరూ ఏమాత్రం చప్పుడు కాకుండా దొంగల్లా వంటింట్లో దూరే వారు.

అక్కడ ఆరీఆరని తడినేలకానీ, చుట్టూ వున్న సామాన్లుకానీ, అటూ ఇటూ హడావిడిగా పరుగులు తీసే ఎలుకలు కానీ, అప్పుడప్పుడు పెరటివైపు కిటికీలోంచి వచ్చే మురికికాలువ వాసనకానీ-వయసు పొంగులో ఉన్న ఆ జంటకు మాత్రం ప్రతిబంధకాలుగా అనిపించేవి కావు. కేశవరావు ఆమెను ఊపిరి సలపనంత గట్టిగా హృదయానికి హత్తుకునేవాడు. ఆ బాహుబంధనలో తన ప్రేమంతా వ్యక్తం చేసేవాడు. సీతమ్మ గువ్వలా అతని కౌగిట్లో ఒదిగిపోయి ఆ మధురమలో మైమరచి పోయేది.

గంట రెండు గంటలు పోయాక మెల్లిగా అతని కౌగిట్లోనుంచి విడివడి "కావాలంటే మీరిక్కడే పడుకోండి బాబూ....... నేను మాత్రం అవతల గదిలోకి వెళ్ళిపోతాను. మళ్ళీ అత్తగారు లేచారంటే బావుండదు" అని లేవబోయేది. కానీ కేశవరావు ఆమెను పోనిస్తేనా? మళ్ళీ మళ్ళీ దగ్గరికి లాక్కునేవాడు. "అబ్బ ఎప్పుడూ ఇలాగే ఉండిపోవాలనిపిస్తోంది సీతా, మనకంటూ ఒక గది ఉంటే......" అనేవాడు. సీతమ్మ నవ్వుకుని మళ్ళీ తన చోటికొచ్చి ఏమెరుగనట్టు పడుకుని నిద్రపోయేది. ఇక చేసేదిలేక కేశవరావు కూడా వెళ్ళి తన పక్కమీద చేరుకునేవాడు....

ఇప్పుడు సకల సౌందర్యాలూ ఉన్న ప్రత్యేకమైన గదివుంది కానీ, ఆయనేలేరు.

—సత్యం పెద్ద ఇల్లే కట్టించాడు. కింద ఐదారు గదులు, ఒక పెద్ద హాలు, వంటిల్లు—పైన ఒక హాలు, నాలుగు గదులు. పెద్ద కొడుకులిద్దరు, కోడళ్ళు. వాళ్ళ పిల్లలు—ఎంతమంది వచ్చినా సరిపోయేంత విశాలంగా ఉంది ఇల్లు.

ఈ ఇంట్లోకి మారేముందు పాత అద్దె

ఇంటివాళ్ళు తనను చుట్టుముట్టి, పిన్నిగారూ....సొంత ఇంట్లోకి వెళ్ళి పోగానే మమ్మల్నందర్నీ మరిచి పోకండేం?' అన్నారు.

—పిచ్చివాళ్ళు! ఇల్లు మారినంత మాత్రాన మనసుకూడా మారిపోతుందని ఎందుకనిపించిందో వాళ్ళకి?

ఇక్కడికొచ్చేసినా తన మనసింకా అక్కడే విహరిస్తోంది. ఆ మనుషుల మధ్య మెసులుతున్నట్టే అనిపిస్తోంది ఇంకా. ఆ సందడి, ఆ కలివిడితనం ఇక్కడ మచ్చుకి కూడా కనిపించడంలేదు. చంటివాడు ఏడుస్తున్నప్పుడు తప్ప మిగతా సమయాల్లో అంతా ఇల్లు నిశ్శబ్దంగానే ఉంటుంది. తన కోడలు పద్మకు అట్టే ఎక్కువ మాట్లాడ్డం అలవాటులేదు. మరీ అవసరమైతే తప్ప తనతో అసలే మాట్లాడదు. సత్యం సంగతి సరేసరి. ఉదయం పూట కాఫీ తాగేటప్పుడు తప్ప వాణ్ణి తీరికగా చూడ్డమే కుదరదు. అప్పుడే తనతో కూడా నాలుగు మాటలు మాట్లాడుతాడు. అన్నయ్యల దగ్గరినుంచీ, అక్కయ్యల దగ్గరినుంచీ ఉత్తరాలు వస్తున్నాయో లేదో కనుక్కుని వాళ్ళ యోగక్షేమాలు అడుగుతాడు—అంతే. అంతకు మించి తనతో మాట్లాడ్డానికి ఇంకేం విషయమే దొరకదు వాడికి.

'తల్లికి అన్ని సదుపాయాలూ అమర్చాను. ఆవిడ కోరినట్టు దేవుడిగది, పెరట్లో తులసికోటా కట్టించాను. తిండీ బట్టలసంగతి సరేసరి. ఇక ఆవిడకి కావలిసిందేమిటి?' అనుకుంటాడు కొడుకు బహుశా. కానీ తనిలా ఒంటరితనంతో బాధపడుతున్న విషయాన్ని మాత్రం వాడు ఊహించుకోలేడు.

ఇంట్లోవున్నది ముగ్గురే అయినా—ఒకేసారి కలిసి భోంచేయడానికి కుదరదు. ఎవరి వీలునుబట్టి వాళ్ళు భోంచేయాల్సిందే టేబుల్ మీద తనకు తానే వడ్డించుకుంటూ తింటే అన్నం తిన్నట్టే అనిపించేది కాదు. పది, పదిహేను మందికి వండి వడ్డించిన అలవాటు కదా మరి! వరసగా పీటలువేసి, కంచాలు పెట్టి, చెంగు నడుముకు బిగించి వడ్డించడం మొదలెడితే అందరి భోజనాలూ తెమిలే సరికి సరిగ్గా గంటసేపు పట్టేది. రోజువారీ వంటలు గాకుండా ఏదన్నా విశేషంగా చేసినరోజున ఇరుగు పొరుగు వాళ్ళకు ఇచ్చుకునే వాళ్ళు.

—ఇక్కడో? అలాంటి అలవాట్లున్న వాళ్ళను అడివిమనుషులకింద జమకడతారు, అనాగరికులుగా భావిస్తారు - వీళ్ళంతా నాజూకు మనుషులు.

—కోడలంటే పుట్టుకనుంచీ ఇలాంటి వాతావరణంలోనే పెరిగిందను కోవచ్చు. కానీ సత్యం? వాడు తను పుట్టి పెరిగిన వాతావరణాన్ని అంత త్వరగా ఎలా మరువ గలిగాడా అని?

—సీతమ్మ మనస్సు మళ్ళీ వెనక్కెళ్ళింది.

తన అత్తగారూ, మామగారూ పోయాక ఇంటి బాధ్యతంతా తమమీద పడింది. 'అన్నయ్య మమ్మల్ని అన్యాయం చేశాడు' అని అనిపించు కోకూడదని తమ్ముళ్ళందర్నీ చదివించాడు కేశవరావు. దానికోసం అప్పులైనా చేసి మరీ చదివించాడు. చిన్నతమ్ముడి చదువు పూర్తయ్యేసరికి పెద్దతమ్ముడు ఉద్యోగంలో చేరాడు. అప్పటికి చెల్లెళ్ళు పెళ్ళి కెదగడంతో వాళ్ళ పెళ్ళి ప్రయత్నాలు మొదలెట్ట వలసివచ్చింది. ఉన్నంతలో కాస్త మంచి సంబంధాలు చూసి వాళ్ళ పెళ్ళిళ్ళు జరిపించారు.

తల్లితండ్రులు పోయినలోటు వాళ్ళకు తెలియకుండా వారిస్థానంలో నిలబడి ఇలా అన్ని బాధ్యతలూ సక్రమంగా నిర్వహించారు తనూ, తనభర్త కేశవరావు.

తమ్ముళ్ళకు కూడా వారు కోరుకున్న పిల్లలతోనే పెళ్ళి జరిపించేశారు.

భర్త బాధ్యతలతో పాలు పంచుకోవ

డం తప్ప ఏనాడూ ఎదురాడి ఎరుగని తను కొత్తగా వచ్చిన కోడికోడళ్ళ నందర్నీ సంతోషంగానే చూసుకుంది. అయితే అందరూ కలిసే ఉండాలని మాత్రం ఎప్పుడూ పట్టుబట్టలేదు వయసులోవున్న కొత్త దంపతుల కోరిక లెలా వుంటాయో తనకు తెలుసు కాబట్టి—వాళ్ళను వేరే కాపురం పెట్టించి స్వేచ్ఛగా ఉంగ నిచ్చింది తను.

—ఈలోగా తన కొడుకులు ఎదిగారు. పెద్దవాడు రామం కాలేజీ చదువు కొచ్చాడు. అప్పటికి భర్త జీతం పెరిగి, ఇంట్లో మనుషుల సంఖ్య తరగడంతో కొంచెం హాయిగా ఊపిరి పీల్చుకునే అవ కాశం దొరికింది తమకు. శుభ్రమైన తిండీ, మంచి బట్టలూ అందరికీ లభించసాగాయి. అదివరకు ఇరుకుగా అనిపించిన ఇల్లుకూడా ఇప్పుడు—సభ్యుల సంఖ్య తగ్గడంతో—సరిపోయింది.

అయితే జీవితంలో ఆపాటి నిశ్చింత ఏర్పడేసరికి తనకు మధ్యవయసు సమీపించి చిన్నతరం వాళ్ళందరికీ "పిన్నిగారు" గా చెలామణి అవసాగింది. ఇరుగు పొరుగు వారు ఏ అవసరం వచ్చినా తననే సంప్ర దించేవారు. పసి పిల్లలకు సుస్తీచేసినా, పెద్దవాళ్ళు జబ్బుపడినా వెళ్ళి తన చేత నైన సహాయం చేసేది. ఎవరింట్లో ఏ పేరం టం జరిగినా తనే దగ్గరుండి జరిపించాలని అందరూ పట్టుబట్టేవారు. తన చేతితో ఏంచేసినా అది శుభ ప్రదమవుతుందని నమ్మేవారు. అంతెందుకు, తన సలహా సంప్రదింపులు లేకుండా ఏ పని జరిగేది కాదన్నా అతిశయోక్తి కాదు....

కాళ్ళకేదో మెత్తగా తగిలేసరికి సీతమ్మ ఉలిక్కిపడింది. గత కాలపు జ్ఞాపకాల్లోంచి బయటపడి, ఆ మసక వెలుగులోనే తన దగ్గరున్నదేమిటో చూసింది. అది పిల్లి. తన పెంపుడు తెల్ల పిల్లి. తోక పైకెత్తి వీపునిపైకి పొంగించుకుని మెల్లగా 'మియావ్....మియావ్' అంటూ, సీతమ్మ కాళ్ళను ఒరుసుకుంటూ చుట్టూ తిరుగు తోంది.

"ఏమిటే పిచ్చిముండ.... నువ్వు నన్నె ప్పుడు చూశావ్?" అంటూ ఆప్యాయంగా దాని ఒళ్ళు నిమిరింది. అది ఆవిడకి మరింత దగ్గరగా రాసుకుంటూ కాళ్ళ సందుల్లో దూరి చీరకుచ్చెళ్ళతో ఆడుకోసా గింది.

దాన్ని ఇంట్లోకి తీసుకొచ్చినరోజు జరి గిన రాద్ధాంతం గుర్తుకొచ్చింది సీతమ్మకు. చలికి వణుకుతూ ముద్దలా ముడుచుకు పోయి "మియావ్.. మియావ్' అంటూ కిటికీదగ్గర గోల చేస్తున్న పిల్లి పిల్లను చూసి కోడలు పద్మ చిరాకుపడింది. అయితే తనకు మాత్రం చాలా జాలేసి దాన్ని లోపలికి తీసుకొచ్చింది, "ఛీ—ఛీ.... వెధవ పిల్లి అవతల పారెయ్యండి అత్తయ్యా. కాస్త చనువిస్తే ఒంటిని రాసుకుంటూ తిరుగుతుంది. అడ్డమైనవీ తినొచ్చి గిన్నె లన్నిట్లోనూ మూతి పెడుతుంది. నాకు దాన్ని చూస్తూంటే ఒళ్ళు మండి పోతోంది" అంటూ రుసరుసలాడింది.

తను ఆ చిన్నారి పిల్లిపిల్ల కేసి చూసింది. తెల్లగా, మెత్తగా పత్తి ముద్దలా వున్న అది 'తల్లినుంచి దూరమైపోయిన నన్ను నిర్దయగా పంపించేస్తారా?' అని అడుగు తున్నట్లనిపించి మనసు కరిగిపోయింది. "పోని నీకంత చిరాగ్గావుంటే నేను దీన్ని నా గదిలో ఉంచుకుంటాలే! పాపం చిన్న పిల్ల" అంది.

"ఏమైనా చేసుకోండి మీ ఇష్టం. ఈ ముదనష్టప్పిల్లి నా గదిలోకి గనకవస్తే మాత్రం మేడమీదనుంచి కిందికి గిరాటేస్తా నంతే!" అనేసి అక్కణ్నుంచి చరచరా వెళ్ళిపోయింది పద్మ.

అప్పట్నుంచీ దీనికి పాలూ, అన్నం పెట్టి తనే పెంచుతోంది. రాత్రిళ్ళు పద్మ తనగది తలుపేసుకున్న తరువాతే దీన్ని స్వేచ్ఛగా వదిలేస్తుంది తను. అప్పటిదాకా తన గదిలోంచి బయటికి పంపదు. దాన్ని











స్వేచ్ఛగా వదిలినా అదిమాత్రం తనని వదలదు.

—అయినా పద్మ ఇంత పట్టుదల మనిషని పెళ్ళికిముందు సత్యం ఎరగడా? తన పెద్ద కోడలూ, రెండో కోడలూ ఇలాంటివారు కాదు.

వాళ్ళ పెళ్ళిళ్ళనాటికే భర్త కేశవరావు ఈ లోకంలో లేడు. ఆయన పోవడంతోనే తన చేతో శుభకార్యాలు జరిపించే అర్హత కూడా పోయింది. అదివరకటిలా ప్రతి పనికీ ముందుండి చేయించడం కుదరక పోయినా—లోపలిగదిలో కూర్చుని అడిగిన వారికి సలహాలు మాత్రం ఇస్తుండేది.

ఇంట్లో—అయిదోతనంతో కళకళలాడే ఆడపిల్ల అవసరమని తోచి రామంకి పెళ్ళి చేయాలని నిశ్చయించింది తను.

అయితే బ్యాంక్ ఉద్యోగంలో చేరిన రామం మాత్రం తను ప్రేమించిన పిల్లనే చేసుకుంటానని పట్టుబట్టడంతో ఆ అమ్మాయితో పెళ్ళిజరిపించేసింది. కానీ పెళ్ళయిన కొన్నాళ్ళకే వాడికి ట్రాన్స్‌ఫరయిపోవడంతో కోడలితో కలిసిమెలిసి ఉండే అవకాశం తనకు లభించలేదు.

రెండో కొడుకు విశ్వం కాలేజీ లెక్చరరయ్యాడు. వాడూ తను చూసిన పిల్లనే పెళ్ళి చేసుకున్నాడు. ఆ అమ్మాయి తనను ఎంతగానో గౌరవించి, తనమాటకు విలువనిచ్చేది. అత్తగారుగాకాక తల్లిలా భావించి అభిమానించేది. అయితే వాడికి ఈ ఊళ్ళో ఉండే యోగం లేకపోయింది. వాడికి వేరే చోట లెక్చరర్ ఉద్యోగం దొరికింది.

సంవత్సరానికోసారి మాత్రం అందరూ సెలవుపెట్టి వచ్చి పదిహేను ఇరవై రోజుల పాటు ఉండి వెళ్ళిపోతారు.

—ఏళ్ళు గడుస్తున్నకొద్దీ వారి సంసారాలు పెరిగాయి. అంతేకాదు, తాము ఎన్నో ఏళ్ళుగా అద్దెకున్న ఆ ఇంటిమీద విముఖతకూడా ఏర్పడింది. వచ్చిన ప్రతిసారీ వారు—'అబ్బ, ఎంత పాత కొంపో?' అని విసుక్కోవడం పరిపాటి అయిపోయింది.

ఇక మూడోవాడు సత్యం. వాడి ఇంజినీరింగ్ చదువు పూర్తయిన కొన్నాళ్ళకే ఇంజినీరు ఉద్యోగం దొరికింది. ఎవరో ఒకాయన రికమెండేషన్‌తో ఆ ఉద్యోగం

దొరికిందట.

ఒకరోజు యథాలాపంగా ఇంటికి ఓ అమ్మాయిని తీసుకొచ్చి తనకు పరిచయం చేసాడు సత్యం. ఆమె పేరు పద్మ. ఇంట్లోకి వచ్చినదగ్గరనుంచీ ఆమె మొహంలో వ్యక్తమవుతున్న అయిష్టతను తను గమనిస్తూనే వుంది. అక్కడున్నంతసేపూ ముఖ్ఖమీదు న్నవ్వే ఉంది కానీ సరదాగా, సంతోషంగా అసలు లేదు. చివరికి ఆమె బయలుదేరే ముందు సత్యం తనతో చెప్పినమాట తనను షాక్ తినేలా చేసింది. 'అమ్మా ...పద్మ ఈ ఇంటికి కోడలిగా రాబోతోంది తెలుసా?'

తనింకా ఆశ్చర్యంలోంచి తేరుకోక ముందే పద్మ విసిరిన శూలంలాంటి మాట తన హృదయానికి సూటిగా గుచ్చుకుంది. అంతేకాదు, ఆమె స్వభావం ఎలాంటిదో కూడా అప్పుడే తెలిసిపోయింది

"ఈఇంటికా! ఇంపాజిబుల్, ఈదయ్యాల కొంపలో నేనిక చచ్చినా అడుగు పెట్టను. ఇక్కడున్నవాళ్ళంతా డర్టీ క్రీచర్స్ సత్యం, నువ్వు వేరే మంచి ఇల్లు చూచు కుంటేనే మన పెళ్ళి—లేకపోతే నా ఆశ వదులుకో"

—ఎన్నో ఏళ్ళనుంచీ కన్న తల్లిలా ఆశ్రయం ఇచ్చిన ఈ ఇల్లు దయ్యాల కొంపా? తోబుట్టువుల్లా మెలిగే ఈ ఇరుగు వాళ్ళు డర్టీ క్రీచర్సా? ఇప్పుడే ఇంతింత మాటలనే అమ్మాయి ఇక రేపు పెళ్ళయ్యాక తనతో ఇంకెలా మెలుగుతుందో-అన్న భయం తనను ఆ రాత్రంతా నిద్ర పోనివ్వలేదు.

పద్మ ప్రవర్తన గురించి సత్యం తన ముందు ఏనాడూ ప్రస్తావించలేదు. ఆ సంఘటనపట్ల కనీసం బాధపడినట్టుకూడా కనిపించలేదు.

పద్మ ఎక్కడ దక్కకపోతుందోనన్న భయంతోనో తాను పుట్టిపెరిగిన పాత ఇంటి మీద విముఖతవల్లనో తెలియదుగానీ సత్యం స్వంత ఇల్లు కట్టుకునే విషయంలో ప్రయత్నాలు చేయ నారంభించాడు. అందుకు అతని మామగారు ఆర్థికంగా తోడ్పడ్డారో ఏమోగానీ బోలెడు డబ్బు ఖర్చుపెట్టి ఇంటి నిర్మాణం పని మొదలెట్టాడు. ఇల్లు సగం నిర్మాణంలో ఉండగానే పద్మ తండ్రి భూపాలరావు కూతురు పెళ్ళి ఘనంగా జరిపించేశాడు. కానీ పద్మ మాత్రం వెంటనే కాపురానికి రాలేదు; కొత్త కోడలి విషయం ముందే తెలుసు కాబట్టి తను ఆ విషయంలో ఏమీ జోక్యం చేసుకోలేదు.

ఇల్లు పూర్తయింది. గృహప్రవేశానికి తను పాతింటి ఇరుగు పొరుగు వారందర్నీ ఆహ్వానించింది. తను అక్కణ్ణుంచి వచ్చేస్తుంటే పిల్లలు మొదలుకొని పెద్దలదాకా అందరూ ఎంతో బాధపడిపోయారు.

"పిన్నిగారూ....మీరు సొంతిల్లు కట్టుకుని వెళుతున్నారని సంతోషంగా ఉంది కానీ—మాకు దూరమైపోతున్నారే అని చాలా బాధగా ఉందండీ ......." అంటూ కంటతడి పెట్టుకున్నారు.

"పిచ్చివాళ్ళు....మిమ్మల్నొదిలి నేను మాత్రం ఎలా ఉండగలననుకుంటున్నారు? అప్పుడప్పుడూ వచ్చిపోనూ? అయినా నేనేమీ ఊరొదిలి వెళ్ళిపోవడం లేదుగా! మీరంతా ఎప్పుడుపడితే అప్పుడు రావచ్చు మా ఇంటికి" అంది తను.

—గృహప్రవేశానికి వచ్చిన తన ఆత్మీయులను చూసి పద్మ రుసరుసలాడినా తను పట్టించుకోలేదు. ప్రతి ఒక్కరినీ ఆప్యాయంగా పలకరించి దగ్గరుండి కడుపునిండా భోజనం పెట్టించింది.

కానీ పద్మ ఏవిషయాన్నీ అంత తేలిగ్గా వదిలేసే మనిషికాదు. వచ్చిన అతిథులందరూ వెళ్ళిపోయిన తర్వాత 'నా తరఫున వచ్చిన వాళ్ళందరూ ఎంతో గొప్ప గొప్పవాళ్ళు, వాళ్ళ ముందు ఆ దిక్కుమాలిన వాళ్ళందరికీ అంతగా మర్యాదలు చేస్తారా?' అని తనమీద పోట్లాటకు దిగింది.

తనమీద ఆపేక్షతో వచ్చిన వాళ్ళని గురించి పద్మ అంత తేలిగ్గా మాట్లాడ్డం

చూసి మనసు చివుక్కుమంది. 'ఇంకెప్పుడూ తనకు తానుగా ఎవర్నీ ఇంటికి ఆహ్వానించకూడదు.' అని గట్టిగా నిశ్చయించుకుంది తను. గృహప్రవేశానికి వచ్చిన పెద్దకొడుకులూ, కోడళ్ళూ ఆ సమయంలో ఇంట్లో లేరు. వాళ్ళుంటే ఎంత పెద్ద గొడవ జరిగేదో—అనుకుని ఒక నిట్టూర్పు విడచి ఊరుకుంది....

—సీతమ్మ మళ్ళీ ఓసారి నిట్టూర్చి అక్కడ్నించి కదిలింది. చాలా సేపు ఒకే చోట నిలబడడం వల్ల కాళ్ళు నొప్పి పుట్టినట్టయి గదిలోకొచ్చి మళ్ళీ మంచం మీద వాలింది.

తెల్ల పిల్లి కూడా ఆమెతో బాటే వచ్చి మంచమెక్కింది.

కళ్ళు మూసుకున్నా పాత సంఘటనలే కళ్ళముందు కదలాడుతున్నాయి సీతమ్మకు.

—తనకోసం ఎవరొచ్చినా పద్మ సహించదు. అంతదూరంనుంచి వచ్చారన్న అభిమానంతో తను వాళ్ళకేమన్నా పెడితే ఇంకా ఎక్కువ ఉడుక్కుంటుంది.

"మనం ఎంత చెప్పినా ఆవిడకు లక్ష్యం లేదు. ఆవిడ మనసెప్పుడూ ఆ పాతింటోనే పాతుకు పోయింది వుంటుంది. అక్కడి వాళ్ళెవరైనా వస్తే చాలు—దేవుడే దిగొచ్చినంత సంబరపడి పోతుంది మీ అమ్మగారు." అని పద్మ సత్యంతో చెప్పడం తను చెవులారా వింది.

—నిజమే, అక్కడి ఇళ్ళు ఇరుకు కావచ్చు కానీ అక్కడి వాళ్ళ మనసులు మాత్రం ఇరుకుకావు; విశాలమైనవి. నిజం చెప్పాలంటే తనసొంత పిల్లలకంటె వాళ్ళే ఆత్మీయులుగా కనిపిస్తారు తనకు

—ఇలా ఆలోచిస్తూ, ఆలోచిస్తూనే నిద్రలోకి జారుకుంది సీతమ్మ.

మర్నాడు ఉదయం ఆమె నిద్రలేచేసరికి బాగా పొద్దెక్కింది. రాత్రంతా ఆలోచనల్లో గడిచి పోయినందువల్ల కాబోలు తలంతా బరువుగా అనిపించి బద్ధకంగా కళ్ళు మూసుకని అలాగే పడుకునుండి పోయింది సీతమ్మ.

అంతలో బయట ఎవరిదో మాటలధ్వని వినిపించింది: 'పిన్నిగారున్నారా ?' అని ఎవరో అడుగుతున్నారు.

"ఆ....ఉండకెక్కడికి పోతారు మీ పిన్నిగారు ? లక్షణంగా ఉన్నారు, కానేపాగితే లేచొచ్చి నీకు సకల మర్యాదలూ జరిపిస్తారులే! ఆగు!" అని వ్యంగ్యంగా అంటోంది పద్మ.

సీతమ్మ బద్ధకమంతా వదిలిపోయింది. గభాలున లేచి ఇవతలికి వచ్చింది.

పది పన్నెండేళ్ళ గోపి పద్మ మాటలకు భయపడిపోయి బిక్కు బిక్కుమంటూ నిలబడి వున్నాడు హాల్లో. వాడిని చూడగానే సంతోషంగా దగ్గరికెళ్ళి సీతమ్మ వాడ భయాన్ని పోగొట్టాలని సాంత్వనంగా "ఏరా గోపీ ఇలావచ్చావు? ఇంట్లో అందరూ కులాసాయేనా ?" అని అడిగింది

ఆవిడని చూడగానే గోపీకి ఎక్కడలేని ధైర్యం, ఉత్సాహం వచ్చాయి.

"మా యింట్లో అందరూ కులాసాయే పిన్నిగారూ....మరేమో పక్కింటి కమలత్త య్యకి ఒంట్లో బావుండడంలేదు. అందుకే ఈ ఉత్తరం రాసి మీకిచ్చి రమ్మన్నారు. మిమ్మల్ని రమ్మని మరీమరీ చెప్పారు" అని జేబులోంచి ఒక ఉత్తరం తీసి సీతమ్మ కందించాడు గోపి.

సీతమ్మ ఆదుర్దాగా ఉత్తరం విప్పింది.

ప్రియమైన పిన్నిగారికి,

చెప్పాలంటే సిగ్గేస్తోందికానీ ఈ సమయంలో మీరు దగ్గరుంటే ఎంతో ధైర్యంగా ఉంటుందని ఈవిషయం తెలియజేస్తున్నాను.

నాకు ఒకటే దిగులు....నీరసం. అందరూ వేవిళ్ళేమో అంటున్నారు. అందుకని మీరో సారి వస్తే బాగుంటుంది. తప్పకుండా వస్తారుకదూ?

ఇట్లు,
కమల

సీతమ్మ మొహం సంతోషంతో వెలిగిపోయింది. 'తప్పకుండా వస్తానని చెప్పరా గోపీ....' అని మళ్ళీ ఏదో గుర్తు చేసుకుని 'ఇంత మంచి శుభవార్త తెచ్చినందుకు నీ నోరు తీపి చేస్తానాగు' అంటూ గబగబా లోపలికి వెళ్ళి ముందురోజురాత్రి సత్యం తెచ్చిన స్వీట్స్‌లో రెండు పట్టుకొచ్చి గోపీ చేతిలో పెట్టింది.

అవి చూడగానే గోపీ మొహం వికసించింది. సంతోషంతో స్వీట్ ముక్క కొరుక్కు తింటూ వెళ్ళిపోయాడు.

అంతసేపూ కోపాన్ని ఎలాగో అణచుకున్న పద్మ అత్తగారిమీద ఒక్కసారిగా విరుచుకుపడింది.

"అంత ఖరీదుపెట్టి ఆయన స్వీట్స్ తెచ్చింది ఈ అడ్డగాడిదలందరికీ పంచిపెట్టడానికా?" అంది.

కమల గురించిన ఆలోచనల్లోనే మునిగిపోయి సంతోషంగా ఉన్న సీతమ్మ కోడలి మాట నంతగా పట్టించుకోలేదు. పైగా ఆ వార్తను ఆమెతోకుండా చెప్పాలన్న ఉత్కంఠను ఆపుకోలేక "మన కమలకు వేవిళ్ళట పద్మా....పాపం పెళ్ళయిన పదిహేనేళ్ళకు ఇప్పుడు కళ్ళు తెరిచాడు భగవంతుడు" అంది.

"ఛీ! సిగ్గులేకపోతే సరి. ఓపక్క జుట్టంతా నెరిసిపోయి ముసలితనం వచ్చేస్తుంటే ఇప్పుడింకా పిల్లలు కావలసొచ్చారు కాబోలు ఆవిడకి. అయినా ఈ వయసులో పిల్లలను కంటున్నందుకు సిగ్గుపడక తగుదునమ్మా అని ఇంకా అందరికీ చాటుకోవడం కూడానా? పైగా దానికి తగ్గట్టు మీరు మురిసిపోవడం; ఏదో మనకే జరిగినట్టు సంబరపడడం—ఇంకా బాగుంది."

పద్మ మాటల్లోని హేళనకు సీతమ్మ మనసు చివుక్కుమంది.

"ఏమిటోనమ్మా పాతకాలపు వాళ్ళం. మాకు ఆప్యాయతలు తప్ప ఇలా మరొకర్ని ఎద్దేవాచేయడం అసలు తెలీదు. ఏదో పాపం కబురంపింది కాబట్టి వెళ్ళి రెండు రోజులుండి వస్తాను...."

ఆవిడ మాటలింకా పూర్తికాకుండానే గయ్యమని లేచింది పద్మ.

"పిలవడానికి వాళ్ళకేం మొహమాటం లేదుకానీ వెళ్ళడానికి మీకైనా ఉండొద్దూ? ఆదరిద్రపు కొంపల్లోకి వెళ్ళడమే కాకుండా అక్కడ రెండు రోజులుండి రావడం కూడానా? ఖర్మ! మీఅబ్బాయి హోదాకు తగ్గట్టుగా హుందాగా ఉందామన్న ఆలోచన మీకెందుకురాదో నాకర్థం కాదు. అడ్డమైనవాళ్ళకి చాకిరీ చేయడానికి మీరేమైనా 'ఆయా' అనుకుంటున్నారా వాళ్ళు? వాళ్ళకా జ్ఞానం లేకపోతే పోయింది. మీకైనా ఉండొద్దూ?"

పదునైన పద్మ మాటలు సీతమ్మగారి హృదయాన్ని తీవ్రంగా గాయపరిచాయి. తనజీవితంలో ఎన్నడూ ఎవరితోనూ మాటలుపడిఎరుగదు; అత్తమామల మెప్పునీ, బయటివాళ్ళ అభిమానాన్నీ, కొడుకుల ప్రేమనీ పొంది జీవితంలో ధన్యతను అనుభవించిన తను ఈనాడు ఈ దురుసు నోటికి చిక్కవలసివచ్చిందేనన్న ఆవేదన ఆవిడ కళ్ళల్లో అశ్రువుల రూపంలో ప్రతిఫలించింది.

అతి కష్టంతో అశ్రువులను ఆపుకుంటూ అంది ఆవిడ: "ఇప్పుడైతే ఈ ఇల్లు, ఈ హోదా అన్నీ వచ్చాయిగానీ మొదటి నుంచీ మనం ఉన్నది అలాంటి ఇళ్ళల్లో

-లాంటి పరిస్థితుల్లోనేకదమ్మా? ఇప్పుడు కొత్తగా హోదా, అంతస్తూ అంటూ గంభీరం నేర్చుకున్నారు. నాకు మనుషు లంతా ఒక్కటే. వాళ్ళందరూ నా ఆత్మీయులే!"

ఆ మాటవిని పద్మ రెచ్చిపోయింది. ఉక్రోషం, ఆవేశం పట్టలేక "అయితే వాళ్ళదగ్గరికే వెళ్ళి అక్కడే ఉండరాదూ? ఇక్కడుండి మా పరువులు తీయడం ఎందుకూ?" అనేసి తనగదిలోకి వెళ్ళి పోయింది.

సీతమ్మ అభిమానం దెబ్బతింది. ఇక అవమానం భరించేశక్తి తనలో లేదనిపించింది. "అలాగే వెళతాను. అబ్బాయి వాకింగ్ నుంచి తిరిగిరాగానే చెప్పేయి" అని పద్మ గది దగ్గరికి వెళ్ళి చెప్పేసి, ఓ సంచీలో రెండు చీరలు కుక్కుకుని ఇంట్లో నుంచి వెళ్ళిపోయింది సీతమ్మ.

ం ం ం ం

సత్యం మార్నింగ్ వాక్ నుంచి తిరిగి వచ్చాడు. తల్లి ఇంట్లోనుంచి వెళ్ళి పోయిన సంగతి తెలుసుకుని భార్యను బాగా కేకలు వేశాడు.

"ఓగంటసేపు అలా తిరిగొచ్చేసరికి ఇంత రాద్ధాంతమా? ఇంతకాలం ఎలాగో సహించాను. మీరిద్దరిలో ఎప్పటికైనా ఒద్దిక కుదురుతుందని ఎంతగానో ఓపిక పట్టాను అమ్మను ఇంట్లోంచి వెళ్ళగొట్టేంత సాహసం చేస్తావని నేననుకోలేదు. అసలు మా అమ్మను నువ్వెప్పుడూ అర్థం చేసుకోవడానికి ప్రయత్నించలేదు. పద్మా.... ఆవిడ ఉదారబుద్ధిని నువ్వు తప్పుగా అంచనా వేసుకున్నావు. ఇంతమంది జనం ఆవిడను అభిమానించడం గొప్పతనం కాదా? ఆవిడ దృష్టిలో అందరూ ఒకటే, నావారూ పరాయివారూ అన్న భేదం ఆమె ఎప్పుడూ పాటించలేదు. మమ్మల్ని పెంచి పెద్దచేసి ఇంతవాళ్ళని చేయడానికి ఆమె ఎంత కష్టపడిందో మాకుతెలుసు. ఆవిడ అంతమంది అభిమానం సంపాదించుకోకపోతే ఇదంతా సాధ్యమయ్యేదికాదు. ఆవిడ మాటంటే అక్కడివారందరూ వేద వాక్యంలా భావిస్తారు. నువ్వుతప్ప ఇంతవరకూ ఆమెకు ఎదురాడలేదు. అభిమానం గల మనిషి. ఆమె ఒకరిచేత చిన్నమాట కూడా పడి ఎరగదు. అలాంటిది కన్న కొడుకింట్లోనే ఇంత అవమానం జరిగితే సహించగలదా? అందుకే వెళ్ళిపోయింది. ఇక్కడలేని విలువ అక్కడ ఆవిడకి లభిస్తుంది నిజమే. కానీ మన విలువేమవుతుంది.? నువ్వే ఆలోచించు. ఆవిడ పద్ధతులు నీకు చాదస్తంగానూ, హీనంగానూ కనిపించవచ్చు కానీ—ఆవిడ జీవిత పద్ధతే అంత—దానికి భిన్నంగా ఆమె ఎప్పుడూ పోదు. అలాగని కన్నతల్లిని వదిలేసుకోమంటావా?... వెళ్ళి క్షమాపణ చెప్పుకుని ఇంటికి తీసుకొద్దాం పద." అన్నాడు సత్యం.

భర్త మాటలు వింటున్నంతసేపూ పద్మ మొహంలో అనేక భావాలు కదలాడాయి. మెల్ల మెల్లగా ఆమెలో పశ్చాత్తాపం చోటుచేసుకో సాగింది. భర్త మొహం చూడలేక తలవంచుకుంది.

ఆమెలో అంత త్వరగా మార్పు రావడం చూసి సత్యం ఆశ్చర్యంతో అవాక్కయి పోయాడు.

పద్మ చటుక్కున తలెత్తి "ఇప్పుడే వెళదాం పదండి!" అంది.

ఆమెవైపు సంతోషంగా చూశాడు సత్యం. ●

సీరియల్

# సౌభాగ్యలత

## ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవీ రామశాస్త్రి

జరిగిన కథ

(శశిరేఖకు తనేకాదు, తన చెల్లెలు వకుళ కూడా శ్రీమంత్‌ని పెళ్ళి చేసుకోవటం ఇష్టం వుండదు.

వకుళ నిరాడంబరతని, మానసికమైన పెరుగుదలని చూసి ఆశ్చర్యపోతుంది శారద. వకుళతో జరగబోయే తన వివాహం, శ్రీమంత్ జీవితంలో అనుకోని మలుపు; అందుకే-భావి జీవితం ఎలా వుంటుందో వూహించుకోలేక సతమతమైపోతూ వుంటాడు శ్రీమంత్. శ్రీమంత్‌కి పెట్టుపోతల విషయంలో జరుగుతున్న చిన్నచూపుని సహించలేక పోతారు రఘురామయ్యగారు)

—ఇక చదవండి—

"ఛీ ఛీ" కోపంగా లేచి తన గదిలోనికి పోయాడు రఘురామయ్య.

అంతలో మళ్ళీ వెనక్కు వచ్చి తీక్షణంగా చూచాడు భార్యను.

"పెద్దదాని కోసం చిన్నదాని నోరు కొట్టావ్ కదా? ఇద్దరూ నీ బిడ్డలు కాదా?"

"మీరు లేనిపోని గొడవ లేవదీయకండి."

"పెద్దది ఇపుడు పెళ్ళి వద్దనడం శ్రీమంత్ నేరం, అతను అల్లుడిదర్జా వెలగ పెట్టక పోవడం అతడి నేరం. ఔనా?"

విశ్వేశ్వరి తీవ్రంగా "మీ కతడిపై మోజువుంటే మీరే వెళ్ళి కావలసినవి తెచ్చుకొని ఇవ్వండి. ఏం? పెద్దది ఇపుడపుడే పెళ్ళి వద్దని అన్నపుడు చిన్న దానికేం తొందరపాటు వచ్చింది కన్పించినవాడిని కట్టుకోవటానికి? ఇద్దరల్లుళ్ళూ ఒకరి కొకరు తీసిపోనంత గొప్పగా వుండాలని నాకు మాత్రం వుండదా? ఎందుకిప్పుడిది శ్రీమంత్‌ను కట్టుకోవడం?"

"ఛీ ఛీ. నూటికి తొంభై మంది ఆడవాళ్ళకు డబ్బు డబ్బు డబ్బు! ఇంకేం కన్పించదీ ప్రపంచంలో."

అన్నీ తనగదిలో నుండి ఆమూలాగ్రంగా విన్న వకుళ మనసు బాధా పరితప్తమై దహించ సాగింది.

'అమ్మ! తననూ అక్కనూ ఒకలాగే కని పెంచిన తల్లి! కానీ ఆ ఆంతర్యంలో ఎన్ని అంతరాలు? మరెన్ని అల్పమైన ఆలోచనలు! ఛీ' ఊహ తెలిసిన తర్వాత మొదటి సారిగా కంటనీరు తిరిగింది.

# 20

క్లుప్తంగా రఘురామయ్య ఇంట జరిగిన వకుళా శ్రీమంత్‌ల వివాహానికి ఇరు పక్షాల కుటుంబ సభ్యులూ, రఘురామయ్య ఇంటి నౌకర్లూ కాక ఆ వీధిలోని ముఖ్య స్నేహితులైన రెండు కుటుంబాలవారు, విశ్వేశ్వరి సోదరులు ఇద్దరు మాత్రం హాజరయ్యారు.

వివాహ సమయంలో వకుళ వదనం నిశ్చలంగా, మనసు నిర్మలంగా, హృదయం నిండుగా వున్నది.

శ్రీమంత్ తన వాడైనాడు!

ఈ అదృష్టం తాను ఆశించనిది; ఊహించనిది!

"భగవాన్! నీకు కృతజ్ఞురాలిని, సాక్షాత్తూ నీవే లభించిన త తృప్తిగా వున్నది నాకు. ఈ జీవితం ప్రశాంతంగా సాగనీ. శ్రీమంత్ నన్ను హృదయంతో కూడా స్వీకరించేట్లు చేయి. ఇంతకంటె ఏమీ కోరను."

శిల వలె వున్న శ్రీమంత్ వదనం నుండి ఎవ్వరూ ఏ భావాన్నీ గ్రహించనుగానీ ఊహించనుగానీ అశక్తులైనారు.

రఘురామయ్యా శశిరేఖలతోపాటు అక్కడవున్న అందరి కనులూ శ్రీమంత్‌నే నిశితంగా గమనించుతున్నాయి.

కానీ శ్రీమంత్ చూపులు ఎవ్వరిపైనా ఒక్కసారికూడా ప్రసరించలేదు; కనీసం తన చేసుకోబోతూన్న వధువుపైనైనా అతడి దృష్టి క్షణకాలం కూడా నిలువలేదు.

గంభీర తీక్షణతతో నిండిన ఆ దృష్టి తమ ఎదుట ఉజ్వలంగా జ్వలించుతున్న అగ్నిహోత్రం పైన, లేదా పండితుడు తమచేత పూజ చేయించుతున్న గౌరీదేవి ప్రతిమపైన నిలచివున్నదేకాని మరొక వస్తువుగానీ, వ్యక్తిగానీ అక్కడ వున్నట్లు గమనించినట్లే లేదు.

అతి సుందరంగా అలంకరించుకున్న శశిరేఖ అనేక విధాల ప్రయత్నించింది శ్రీమంత్‌ను కవ్వించి బాధించాలని.

కానీ శ్రీమంత్ ఆమె అస్తిత్వాన్ని ఏనాడో మరచినట్లున్నది పాషాణ ప్రతిమవలె కూర్చున్న ఆ తీరు.

పుడమిపైననే దృష్టి సారించి హోమం చుట్టూ ప్రదక్షిణలు చేస్తున్నపుడూ, బొమ్మలాగా తలంబ్రాలు యాంత్రికంగా పోస్తున్నపుడూ అతడు కొందరి పరిహాసాలకు పాత్రుడైనాడు.

"అదేమిటోయ్ బొత్తిగా అమ్మాయికంటే నువ్వే సిగ్గుపడుతున్నావే?" అన్నారు ఇద్దరు ముగ్గురు పెద్దలు మేల మాడుతూ.

ఆ హాస్యం శ్రీమంత్ చెవులను కూడ చేరలేదు.

"ఇదేమిటి? అతడి ఆఫీసు స్నేహితులైనా ఎవ్వరూ రాలేదు?" కొన్ని కనుబొమ్మలు పైకి లేచి ప్రక్కవారిని అడిగాయి.

"ఇంతకూ యింత గుట్టుగా యింత తొందరగా — పెద్దపిల్ల నట్టేపెట్టి ఇలా







చేయడంలో — అహా — ఏమైనా అవాంతరం ముంచుకొచ్చిందా అని?"

అనాగరికపు ఆరాలు తీశాయి, పళ్ళన్నీ బయట వుంచుతూ కొన్ని కొంపలు ముంచే రకాలు.

ఇవన్నీ వినిన శారద జాగ్రత్తగా అన్నను గమనించింది. పురుషుడూ, అతడి హావభావాలూ, కళలూ ఎరిగున్న ఇల్లాలు శారద యిపుడు; పూర్వపు చిన్న పిల్ల కాదు. అందుకే అన్నను పరిశీలనగా గమనించిన ఆమె కనులలోని నిరాశనూ, ఎదలోని నిర్లిప్తతనూ, అంతరాంతరాలలో ప్రజ్వరిల్లుతూన్న బడబానలాన్నీ పసిగట్టగలిగింది.

వకుళలో కూడ అపూర్వమైన గాంభీర్యాన్ని గమనించింది ఆమె.

కానీ ఎంత చనువువున్నా ఏమని అడుగుతుంది?

ఈ వివాహంపట్ల 'అన్న విముఖుడు' అనే సత్యాన్ని ఆ అనుభవజ్ఞరాలు తేలికగా తెలుసుకున్నది.

ఈ వివాహంపట్ల శశిరేఖా విశ్వేశ్వరిల అయిష్టతను కూడా ఆమె బాగానే గమనించింది. ఎవరో పంచన చేరిన పరాయిపిల్ల పెండ్లి మ్రొక్కుబడిగా జరిపినట్లున్నది కానీ "కన్న కుమార్తె" అనే భావమే వున్నట్లులేదు విశ్వేశ్వరి హీనమైన పెట్టుపోతలు పరిశీలించితే.

శారద మనసు వకుళ పట్ల ఆర్ద్రితతో నిండిపోయింది.

'ఈ యిద్దరూ మనసులు సర్దుకొని ఒకటవ్వాలంటే నేనేమైనా చేయగలనా?'

ఇద్దరినీ జాగ్రత్తగా గమనించుతూ, తన సహజ పరిహాసాలను తగ్గించి, ఇంటి పని అంతా తానే చూచుకుంటూ జాగ్రత్తగా మసలడానికి నిశ్చయించుకున్నది శారద.

వివాహపు తంతు పూర్తి ఔతూనే, ఆ రోజే తమ యింటికి వెళ్ళిపోయాడు శ్రీమంత్.

"అరె! ఈరోజే వెళ్ళిపోకూడదు. ఇక్కడ మూడు రోజులు వుండి...........పద్ధతు

లున్నాయి కదా?" అంటూ అభ్యంతరం పెట్టారు ముత్తయిదువులు.

రఘురామయ్యా, కోటయ్యాకూడ వారినే బలపరచారు.

అయితే శ్రీమంత్ లక్ష్యపెట్టలేదు.

"క్షమించండి నాకు ఈ తతంగాలలో అంతగా నమ్మకం లేదు. ఇంతవరకూ మీ కోసం ఇవన్నీ చేశాను. నన్ను వెళ్ళనీయండి."

ఆ వదనంలోని గాంభీర్యాన్నీ, కంఠంలోని కఠిన నిశ్చలత్వాన్నీ గమనించిన వారు మరి తర్కించలేదు.

"అయితే వెంట వకుళనుకూడ పంపవలసిందే, వివాహాంతాగానే వరుడు ఒక్కడూ వెళ్ళరాదు." అన్నారు పెద్దలంతా ఏక గ్రీవంగా.

విశ్వేశ్వరి కొంచం సణిగినా, నలుగురి మాటతోనూ ఏకీభవించక తప్పలేదు.

పద్ధతి ప్రకారం పండితుడు అంపకాలు పలికించాడు.

"ఇక ఈ క్షణం నుండీ మీ అమ్మాయే కానీ మా అమ్మాయి కాదు"

అని అల్లునితోనూ కోటయ్యతోనూ పలుకుతూన్న రఘురామయ్య కంఠం గద్గదమై ఉచ్చారణే కష్టమైంది.

అల్లుడి చేయి మృదువుగా నొక్కి వదిలాడు, ఆ చర్యలోనే అనేక సందేశాలు.

శ్రీమంత్ ఒక్కసారి తలెత్తి మామగారి వదనం చూచి అర్థయుక్తంగా తల పంకించాడు; అందులోనే అతి ఉత్తమమైన సమాధానం నిబిడీకృతమై వున్నది.

"ఏముందీ? ప్రక్కయిల్లేగా? ఎక్కడికి వెడుతోంది? మాకళ్ళెదుటేగా తెల్లారితే? ప్రక్క ప్రక్క యిళ్ళు మూలాన-వెళ్ళినా వచ్చినా పెద్దగా సందడీ, ముచ్చట్లూ వుండవు"

అతి సాధారణంగా అంటోంది విశ్వేశ్వరి ఎవరితోనో.

అంత వరకూ ఏమీ పట్టక నిర్లిప్తంగా వున్న శ్రీమంత్‌ను ఈ మాటలు చలింపజేశాయి.

రెండు క్షణాలు విశ్వేశ్వరిని ముగ్ధునివలె చూచాడు.

"అయ్యా అమ్మాయి చెయి పట్టుకుని నడవాలయ్యా." ఒకరు హెచ్చరించుతూ వకుళచేతిని అతని చేతితో కలిపారు.

చేయీ చేయీ జోడించి వధూ వరులు గడప దాటారు. రఘురామయ్యకు ఒక కంటిలో ఆనందం, మరొక కంటిలో శూన్యంగా తోచింది.

స్నేహితుల వివాహాలెన్నో చూచినప్పటికీ శశిరేఖకు ఈనాడిందతా చాలా ఆశ్చర్యంగా కన్పట్టింది.

చెల్లెలు గడప దాటుతోంచే ఆమె హృదయం కలుక్కుమన్నది. విచారంగా చూస్తూ నిలచి పోయింది స్థాణువై.

ఎంత పోట్లాడుకున్నా, ఎన్ని అభిప్రాయలు భేధాలున్నా చెల్లెలు చెల్లెలేకదా!

పెండ్లి కళతో, తల వంచుకు భర్త సరసన నడచి కను మరుగౌతూన్న చెల్లెలు తానెరిగిన చెల్లెలు కాదు—ఎవరో క్రొత్త స్త్రీని చూస్తూన్నట్టు తోచింది.

# 21

ఏ అట్టహాసమూ చేయక హారతి ఇచ్చి, మౌనంగా అన్నా వదినలను లోనికి కొని తెచ్చింది శారద.

దుస్తులు మార్చుకొని వంటగదిని ప్రవేశించ బోతూన్న వకుళను వారించింగి




# ఇదిగో!
# పెప్పర్‌మెంట్ రుచి కలిగిన ఒక చాక్‌లెట్ బిస్కట్

# స్క్రన్చ్

## కరకర తినే చక్కని తినుబండారం

భారతదేశంలో ఈ రకం రెండు రుచుల తియ్యని తినుబండారం ఇదే మొదటిసారి—చాక్‌లెట్ మరియు మింట్ కలసినది. మృదువయినది. రుచికరమైనది. ఎక్కువ చాక్‌లెట్ క్రీమ్‌తో వున్నది—గోధుమవన్నెగల కరకరలాడే రెండు అందమైన బిస్కట్ల మధ్యవున్న పెప్పర్‌మెంట్ రుచిగల చాక్‌లెట్. ఇటువంటి దానిని మీరు యింతవరకు ఎప్పుడు రుచి చూడలేదు. ఇప్పుడే ఒక్క ప్యాకెట్ బిస్కట్ తీసుకోండి. కరకర నములుతూ తినండి. స్క్రంచ్... స్క్రంచ్...స్రంచ్...



## స్క్రన్చ్ కరకర తినే చక్కని తినుబండారం

ట్రూ బిస్కట్లు తయారుచేసేవారు అందచేస్తున్న సరిక్రొత్త తినుబండారం

HTM-AFL-2345

శారద.

"అయిదు రోజుల వరకూ సమస్తం అక్కడినుండే వంపించు తామని అన్నారు మీ నాన్నగారు, ఇక్కడ ఏమీ చేయవద్దని ఆంక్ష పెట్టారు."

"సరే"

"పెండ్లి కుమార్తెగారూ, మీరు కొంతకాలం వంట యింటిని మరచి, పతిదేవుడి అవసరాలు చూచుకోవాలి."

వకుళ మాటలాడలేదు.

మరికొంత సేపటికి శ్రీమంత్ పెండ్లి వేషం పూర్తిగా తీసివేసి మామూలు దుస్తులతో బయటకు పోతూ, "శారదా నేను ఓ గంటలో తిరిగి వస్తాను." అన్నాడు.

"ఇప్పుడా ?"

కంఠంలోనే వుండి పోయాయి శారద మాటలు.

"త్వరగా వచ్చేయన్నాన్లే, వచ్చేప్పుడు చామంతిపూలు తెచ్చి పెడతావా ?"

"అలాగే"

"చీకటి వడేవేళ, ఇపుడు బయటకు పోకపోతేనేంరా?" కోటయ్య అన్నాడు.

సమాధాన మీయకనే సాగిపోయాడు శ్రీమంత్.

వకుళ వదనంలో భావాలు చదవబోయిన శారద కృతకృత్యురాలు కాలేక పోయింది.

రాత్రి భోజనాలతో పాటు రెండు బుట్టలు పూలు పంపించింది విశ్వేశ్వరి.

"రండి అమ్మాయిగారూ, ఇలా కూర్చోండి, మీకు పూలజడ వేయమన్నారు అమ్మగారు."

అన్నది ఆ వచ్చిన ముత్తయిదువ వకుళను,

శారద ఆనందంగా చూచింది వకుళదేస.

వకుళ నేత్రాలలో నీలి నీడలు కదలాడాయి; వదనంలో రంగులు త్వరత్వరగా.

"అటువంటి చాదస్తాలేమీ నా కిష్టంలేదు. ఇది చాలు·" అని ఓ పూలచెండు తీసి తలలో తురుముకుని మరో గదిలోకి వెళ్ళిపోయింది.

శారదకు ఏమీ మాటలాడే సాహసం లేకపోయింది.

ఆ వచ్చిన ముత్తయిదువ విచిత్రంగా, నిరసనగా చూచింది.

"మరీ చదువుకున్న విరగబాట్లు! ఈ నాటి ముద్దూ మురిపెమూ మరోనాడు కావాలంటే వస్తాయా? నేను పదాచికాలాడుతూ, పూలజడ వేశానంటే జన్మంతా గుర్తుండాలి."

సణుగుతూ వెళ్ళిపోయింది ఆమె!

రాత్రి పదకొండు గంటలకు తిరిగి వచ్చిన అన్నను అయోమయంగా చూచింది శారద.

"సారీ, సినిమాకెళ్ళాను....నాకు భోజనంవద్దు-ఆకలిలేదు" అంటూ తన గదిలోనికి వెళ్ళిపోయాడు.

పువ్వులు తెమ్మని చెప్పిన సంగతి అసలు గుర్తున్నట్లే లేదు.

శారద మనస్సు నీరసంగా నిట్టూర్చింది. విషయం ఆమెకు అర్థమయ్యీ అవ్వ కుండా వున్నది.

వరండాలో నిద్రపోతూన్న వకుళను లేపింది.

"అన్న భోజనం చేయడట. నువ్వు చేసేయి"

"నాకు ఆకలి లేదు శారదా, పడుకోనీయ్ నన్ను"

"సరే. అయితే రా. పాలైనా త్రాగు"

పాలు త్రాగి తిరిగి వరండావైపు నడుస్తూన్న వకుళను పట్టి ఆపి శారద భావయుక్తంగా నవ్వింది కనులలోనికి చూస్తూ.

"అటుకాదు ఇటు! అన్న గదిలోనికి. ఇదుగో-ఈ పాలగ్లాసు తీసుకుపో. అన్న కియ్యి"

వకుళ హృదయకంపన తనకే విన్పించేటంత వేగంగా వున్నది. మౌనంగా నిలచిపోయింది కర్తవ్యం ఆలోచించుకుంటూ.

"ఓ! సాయం కావాలా అమ్మాయిగారికి?" శారద నవ్వుతూ అన్నది పెద్ద సన్నజాజుల మాల తెచ్చి వకుళ కురులలో ముడుస్తూ.

చురుకుగా చూసింది వకుళ.

"ఏం అక్కర్లేదు" అనేసి లేని ఉత్సాహాన్ని ప్రదర్శించుతూ శ్రీమంత్ గదిలోనికి నడచి నిశ్శబ్దంగా తలుపులు మూసుకున్నది.

శ్రీమంత్ నిద్రపోలేదు కుర్చీలో కూర్చునివున్నాడు దీర్ఘాలోచనలో మునిగి.

గదిలో మూల అగరువత్తులు వెలుగుతున్నాయి. టేబుల్ మీద కొన్ని పండున్నాయి. శారద తనకు తోచినట్లు గదిని అలంకరించినట్లు గ్రహించారు వకుళా శ్రీమంత్ లిద్దరూ కూడ.

అతను తనతో మాటలాడడని అనుకున్న వకుళ ఊహ పొరపాటే అయినది.

"వకుళా!" మెల్లగా సంబోధించాడు శ్రీమంత్.

ఆమె మౌనంగా చెంతకు నడచి తలవాల్చి నిలచింది.

శ్రీమంత్ కుర్చీనుండి లేచి కిటికీచెంతకు పోయి నిలబడ్డాడు.

అతి మంద్రస్థాయిలో మాటలాడాడు:

"వకుళా! నీవు సంగతులన్నీ తెలిసినదానవు నన్నర్థం చేసుకుంటావనే అనుకుంటాను."

". .. ..... ....."

"వకుళా, ప్రేమ అనేది ఒకసారే ఒకరిపట్ల మాత్రమే అంకురించేది: కానీ అది లక్ష్యమయ్యేది కొందరికే! అది ఆశించి లభించని హృదయం శూన్యమౌతుంది. ఆ సూన్యమైన ఎడారిలోకి నువ్వు కోరి ప్రవేశించావు"

"లేదు శ్రీమంత్" అతి మధుర మంద్రస్వరంతో అంటూ తల ఎత్తిన వకుళ కనులలో అతడిపట్ల ఎనలేని ఆరాధన ప్రతిబింబించుతూన్నది.

అయితే శూన్యంలోనికి చూస్తూ మాట్లాడుతూన్న అతను ఆ ఆరాధనా జ్యోతిని గమనించగల స్థితిలో లేడు.

"శ్రీమంత్! నేను కోరి ప్రవేశించినది ఎంత పవిత్ర మందిరమో నేనే ఎరుగుదును"

"కాని ఆ మందిరంలో దైవం లేడు. అది శూన్య మందిరం."

"ఉన్నాడు. కేవలం నాకు మాత్రమే కన్పించే శ్రీనివాస సముడైన శ్రీమంత్ ఉన్నాడు అక్కడ!"

"అది కేవలం అడియాస! లేడు!"

"లేకున్నా ఆవాహన చేసి ప్రతిష్ఠించుకోగలను శ్రీమంత్, ఆ ధైర్యం నాకున్నది.




ఆ నమ్మిక............"

"నమ్మిక వమ్ము అయితే?"

"నన్ను నిందించవ, సరేనా?" గంభీర హాసంతో మరి రెండు అడుగులు అతడి దగ్గరగా నడిచింది.

"శ్రీమంత్! వకుళను నీవు ఈనాడే తెలుసుకోలేదు. పూర్వం కూడా నీకు పరిచితు... నీ ఔన్నత్యాన్ని గుర్తించి, నీకు తోడు నీడగా నిలిచి ఆ నీడలోనే తాను ...త పొందవలెనని ఈనాడు నీ జీవితంలో ప్రవేశించిందే కాని, నిన్ను ఇబ్బందులకు గురి చేయాలని గానీ, ఎటువంటి అడియాసలతో గానీ రాలేదు. నీ మనసున రగిలిన అగ్ని చల్లారడానికి కొంత సమయం కావాలని కూడా ఆమెకు తెలుసు."

అప్రయత్నంగా ఇటు తిరిగాయి శ్రీమంత్ కనులు.

వకుళ వదనం నిర్మలంగా, కనులు ప్రశాంతంగా తననే గమనించుతూన్నాయి.

అదే నిర్మల స్వరంతో తన మాటలు పొడిగించింది వకుళ.

"ఔను శ్రీమంత్! నీవు ప్రేమించినవారు నిన్ను గుర్తించకున్నా నిన్ను ప్రేమించిన వారు నీ చెంత వున్నారు. నిజమైన ప్రేమ వెన్నెలై నిన్ను అహ్లాద పరచగలదే కానీ కానీ కష్టాలు కలిగించదు. ఏ విషయంలోనూ, ఏ సమయంలోనూ నిన్ను ఇబ్బంది పెట్టేది కాదు ఈ వకుళ."

"థాంక్స్"

తేలికగా నిశ్వసించాడు.

వకుళ మెల్లగా నడచి తన పెట్టె తెరచి ఒక దుప్పటి, ఎయిర్ పిల్లో తీసుకుని ఆ ప్రక్క సామానుల గదిలోనికి నడిచింది.

# ఇన్క్రిమిన్ బాలలు

## కేవలం పెద్దగాకాదు,
## ఎంతో చక్కగా పెరిగే పిల్లలు!






ఇన్క్రిమిన్ టానిక్ పెరిగే వయసులో ఎంతో పెద్ద...పెద్ద తేడాను తెస్తుంది. నిడానికి అసలు విషయం ఏమిటంటే ఇన్క్రిమిన్ టానిక్ ఇతర టానిక్లకన్న ఓ మెట్టు పైనుంది. ఎందుకంటే, ఆరోగ్యమైన పెరుగుదలకోసం అత్యవసరమైన విటమిన్లతోపాటు ఇన్క్రిమిన్లో లైసిన్ కూడా ఉంది గనక. ఆ లైసిన్ ఆకలిని పుట్టిస్తుంది. పిల్లలు చక్కగా పెరగాలంటే బాగా తినాలన్న మాట ప్రతి తల్లికీ తెలుసు. ఈ ఇన్క్రిమిన్ అలా బాగా తినే ఆహారాన్ని మేలైన పెరుగుదలకు తోడ్పడేలా మారుస్తుంది మరి.

Lederle ఉత్పాదన

* అమెరికన్ సయానమిడ్ కంపెనీవారి రిజిస్టర్డ్ ట్రేడ్‌మార్క్

## ఇన్క్రిమిన్* టానిక్

14 ఏళ్ళలోపు వయస్సు పిల్లలకోసం సిరప్
2 ఏళ్ళలోపు పాపాయిలకోసం డ్రాప్స్



## తినేమంచి ఆహారాన్ని తీరైనపెరుగుదలగా మారుస్తుంది.

Sista's-INC-1064/80 TEL

"ఎందుకు ఆ యిరుకు గదిలో? నువ్విక్కడ పడుకో, నేను వరండా మీద........"
"మన విషయం మన మధ్యనే వుండనీ, ఎవరూ గ్రహించరాదు!"

# 22

"శారదా? నా పనులు త్వరగా అయిపోవాలివాళ, నేను త్వరగా ఆఫీసుకు వెళ్ళాలి."

ఉదయం నిదుర లేస్తూనే అంటూన్న అన్నను పరీక్షగా గమనించింది శారద.

"రెండ్రోజులు ఇంటిపట్టున వుండరాదూ? అంతగా పెళ్ళికి కూడా సెలవు దొరకకండా.........."

"ఎందుకు దొరకదు. నేనే అడగలేదు. అవసరం లేదు."

"అదేమిటన్నయ్యా? పెళ్ళి రెండ్రోజులు కూడా ఆఫీసా?"

"ఇంటి దగ్గరుండి చూడవలసిన బంధు వలగం; సందడీ ఏం లేదుగా?" అన్నాడు షేవ్ చేసుకుంటూ.

"మరి వదిన?"

"ఏం, క్రొత్త చట్టమా? ఆమెకు నువ్వున్నావు. చాలు."

స్నానానికి వెళ్ళిపోయాడు.

మరో పది నిముషాలు తర్వాత "శారదా వెళుతున్నాను." అనేసి వెళ్ళిపోయాడు అతడు నిష్క్రమించిన దెసగానే చూస్తూండిపోయింది శారద కొన్ని నిముషాలు.

వకుళ మౌనంగా తన పనులు చూచు కుంటూన్నది. ఆ ముఖంలోని గాంభీర్యం శారద మును పెన్నడూ చూడనిది. ఏమైనా మాట్లాడాలని అనుకున్న శారదకు అవకాశమేకలగలేదు. మధ్యాహ్నమంతా విశ్వేశ్వరీ, ఎవరెవరో పరిచితులూవచ్చి సాయంత్రం వరకూ కూర్చున్నారు

వకుళ పెండ్లి కుమార్తె గనుక ఆమె మౌనం ఎవ్వరినీ ఆశ్చర్య పరచలేదు.

"శారదా. కాఫీ తెమ్మా"

ఆఫీసునుంచి వస్తూనే శ్రీమంత్ అడిగాడు.

తర్వాత పేపరు పట్టుకూర్చున్నాడు ఓ గంట; అతి దీక్షగా పరీక్షకు చదివినట్టు,

"శారదా వంట అయ్యిందా?"

భోజనం చేస్తూనే గదిలోకి వెళ్ళిపోయాడు.

శారదలో మీమాంస చెలరేగింది.

అతడు రాగానే అవసరాలు చూడలని గానీ, అతడితో మాట్లాడాలనే ఆరాటం గానీ, నవ వధువు వదనంలో కనబడే లజ్జారుణిమానందాలు గానీ వకుళ వదనంతో ప్రదర్శితం కాక పోవడం శారద నాల్గురోజులు పాటు గమనించింది.

దంపతుల నడుమ దూరం వున్నట్లు ఆమె గమనించింది. !

కానీ అది ఎటువంటి దూరం?

సంసారం చేస్తూన్న యువతి శారద, పురుషుని తీరు తెన్నులూ, సమయ రోచిత మైన కళల స్వరూపాలూ తెలుసుకున్న యువతి.

అందుకే అన్నా వదినల గురించి ఆమె మనసు చింతాకులిత మైంది. అతి జాగరూకతతో దంపతులను గమనించ సాగింది.

"శారదా. ఉత్తరాలేమైనా వచ్చాయ్యా' అంటూ ఆ సాయంత్రం వచ్చిన అన్నకు కాఫీ యిస్తూ నవ్వింది శారద.

"చూడన్నయ్యా. మీ పెండ్లి అయి ఇవాల్టికి సరిగా వారం, ఇంకా సిగ్గేమిటి? ప్రతి దానికీ నన్నే పిలుస్తావేం? నీ క్కావలసిన వన్నీ వదిన నడుగు."

"ఏం. నీకేమైనా బరువుగా వున్నయా నా పనులు "

"బాగుంది. నే నెన్నాళ్ళుంటాను? మీ బావగారు ఉత్తరం వ్రాశారు రమ్మని."

"ఉన్నన్నాళ్ళూ చేయడానికేం?"

"ఎందుకు చెయ్యాలి? ఇదుగో వదినా ఇలా రావమ్మా" అంటూ బిగ్గరగా పిలిచింది.

ఏమిటోనని వచ్చింది వకుళ.

"ఇదిగో అమ్మాయ్, మీ వారు ఆఫీసునుంచి వచ్చారు. కాఫీ ఇయ్యి. ఇక యిటు వంటి పనులన్నీ నువ్వే చూచుకోవాలి, నేనేం మీ యింటి దాసీని కాను. ఈ యింటి ఆడ బిడ్డను, ఆ!"

అతి గభీరంగా విన్పించిన ఆ తీరుకు వకుళా శ్రీమంత్‌లు నిర్ఘాంతపోయి ముఖ ముఖాలు చూచుకున్నారు.

"ఔహోయ్. ఏమిటలా చూస్తావ్? నీ ఇల్లు-నీ భర్త, నీ మామగారు. పనులు నేర్చుకో."

మరి గాంభీర్యాన్ని పోషించలేక ఫక్కున నవ్వేసింది శారద.

'హమ్మయ్య! ఇదంతా హాస్యమే కదా!' అన్నట్లు తేలిక మనసుతో చిరునవ్వులు చిందించారు వకుళా శ్రీమంత్‌లు.

"మరేమిటన్నయ్యా, మరి బొమ్మల్లాగా ఇద్దరికిద్దరూనూ?"

"అదికాదు శారదా, నువ్వు..........." వకుళ ఏదో చెప్పబోయింది.

"ఓహో, నా ఎదుట సిగ్గా? అయితే నేను వెళ్ళిపోతాలెండి."

"ఛ. అది కాదు."

"అదంతా తర్వాతగానీ, ముందు ఈ రోజు సినిమాకి వెళ్ళిరండి మీరిద్దరూ"

"ఆ సినిమాలకు ఏం మొహం వాచామా?" శ్రీమంత్ నిర్లిప్తంగా అన్నాడు.
"పోనీ మీరిద్దరూ వెళ్ళిరండి."

"ఖర్మ, తల కొట్టుకుంది శారద. మీరిద్దరూ వెళ్ళండి హాయిగా."

వకుళ కలుగ జేసుకున్నది.

"పోనీ ముగ్గురం వెళదాం శారదా"

"నే నెందుకూ మధ్యన?"

"నీవు లేనప్పుడు ఇద్దరమేగా? ఇప్పుడు సర్దాగా ముగ్గురం వెళదాం పద."

నిజానికి ముగ్గురూ చిత్రం చూడలేదు.

ఎవరి ఆలోచనలు వారివి.

అతి గంభీరంగా, అసలు మాట్లాడక కూర్చున్న శ్రీమంత్ అటు శారదకూ, అటు వకుళకూ కూడ సమస్యగా కన్పడ్డాడు.

(సశేషం)



ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధి



ముఖ్యమంత్రి శ్రీ టి అంజయ్య

# సమైక్యత-సంఘీభావం-నేటి తక్షణావశ్యకతలు

మన దేశం వివిధ మతాలు, జాతులు, భాషలకు పుట్టినిల్లు ఈ వైవిధ్యం, సొగసు మన దేశాన్ని రంగుల పుష్పగుచ్ఛంగా తీర్చి దిద్దాయి ఈ గుచ్ఛంలోని ప్రతి పుష్పాన్ని సంరక్షించుకోవలసిన బాధ్యత మనందరిపైనా వుంది

అశోకుడు, అక్బరు, నానక్, గాంధీ, నెహ్రూ వంటి మహా పురుషులకు జన్మ నిచ్చిన మనదేశం అభివృద్ధి పథంలో పయనిస్తోంది హింసాత్మక చర్యలకు పూనుకుని జాతి ప్రగతికి మనం అవరోధం కల్పించడం తగదు

మతం, భాష, ప్రాంతీయ తత్వాల పేరుతో జరిగే హింసాత్మక సంఘటనలు మన ఆర్థిక వినాశనానికి దారితీస్తాయి

మన ఆంధ్రప్రదేశ్ ఆదర్శప్రాయమైన మత సామరస్యానికి, ఐక్యతకూ దేశమంతటా పేరుపొందింది

- ❋ ప్రతి మతాన్ని, ప్రార్థనా స్థలాన్ని గౌరవిద్దాము
- ❋ అన్ని పండుగలు కలిసి జరుపుకుందాం
- ❋ సాంఘిక సమానత్వం, అభివృద్ధికోసం చేయి, చేయి కలిపి పనిచేద్దాం
- ❋ స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం, లౌకిక విధానాల రక్షణకు ప్రతిజ్ఞ చేద్దాం
- ❋ సహోదరుల్లా కలిసి మెలిసి బ్రతుకుదాం

డైరెక్టరు, సమాచార, పౌరసంబంధ శాఖ, హైదరాబాదు.

సెం 82




……… … ……… . !

నమస్కారం

…… … . ?

అవునండీ – మొదట్లో నాట్యాన్ని భరత నాట్య మనే అనేవారు మృదంగ వాయిద్యంలో 'కొనగోలు' అనే త, ధి, గి, ణ, తోం మొదలైన శబ్దాలు 'భరతం' వల్ల పుట్టినవి – 'భరతం' అంటే దెబ్బ అని అర్థం కదా. అలాటి శబ్దాలకి అనుగుణంగా నర్తకులు తమ కాళ్ళతో పలికించడమే 'నృత్తము'—సింపుల్‌గా చెప్పాలంటే—సంగీతంలో స, రి, గ, మ, ప, ద, ని — డాన్స్‌లో త, ధి, తోం; తక, తరకిట, నక, తోం, మొదలైనవి …

…. … …. . ?

యెస్….నాట్యకళని ఇలా చెప్పవచ్చు . నృత్యం, నృత్తం, లాస్యం, తాండవం అని. శివ పార్వతులలో శివుడు చేసే నాట్యాన్ని 'తాండవం' అనీ, పార్వతిచేసే నాట్యాన్ని 'లాస్యం' అనీ అంటారు

……………. ?

భరతముని నాట్యాను సారం ఏర్పడిందే కూచిపూడి నాట్యం.—

దీన్నిఏదో ఫోక్ డాన్స్ అని తీసి వెయ్యకూడదు. అసలు ఈ డాన్స్ 'కూచపూండి' అనే పల్లెలో పుట్టింది—ఆంధ్రనాట్యానికే అది ముఖ్యపట్నం… భరతుని నాట్యశాస్త్ర ప్రకారం పాద కదలికలూ, ముద్రాభినయం దాదాపు ఒకేలా వుంటుంది కూచిపూడి డాన్స్‌లో-నాట్య విధానంలో కొద్ది తేడాలుంటాయి. దేవదాసి సాంప్రదాయంనుంచీ

# కూచిపూడి నాట్యం

భరతనాట్యం 'సోలో' రూపంలోనే వుంది. కూచిపూడి, నాట్య నాటకమేళ సంప్రదాయం నుంచీ వచ్చింది. ఈ డాన్స్‌లో పాటకితగ్గ అభినయంతో వెనకవుండే కథ కూడా ప్రదర్శిస్తారు. అప్పట్లో భాగవతమేళ నాటకాలు వుండేవి—రామ నాటకం, ప్రహ్లాద, శ్రీకృష్ణలీలలు మొదలయిన కథలని నాట్యపరంగా చేసి జనరంజకంగా చూపించారు. అలా జయదేవుడి అష్టపదులు, నారాయణ తీర్థులవారి 'తరంగాలు' క్షేత్రయ్య 'పదాలు'



మొదలయినవి ప్రదర్శించేవారు —ఐతే భాగవత మేళాన్ని డాన్స్‌డ్రామా మాత్రమే అనీ, శాస్త్రసమ్మతం కాదనీ దుమారం లేవదీశారు కొందరు ఇదివరలో.

(కుమారి శోభానాయుడుగారితో సంభాషణ)

................?



ఈ 'సోలో' ఐటమ్స్ — అలరిపు, జతి స్వరం, శబ్దం, పదవర్ణం, జరిగె కొంగు, తిల్లానా, కొరతి విడివిడిగా రెండు మూడు గంటలు ప్రదర్శననిచ్చేవారు వెరైటీగా.... కూచిపూడివారిది కచేరీ పద్ధతికాక, నృత్య నాటిక పద్ధతిలో వుండేది. ఇదివరలో నృత్యనాటికల్లో ఓ పాత్ర ధారుడు అన్నిఅభినయించేవాడు దశావతారాలు, రామపట్టాభిషేకం, తరంగం, అష్టపదీచేస్తాడు-దీన్నే 'అసెక్కానిజం' అంటాం చూడండి.



..... . .........?

యెస్... శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రిగారు 'కచేరీ బాణీ'ల్లా తయారుచేశారు. ..ప్రార్థన శ్లోకం, పూజానృత్యం, స్వర జతి, క్షేత్రయ్య పదం, దశావతారశబ్దం, రామపట్టాభిషేక శబ్దం, త్యాగరాయ కృతి. తుంగత్తి పండితుల గోపికా గీతం, తరంగం, మండూక శబ్దం, అష్టపది, తిల్లానా....ఇలా వరసగా చేయించే పద్ధతి పెట్టేరు ...వారి శిష్యులు శ్రీ వెంపటి చినసత్యంగారు కూచిపూడి నాట్యాన్ని సకారంజకత్వంచేసి సిద్ధేంద్రుని వారసుల మనిపించు కున్నారు.

....... ....... ?

సంకేతాలు—సింబల్స్‌కి ముద్రలు, హస్త అభినయాలు చాలా వున్నాయి. ఉదాహరణకి—ఆనందం, సత్యం, సుందరం మొదలయినవి చూపడానికి 'అసంయుక్త, సంయుక్త' హస్తాభినయాలతో చెబుతారు నాట్యంలో. పౌర్ణమి వరకు వచ్చే చంద్రదశలలో 8వ దశనుంచీ పౌర్ణమి చంద్రుణ్ణి అభినయించడానికి సంకేతంగా 'అర్ధచంద్ర' హస్తంనుంచీ 'అలపద్మ' హస్తంగా తిప్పడంతో ఆ సజెషన్ వస్తుంది. ఇలా చాలా వున్నాయి.

... ... ... . ?

సాంప్రదాయం చెడకండా ఎన్ని ప్రయోగాలైనా చెయ్యవచ్చు—తప్పులేదు. శ్రీ వెంపటి చినసత్యంగారు అలాటి ప్రయోగాలు చేయించారు—శ్రీకృష్ణ పారిజాతం, శ్రీనివాస కల్యాణం, శాకుంతలం, క్షీరసాగరమథనం, చండాలిక మొదలయినవి చేశాం. వాటికెంతో ప్రజాదరణ లభించింది.

................ ...?

యెస్....మొదట రాజమండ్రిలో శ్రీ పి. ఎల్. రెడ్డిగారి దగ్గర నేర్చుకున్నాను. డాన్స్—స్కూల్ పైనల్ అయ్యాకా మద్రాస్‌లో శ్రీవెంపటి చినసత్యంగారి దగ్గర 14 సంవత్సరాలు నేర్చుకున్నాను.

.. . .... ........?

అవునండి ...విదేశాలు వెళ్ళాను ...1500 ప్రదర్శనలిచ్చాను. సిక్కిం, గయానా, సురినామ్, ట్రినిడాడ్, వెనిజులా, మెక్సికో, క్యూబా, టునీషియా, బ్రిటన్, సిరియా, ఇరాక్, టర్కీ, మలేషియా, సింగపూర్ ప్రపంచ తెలుగు సభలకి వెళ్ళాను.

?

అవును—విదేశాల్లో ప్రోగ్రాం ఇచ్చేటప్పుడు ఇక్కడలా ఇవ్వకూడదు—ప్రతి ఐటమ్‌నీ వివరించి చెప్పాలి—అభినయం, ముద్రలు, వాటి అర్థం, నృత్య సాంప్రదాయం, చరిత్రా అంతా చెప్పాలి – వారి అభిమానం, ఆదరణ, ప్రోత్సాహం, ఆసక్తి నన్ను ఆనందపరిచాయి

?

అవునండి 1980 జూన్‌లో ఇక్కడ హైద్రాబాద్‌లో 'కూచిపూడి ఆర్ట్ అకాడమీ'' ప్రారంభించాను—ప్రస్తుతం 80 మంది విద్యార్థులున్నారు



. . . . ?

అలాగే చెబుతాను మేం విదేశాలు వెళ్ళినప్పుడు "బాలేస్" చూశాం వాళ్ళలో మంచి కండిషన్ కనిపించింది, వందమంది ఒకేసారి స్టేజీమీద కనిపించినా 'ఒక్కరే' చేస్తున్నారా అన్న భ్రమ కలుగుతుంది

?

నిజమే—భరతనాట్యం గురించి ప్రచారం బాగా జరిగింది-అన్ని హంగులూ వున్న కూచిపూడి నాట్యం ఇంకా ప్రచారంలోకి రావలసి వుంది అభిరుచివున్న ప్రతివారూ ముందుకొచ్చి ఈ నాట్యాన్ని అభ్యసించి ప్రచారం చెయ్యాలి—అందుకు తల్లిదండ్రులు ప్రోత్సహించాలి—ప్రభుత్వం సహకరించాలి మరి

# పరంపర

మూలం: బెర్ట్రాండ్ రసెల్ · తెలుగు ఎమ్. పార్థసారథి

భర్తతో కలిసి అంటార్కిటిక్ ప్రాంతంలో పరిశోధనల కోసం వెళ్ళిన మిసెస్ డెబోరా ఆస్గార్డ్ స్నానం చేసి గుహలో నిల్చున్నప్పుడు ఓ భయంకరమైన శబ్దం వినిపించింది. ఆవెంటనే తాము వచ్చిన పడవ మాయమై పోయింది. పరిసరాలన్నీ శూన్యంగా మారిపోయాయి. వెంటవచ్చిన యితర పరిశోధకులంతా మరణించారు. తనున్న గుహ గోడలకు సీసంతోపూతపూసి వుండడంవల్లనే తనింకా బ్రతికివున్నట్టు తెలుసుకొంది. రోజులు తరబడి వెదికింది. కాని ఎక్కడా మనిషిజాడ లేదు. తను తప్ప మానవ జాతంతా ధ్వంసమై పోయిందని గ్రహించింది.

అతిసనాతనమైన కుటుంబంలోపుట్టి, అతి కఠినమైన శిక్షణయిచ్చే స్కూళ్ళలో చదువుకున్న తను యిప్పుడు మానవ నీతి సూత్రాలేవీ అక్కర్లేని పరిస్థితిలో వుంది. తను గర్భవతి, క్షేమంగా శిశు జననమయ్యేట్టు చూడటం తన బాధ్యత కాని ఆ తర్వాత? పుట్టబోయే బిడ్డ ఆడపిల్లయితే మానవజాతి యింక ఎక్కువ రోజులు మనదు. కాని మగపిల్లవాడయితే? ఆ తర్వాతి పరిణామం వెంటనే వూహించ దలచుకోక నీళ్ళాడిందాకా దాన్ని గురించి ఆలోచించటం వాయిదా వేసుకుంది. నెలలు నిండేక మగపిల్లవాడే పుట్టాడు. ఆడం (Adam)కు పుట్టిన కొడుకులూ, కూతుళ్ళూ ఏం చేసి వుంటారో ఆలోచించింది. ఏది ఏమైనా మానవజాతి పరంపరను కొనసాగించటం తన పవిత్ర కర్తవ్య మనుకుంది. యుక్త వయస్సు వచ్చేదాకా కొడుకును మంచి శిక్షణలో, విధినిర్వహణ దీక్షతో పెంచింది.

కాని యిది కొత్తరకం విధి నిర్వహణ. తాను వృద్ధురాలయ్యేలోగా మరో మానవ బీజం ఈ భూమ్మీద పడాలి. కొడుకు, తల్లి వాదన నంగీకరించి, కొంత బాధాకరమైనా తనవిధి నిర్వర్తించాడు. అతడికి జంతువుల సాంగత్యంలో వున్న ఆనందం తల్లిని చూస్తే ఎప్పుడూ లేదు. ఆమె అంటేనే అసహ్యం. గర్భం ధరించిన తర్వాత ఆమెలో మళ్ళీ సందిగ్ధత ప్రవేశించింది తనింక మళ్ళీ కనలేదు. వయసు దాటిపోయింది. ఇదే చివరిసారి. ఈసారి సంతానం గనక మగపిల్లవాడైతే తన త్యాగమంతా వృథా ఐపోతుంది. కాని అదృష్టవశాత్తూ కవలలు—ఆడా, మగా—పుట్టారు. ఇంక మానవ పరంపరను అభివృద్ధిచేసే బాధ్యత వీళ్ళమీద వుంది అనుకుందావిడ.

అయిష్టంగా తన బాధ్యత నిర్వర్తించిన కొడుకు అడవిలో జంతువులతో క్రీడించ సాగాడు. కాని తల్లి కోరిక మీద ఏడాదికోసారి వచ్చి అంతా సవ్యంగానే వుందేమో చూసి వెడుతుండేవాడు. ఎందుకంటే ఒకవేళ పుట్టిన మగపిల్లాడు గనుక మరణిస్తే బాధ్యత మళ్ళీ తన మీద పడుతుంది.

కవలలిద్దరూ యుక్త వయస్కులైన సమయంలో — ఓనాడు, హటాత్తుగా ఎదుటవచ్చి నిల్చిన కొత్తవ్యక్తిని చూసి ఆశ్చర్యపడింది డెబోరా.

"ఏమిటి? ఎలావున్నావు? బావున్నావా?" అంటూ పలకరించుకున్నారిద్దరూ. తమ పేర్లూ, యింటి పేర్లూ చెప్పకున్నారు. ఇద్దరూ బంధువులేననీ, ఆమె తన పెత్తల్లి

తల్లి అనీ తెలుసుకున్నాడతడు.

యాభై ఏళ్ళక్రితం ఒక అణ్వాస్త్ర ప్రమాదంవల్ల వుత్తర దక్షిణ అమెరికా ప్రాంతమంతా మరుభూమిగా మారి



నప్పుడు, ఆమె అక్కడ తప్పిపోయింది. అణుధార్మికశక్తి తీవ్రత తగ్గిన తర్వాత ఈ ప్రాంతానికి వచ్చిన తొలి మానవుడు తనే. ఐతే అతడికి తన పెత్తల్లి అలవాట్లు వింతగా కనిపించాయి. యాభై ఏళ్ళు ఒంటరిగా గడపటంవల్ల ఆమె కొన్ని పనులు చాటుగా చెయ్యాల్సి వుంటుందన్న విషయమే మరచిపోయింది. కవేలల్ని చూసి వాళ్ళ జన్మవృత్తాంత మడిగాడు.

ఆ రహస్యమేదో ఆమె చెప్పగా విని, జుగుప్సతో మొహం చిట్లించాడు. ఏది ఏమైనా మళ్ళీ ఆమెను తమ వూరికి, బోస్టన్‌కు, వచ్చెయ్యమని కోరాడు. ఆమె మొదట నిరాకరించింది. అతడు తిరిగి వెళ్ళి ఆ వార్త వూళ్ళో చెప్పగా, అక్కడి ప్రకృతి ధర్మాచరణ మహిళామండలి సభ్యురాండ్రైన సంపన్న గృహిణులు ఆమె వింత అనుభవాలను తమ క్లబ్బులో మాట్లాడించాలనుకున్నారు. చివరికి ఆమె మనవణ్ణే, ప్రముఖ ఆంత్రోపాలజిస్టులయిన మిస్ పెగ్గీ ఫీల్డ్ గాల్ని ఆమెను బ్రతిమాలి, మభ్యపెట్టి తీసుకురమ్మని పంపారు ఆంత్రోపాలజిస్టు డెబోరాకు ఏవో కబుర్లు చెప్పింది. పాత

దృశ్యాలు, సంఘటనలు జ్ఞాపకం చేసింది. ఎందరు సంపన్న మహిళలు ఆమె అనుభవాలు వినటం కోసం కాచుకూర్చున్నారో చెప్పింది యాభై ఏళ్ళక్రితం ముసలాళ్ళు తొడుక్కునే గుడ్డలు తొడిగింది. అవి తొడుక్కున్న డెబోరాకు తన బంధువులూ, పూర్వీకులూ జ్ఞాపకం వచ్చారు

డెబోరా ఆగమనం, అప్పోళ్ళ, ముఖ్యంగా ఆక్లబ్బు చరిత్రలో అతి ముఖ్యమైన రోజు. స్టేజీ ఎక్కి మాట్లాడబోతూ డెబోరా, భయంతో ప్రకృతి కార్యాల్ని కొన్నింటిని అక్కడే నిర్వర్తించింది. అసహ్యంతో సభాధ్యక్షురాలు మూర్ఛపోయింది అనాగరికమైన ఆమె అలవాట్లూ, తన సంతానంతోనే తను పెట్టుకున్న ఆమె లైంగిక సంబంధాలూ వాళ్ళకు భరింపలేనివిగా తయారైనాయి. ఈమెను మాట్లాడించడం కన్నా, ఆ ఆంత్రోపాలజిస్టు ఈమెను తనింట్లోనే పెట్టుకుని పరిశోధనలు చెయ్యటం మంచిదని నిర్ణయించారు

కానీ ఆమె యాభై ఏళ్ళ జీవనసరళి మారలేదు. కొత్తపరిస్థితులకు అలవాటు పడలేక అతి దయనీయంగా మరణించింది డెబోరా.

ఆమె కొడుకు మళ్ళీ అరణ్యాల్లోకి పారిపోయాడు. మానవజాతిని వృద్ధి చేసే పవిత్ర విధి నిర్వహణ దీక్షలో పెరిగిన కవల కిద్దర్నీ సభ్య జీవనానికి శత్రువులుగా నిర్ణయించి చంపేశారు.

# "మీ మేధస్సుకో పరీక్ష"

## మల్లాది వెంకట కృష్ణమూర్తి

మీలోని ఏకాగ్రతని, ప్రతీ చిన్న విష యాన్ని తేలికగా గుర్తించగలిగే గుణాన్ని, మేధస్సును తనిఖీ చేసుకోడానికి చిన్న పరీక్ష ఈకింద పొందుపరచబడింది. ప్రయత్నించండి.

ప్రతీ సమస్యకీ పరిష్కారం ఆ సమస్య లోనే ఇవ్వబడింది. జాగ్రత్తగా చూస్తే తెలుస్తుంది. ప్రతీదాంట్లో ఆఖరి సంఖ్య లేక అక్షరాలు లేవు. వాటిని పూర్తిచేయాలి మీరు, ఇచ్చినవాటి సహాయంతో.

ఉదాహరణకి ఈ కింది అంకెల్లో ఆఖరి అంకె ఏమయి వుంటుంది?

3—4—6—9—?

సమాధానం 13.

ఎలా అనుకుంటున్నారా?

మొదటి అంకెకి 1 (3+1) రెండో అంకెకి 2 (4+2) మూడో అంకెకి 3 (6+3) కలుపుకుంటూ వెళ్ళాలి. నాలుగో అంకెకి 4 (9+4) కలిపితే 13 వస్తుంది.

ఇక మీ వంతు. కింది సమస్యలకి సమాధానాలు రాయడానికి సగటు మేధస్సు గల మనిషికి 15 నిముషాలు చాలు.

సగటు మేధస్సుకి మీ తెలివితేటలు ఎక్కువా? తక్కువా?-తెలుస్తుందిగా మీకే. కలం అందుకోండి.

సమస్య 1 · 1—3—6—10—?
సమస్య 2. 2—2—4—6—?
సమస్య 3 21—20—18—15
సమస్య 4: 8—6—17—[illegible]—6—
సమస్య 5: 40—35—34—29—28—23—?
సమస్య 6: 347—354—352—359—357—?
సమస్య 7: A—D—H—M—?
సమస్య 8: Az—By—Cx—Dw—?
సమస్య 9 · A—D—G—J—?
సమస్య 10 · 38—76—46—92—52—104—?

ప్రతి సరయిన సమాధానానికి 1 మార్కు వేసుకోండి. 15 నిముషాల్లోకాని లేదా ఇంకా తక్కువ సమయంలో పూర్తిచేయ గలిగితే మరో 5 మార్కులు కలుపుకోండి.

1. 10 నుంచి 15 మార్కులు వస్తే-కంప్యూటర్ బ్రెయిన్ కలవాళ్ళు మీరు.
2. 6 నుంచి 9 మార్కులు-ఫర్వాలేదు.
3. 6 కి తక్కువ - బాధపడకండి. రచయితలు, రాజకీయవేత్తలు, నటులు, వ్యాపారస్థులు, కళాకారులు మొదలయిన ప్రసిద్ధులందరికీ ఆరుకి తక్కువే మార్కులు వస్తాయి!

సమాధానాలు

(1) 15 (2) 10 (3) 6 (4) 5 (5) 22 (6) 374 (7) 5 (8) EV (9) M (10) 54

# రక్త చందనం

## కె కె మీనన్

ఆకలి గాండ్రుమంది.

అర్ధరాత్రి అడవి దద్దరిల్లింది.

కొండల్లో, కోనల్లో - ఆకలి కేక ప్రతి ధ్వనించింది.

ఆ శబ్దానికి అర్థం తెల్సిన క్షుద్రజంతువు లన్నీ కకావికలై ప్రాణభయంతో అటూ యిటూ పరుగెత్తి తుప్పల్లో తొర్రల్లో దాక్కొంటున్నాయి.

అలజడి.... ఆరాటం....

మళ్ళీ అదే అరుపు.

ఆ ఆకలి అరుపులోకూడా ఎంతో గంభీరత.

క్షుద్ర జంతువుకు ఆకలైనప్పుడు దీనంగా కేక పెడుతుంది. పెద్ద జంతువుకు ఆకలైతే, గంభీరంగా అరుస్తుంది.

అవును మరి! ఎవరో ఒక మహానాయకుడు—

'ఒకే పదివేలుంటే ఇలా పడేయ్' అనే వాడుట. అవసరానికే!

'అయ్యా ఒక పైసా.... అమ్మా ఒక పైసా....' ఈ నినాదం ప్రతిచోటా.. ప్రతి పూటా నిరంతరం మనకు వినిపించేదే. అదీ అవసరానికే!!

అయితే, ఎంత వ్యత్యాసం!!

అదే వ్యత్యాసం—

గాండ్రుమంది ఆకలి.

అడవి గుప్పెట్లో గుడెం........ గుడెం గుండెల్లోని గుడిసెలు........ గుడిసెల్లోని గుడెం—

గుబగుబలాడేయి.

o o o o

గూడెంకు దూరంగా.. .పర్వత పాదాల చెంతన, పంటపొలం గట్టుమీద, చెట్టుకింద . రెండు ప్రాణులు యీ అలజడికీ, ఆందోళనకీ అతీతంగా; నిద్రలోనే మెలకువతో, మేలుకునే కునుకుతో కూర్చొని వున్నాయి.

ఆకలి గాండ్రుమంది చేరువలో...

"అమ్మో పులి ......." అంది సుక్కు— అందులో ఒక ప్రాణి.

"ఏ పులి?...." అనడిగేడు ఇల్లంగు— రెండో ప్రాణి.

—కలవరింతా లేక కలలో మాటా యిది, అనుకుంది సుక్కు.

"ఏ పులేంటి?" అనడిగింది.

"అంటే— అడివిపులా, పట్నం పులా అని"

"ఇంకా అడి దేసలోనే వున్నావన్న మాట"

"కానే.... ఆడూ పులేమరి. పట్నం పులి. ఈ పులి అసలు అరవదు. కరవను కూడా కరవదు. అరవకుండానే పేనం తీసేద్ది. ఎన్ని పేనాలుతీసినా, ఎన్నిగుండెల నెత్తురు తాగినా ఆకలి తీరదు, మరి అడివి పులి అలాగ్గాదు. ఆకలి దీరేక మరింక సంపదు."

గాండ్రుమంది పులి.

"అదుగో .... పులే...." ఇల్లంగును గట్టిగా పెనవేసుకుంది సుక్కి....

"తూత్.... నువ్వు అడవిలో పుట్టలేదేంటే.... ఎప్పడూ పులికేక యినందానికి మల్లే ఈకె ఇదైపోతావు! ఆకలైతే అదే దుత్తాంటే మద్దిన నీకెందుకే బయం?"

గుండెలమీది సుక్కి చిక్కుతలని ఆప్యాయంగా నిమిరేడు, ఇల్లంగు.

—ఏవిటీతని మాటలు! అడవిలో పుడితే మట్టుకు, జంతువుకు భయపడకూడదా?

అతని కళ్ళల్లోని భావాన్ని చదువుకోడానికి తలెత్తి పైకి చూసింది సుక్కి. ఆ చీకట్లో అతన్ని ముఖం సరిగ్గా కన్పించలేదు, మళ్ళీ అతని గుండెలమీదికి చెంప అన్చి—

"ఇయమెందుకా? అది మీదపడి సంపితే తెల్సుద్ది" అంది.

"మన మీదెందుకు పడది? మనమేం జేసాం?"

"సుండేలుకు ఏంజేశామేంటి?"

"అడు మడిసే .... ఇది మురగం. మురగాన్ని ఏమన్నా జేత్తే బయమేసి పేనం కోసం మీదబడి పోరాడిద్ది. మరి మడిసి అలాగేంటి.... ఏం జేయకపోతే నీరసపోడని మీదపడి పీక్కుతింటాడు"

—ప్రతి ప్రాణీ జీవించటానికి ఆహారం అవసరం. ఆ అవసరానికి కొండగురుతే ఆకలి. ఆ ఆకలి తీర్చుకోటానికి పెద్ద జంతువు చిన్న జంతువునూ, ఆ చిన్న జంతువు మరింత చిన్నజంతువునూ చంపుకు తినటం ఆటవిక న్యాయం. ఇది అడివిలో బతికే జంతువైనా, నాగరిక సమాజంలోని మనిషైనా ప్రస్తుతం ఒకటే....

"ఇన్నిసయాలు నీ కెలాగ తెల్సాయి మావా...." ఆశ్చర్యంగా అడిగింది సుక్కి.

"నాకు దెల్దమేంటి? అన్నలు సెప్తే యిన్నాను"

"అన్నలు మన బూమి గురించి యేం జెప్పరా?" ఆసక్తిగా అడిగింది.

"యెందుకు సెప్పరు? సెప్తానే వున్నారు.. సూత్తావుగా ఏం జరుగుద్దో. సుండేలుగాడికోసవే యీ పంట కాత్తన్నా ననుకున్నవేంటి?...."

చుండేలు మాట వినగానే భయంతో సుక్కి మరింత హత్తుకు పోయింది.

పైరుగాలి చల్లగా, తల్లిలా ఒళ్ళు నిమిరింది. పండిన పోటు పైరు పైరుగాలికి తలవూపింది.

తన గుండెల్లో దాక్కున్న సుక్కి ఎంతో, కొండల పక్క పరుచుకున్న పొలమూ అంతే ఇల్లంగుకు. ఇప్పుడు ఆ పొలం తనదికాదని గుడెం పెద్ద తీర్పిచ్చినా అది తనదే. తన శరీరాన్ని అంటుకుని వున్న చేతులూ కాళ్ళూ తనవి కావంటే?

భూమిమీది మమకారం అంత తేలిగ్గా ఒదులుకునేది కాదు. కష్టపడి కండలు కరిగించి చెమటతో తడిపి పండించిన పొలం. దాన్ని కాపాడుకోవటం తనవిధి.

"ఓరి యిల్లంగో.... యీ పోడింక నీదిగాదురా........ నీ ఆయ్యిచ్చుకున్న రొండొందల అప్పుకూ అది సుండేలు సవ్రాజు కయిపోయింది. ఇంకా ఒడ్డీ బాకీయే. ఇంకేముంది నీ దగ్గిర యిచ్చుకోటానికి? గనక పంది పట్రా పడకుండ పంటనిగాసి బ్రెంగా సవ్రాజు చావు 'వొప్పగించు'" అని ఆజ్ఞ వేసేడు ఎతిమాని (గుడెం పెద్ద)

అవును. అది మంచయినా చెడయినా ఆటవికుల కట్టుబాటు చట్టంకంటె పటిష్టమైంది. డబ్బున్న పట్నంవాడి చేతులూ బలమైనవే. ఈ రెంటి మధ్యా నలిగిపోతున్నవి కొండ జాతులు.

పండక్కో పబ్బానికో పదిరూపాయిలు అప్పు పుచ్చుకుని, అది పదింతలుగా పెరిగితే తీర్చుకోలేక కన్నబిడ్డలా పెంచుకున్న పొలాన్నో లేక కన్నబిడ్డనో చుండేలు (షావుకారు)కు సమర్పించుకునే అసమర్థత ఆనవాయితీగా చెల్లుబాటయి పోతో వుంటే....ఆ న్యాయానికి పెళ్ళాలు మాత్రం మినహాయింపేవిటి ?



అందుకే భయంతో ఒణికిపోయింది
సుక్క.

పెంచుకున్న బిడ్డకన్నా....ఎంచుకున్న

భార్యకన్నా మిన్నగా మమకారాన్ని
పెంచుకున్న భూమి దూరమైపోతోన్నా
మిన్నకుండే ఆ జాతికి ప్రతినిధిగా భర్తని

వూహించుకుంటోంది సుక్కి.

o o o

ఇల్లంగు తండ్రి మంగడికి అడివి సంపదని సేకరించే అలవాటు వున్నా, భూమిపైనే అతనికి మక్కువ యెక్కువ.

పాతికేళ్ళుగా శ్రమపడి, కొండకొట్టి, అడివి నరికి పోటుని పంటకి లాయకీ చేసుకున్నాడు మంగడు. భూమిపైన అతనికి ఎంత మక్కువో అంతకన్నా ఎక్కువది అతని చుట్ట వ్యసనం.

"ఒకప్పుడు ఈచుట్టలు, సిగరెట్లు అంటే ఏవిటో మీకెరుగుదురా ? ఎరగరు. ఈ నాగరికపు దురలవాట్లు మీకు తెలేనే తెలీవు. మరిప్పుడో... మీరందరూ వీటికి బానిసలే. ఎందుకని మీరంతా కావాలనే వీటిని అలవర్చుకున్నారా ? ఉహు.. వీటితో మిమ్మల్ని బలహీనుల్ని చేసి మీ సంపదని దోచుకోడానికే మైదాల్నుంచి ఒచ్చిన సావుకార్లు మీకీ అలవాట్లను మప్పి పీల్చి పిప్పిచేస్తున్నారు .." అని అన్నలు చెప్పగా విన్నాడు ఇల్లంగు.

"మా అయ్య ఒట్టి సుట్ట పొగాక్కే సుండేలుకు అమ్ముడుబోయినట్టు ఎరికనా....నన్నూ నిన్నుగూడ అమ్మేసి ఆడు సల్లగ రెల్లిపోనాడు" అన్నాడు బాధగా.

"... అప్పుడు యీ సవర్రాజుగాడెలా గుండేవోడు అడుక్కుసివోళ్ళా గుండేవోడు. నెత్తిమీద గంపెట్టుకుని ఉప్పు, బెల్లం, పొగాకు, సిగరెట్లు ఎత్తుగొచ్చి గుడెం వోల్లకిచ్చి: కందులూ, పెసలూ, తేనె, సింతపండూ, కుంకుడు కాయలూ— ఒక్కటేంటి తట్టతోటే పట్టుకొచ్చి కావిడితోటి మోసుకు పోయీవోడు. ఆడిచ్చి సుట్టకోసం మాఅయ్య వోరం రోజులు అడివంతా గాలించి పెద్ద ఆనపకాయ బుర్రనిండా తేని తీసి ఉంచేవోడు. ఒకోపాలి ఒక్క సుట్టముక్క కోసం ఓ కుంచుడు కుంకుడుకాయలు కొలిచేవోడు." అని వాపోయేడు ఇల్లంగు.

"ఆ కుంకుడు సెట్లు యింకా ఆడికిందే వున్నయిగా" అంది సుక్కి,

"ఆ... ఒకేడు ఏమయిందంటే, మంచు బాగ్గురిసి కుంకుడు పూతంతా మాడి పోయింది. గిద్దెడు కాయలుగూడ రాల్లేదు. మీఅయ్య పొగాకు అడకమేవో పదేను రూపాయిలకు మించిపోయింది. తీర్సేదెట్టా? అందుకని మీ అయ్యేంజేసాడంటే. అప్పు తీరేదాకా రెండు కుంకుడు చెట్లు కాయలూ కోసుకొమ్మన్నాటు. ఆ అప్పు తీరనూ లేదు, ఆసెట్లు మనకు రానూ లేదు...."

"హూ...." నిట్టూర్చింది సుక్కి.

"........ఉన్నట్టుండి మా అయ్యెల్లి పోయ్యాడు. ఆడెల్లిన మర్నాడే మీ అయ్యుచ్చుకున్న రొండొందలూ యిత్తావా సత్తావా అని నెత్తిమీద గూకున్నాడు సవర్రాజు. అదేంటో నాకు తెలవనే తెలవదు పొమ్మన్నాను. ఎకిమీనికి సెప్పి పంచాయితి లెట్టించాడు. అందరూ ఆడి మాటే అవునన్నారు"

"అర్నేంటి మరి! అనకపోతే అల్లికి అప్పుబుట్టేదెట్టా"

"అద్గదే మరి! అలాగ ఆ రొండొందల బద్ద వప్పుకిందా యీ రొండెకరాల పొలవూ సెల్లిపొయిదంన్నారు. పైపెచ్చు ఒడ్డికింద పెతియేడూ పంటకి కావలా గాయాలంట...."

చేను మధ్యలో ఏదో కదిలినట్టు అలికిడైంది.

"అడివి పందడ్డట్టు గుందే సుక్కూ...." అని లేచేడు ఇల్లంగు.

గొడ్డలి చేతపుచ్చుకుని చేనుకు అడ్డం వడ్డాడు.

కొంత దూరం వెళ్ళేక

"అమ్మో... పులే సుక్కూ...." అని అరిచేడు.

గొడ్డలి తీసుకు తనూ పరుగెట్టింది.

ఇల్లంగును చూడగనే ఎగిరి మీద పడింది బెబ్బులి. గండ్ర గొడ్డలి విసిరి కొట్టేడు.

ఆ ఖైదీని వారం రోజులు పస్తుపెట్టి
మన సింహానికి ఆహారంగా
వేసాం ప్రభూ!!





BS Raju

పులి డొక్కలో ఎడం కాలికి దగ్గరగా తగిలింది. గాయపడ్డ పులి కసి కొద్దీ పంజా ఎత్తి నెత్తిమీద కొట్టింది. మెడ వాలేసుకుని పెనుగులాడుతున్నాడు ఇల్లంగు. వీలు చూసి పులి నెత్తిమీద వేసింది సుక్కు. పులి పక్కకు ఒరిగిపోయింది.

ఇల్లంగు తల పగిలిపోయింది. కళ్ళు రెండు గుడ్లూ వూడి వేళ్ళాడుతున్నాయి.

"అమ్మో...." అని గట్టిగా అరిచి గుడెంవైపు పరుగెత్తింది సుక్కు.

"అమ్మో.... అయ్యో.... ఇల్లంగుని పులి సంపేసింది...."

అందరూ గుడిసెల్లోంచి బైటకొచ్చేరు.

గుడెం గూడెం అంతా తరలి ఇల్లంగు దగ్గరికి పోయింది. కాని........ అప్పటికే వాడు వాళ్ళకు కాకుండా పోయేడు.

o • • o

రాత్రంతా గుడెం పంచాయితీ చేసింది.

అంతకు ముందే అన్నలు సుక్కును తర్ఫీదు చేసేరు.

"నా భూమిని నాకప్పగించెయ్యండి" అని పట్టు బట్టేడు సవర్రాజు.

"బూవీ గీవీ తరవాత. నా మావను మింగావు. ముందు దానికి ఏం సెప్తావో సెప్పు...."

"నీ మావను నేను మింగానా?"

"ఆ బూవి కోసవే నా మావ పేనం పెట్టాడు. అది నీ కోసంగాపోతే ఆ బూవి నీ దెందుకవుద్ది" అనడిగింది సుక్కు.

ఆ లాజిక్కు అర్థం కాక.

"ఛ సీ నువూరుకో ..." అని కసిరి సుక్కు మూయించేసేడు ఎతిమాని.

"ఉన్న బూవీ తమరు లాగేసుకుంటే దిక్కూ మొక్కూలేని ఆడకూతురు బతుకేంగాను దొరా"

"ఇల్లంగు బతికుండగనే భూమి సాకు ఖాయం చేసారుగదా! నీకు తెలీదా?" అని గుడెం పెద్దని ప్రశ్నించేడు సవర్రాజు.

"తెలవకేందొరా! గాని, అది మొగ దిక్కు లేందైపోయింది గందా"

"అదే గదా మీ బాధ"

"అంతే.... అంతేదొరా.... "

"అయితే సుక్కును నేనే పెళ్ళాడతాను"

అందరూ నోళ్ళు వెళ్ళ బెట్టుకుని సవర్రాజు వంక చూసేరు.

"బాగు బాగు......." అన్నాయి పది కంఠాలు.

"సవర్రాజు బాబంటే యేటనుకున్న వేటి, బగమంతుడు........" అని మెచ్చుకున్నాడు ఎతిమాని.

సుక్కుమాత్రం దిక్కుమాలిన చూపులు చూస్తో వుండిపోయింది. అది అంగీకారమో అసహాయతో ఒక్కరికీ అర్థమైంది కాదు.

ం ం ం ం

సుక్కు గుడిసెకెళ్ళి మూలగా పడివున్న ఎనుబోతు చర్మం పరుచుకు పడుకుంది. దానిమీద మేను వాలి స్తేచాలు అన్నీ అనుభూతులే. ఇల్లంగు తన పక్కలో వున్నట్టే వుంటుంది. అతని తలపులతో తలమునకలై గాల్లో తేలిపోతుంది.

పక్కన చింతపిక్కల జావ మట్టికుండలో మరిగిపోతోంది. కాని ఆ ధ్యాసే లేదు సుక్కుకు. ఆ చర్మం తన మనసును మనసులో వుంచదు. చచ్చిన ఆ యెనుబోతే ఇల్లంగునునూ తననూ కలిపింది. దాని చర్మం వాళ్ళిద్దర్నీ మేను నిమిరి సేద తీర్చింది. ఇప్పుడు ఒక్కతే........తనొక్కతే....

సరిగ్గా పడాదిక్రితం. కొత్త పండక్కి ముందు-దుంపలు సేకరించటానికి అడవికెళ్ళి వస్తోంది సుక్కు. ఎక్కణ్నించి వూడి పడిందో ఎనుబోతు తనవైపే పరుగెత్తు కొస్తోంది. కాలి సత్తువకొద్దీ పరుగెత్తింది.... పరుగెత్తి పరుగెత్తి పడిపోయింది. అంతే.... మరేం తెలీదు. కళ్ళు తెరిచేప్పటికి తను ఇల్లంగు వొళ్ళోవుంది. పక్కన ఎనుబోతు పడివుంది.

"బయపడ్డావా...." అనడిగేడు ఇల్లంగు తలనిముర్తో.

ఎంత లాలన!

ఆ నిమిరే చేతులు ఎంత బలమైనవి? తనని ఉద్ధరించగల సత్తువ ఆ చేతుల్లోవుంది. తనకి సిగు ముంచుకొచ్చి కళ్ళు మూసుకుని అతని ఛాతిలో దాక్కుంది. అది ఎంత విశాలమైన ఛాతి? అప్పుడే అనుకుంది అది తనకు చెరగని ఆశ్రయం అని. కాని....

సుక్కుకు దుఃఖం ముంచుకొచ్చింది. వెక్కి వెక్కి ఏడ్చింది.

గుడిసె తడిక తెరిచిన చప్పుడైంది. పక్కింటి పిల్ల లోపలి కొచ్చింది.

"అన్నలు రమ్మంటన్నారు" అని చెప్పింది.

అన్నలనగానే ఆమె దుఃఖం అంతా పటాపంచలై ఎనలేని మానసిక బలం చిక్కింది.

ం ం ం

పంచాయితీలో జరిగిన నిర్ణయం గురించి తమ విచారాన్ని వ్యక్తం చేసేరు అన్నలు.

"అది నీమీద వుండే ప్రేమకాదు. నిన్ను వుద్ధరించాలనే తాపత్రయమూ గాదు. మిమ్మల్ని దోచుకోటానికి శత్రువు పన్నే మరో పన్నుగడ-మిమల్ని గుప్పెట్లో పెట్టుకోటానికి మరో ఉచ్చు."

"మీ బలహీనత లేవిటో వాళ్ళకి బాగా తెల్సు. మీతో అప్యాయతగా మాట్లాడిన ప్రతివాడు ఆప్తుడేనని భ్రమిస్తారు. అంచేత మీలో ఆప్తుడుగా మెలిగి మిమ్మల్ని ఆకట్టుకోటానికి మరో ఎత్తు ఈపెళ్ళి. అంతేగాదు. గిరిజనుల ఆస్తుల ఆక్రమణ మీద ఇటీవల ప్రభుత్వం కొన్ని ఆంక్షలు పెట్టింది. గిరిజనేతరు లెవ్వరికీ ఆ భూములు చెల్లవు. అందుకనే యీ పెళ్ళితో ఆ ఆంక్షల్ని దాటేద్దామని సవర్రాజు కుట్ర"

ఈ మాటలతో పంచాయితీ ఒక కుట్రగా అర్థమైంది సుక్కుకు. రాబోయే ప్రమాదాన్ని ఎదుర్కోటానికి ఎత్తుగడలు ప్రారంభమయ్యేయి.

ం ం ం

ఇల్లంగు దెయ్యమై గుడెంలో తిరుగుతున్నట్టు పుకారు పుట్టింది.

సవర్రాజుకు భయం పట్టుకుంది. ఎజ్జోడు (భూతవైద్యు)ని ఆశ్రయించేడు.

"ఒయిసులో పోయినడు గాదామరి. అందులోకి ఆడికి పెల్లమంటె పేనంగా వుండేది· ఆ జీవి ఒదుల్తదామరి-దాన్ని







అంటిపెట్టుకునే వుంటది." అని మరింత భయపెట్టేడు ఎజ్జోడు.

"మరేం చెయ్యాలి"

"సాంతి జెయ్యాలి"

"అదేదో చెయ్యకూడదూ మరి"

"డబ్బు...."

"ఎంత ?...."

"ఎంతోనా....ఒక మేకపోతు, మేకపోతును తెచ్చి కొండదేవతకి బలియ్యాలి...."

"....అదెట్టాగను కుంటవు. అమవాస రాత్రి. కొండదేవత ముందు మేకపోతును పెట్టి తల నువు పట్టుకోవాల....కాళ్ళు నే బట్టుకుంటా. సుక్కా ఒక్కయేటుకు దాని తల నరకెయ్యాల. నరికేసి ఆనెత్తురు ఒంటికి పూసుకుని రేతిరల్లా జాగారం సెయ్యాల...."

o o o

కొత్త పండగనాడు కొండదేవత జాతర జరుగుతోంది.

కొండదేవతని పసుపు కుంకమలతో అలంకరించి ముస్తాబు చేసేరు.

అర్థరాత్రి దగ్గర పడుతోంది.

సుక్కా తలస్నానం చేసి జుట్టు విరబోసుకుంది. ముఖం నిండా పసుపు పూసుకుంది. నుదుట కుంకుమ అద్దుకుని అమ్మవారి అవతారంలా వుంది. చేతిలో పదునైన కత్తి మెరుస్తోవుంటే కాళీ మాతలా ఆమెను కొండదేవత ముందుకు తెచ్చేరు గుడెం స్త్రీలు.

మాటా మంతీలేదు. ఆమె ముఖంలో ఎలాంటి హావభావాలూ లేవు.

కొండ జాతుల ఆచారం ప్రకారం సవర్రాజునూ తయారు చేసి తీసికొచ్చేరు. ఎజ్జోడు శాస్త్రయుక్తంగా మేకపోతును నడిపించుకొచ్చేడు. కాళ్ళుకట్టి కదలకుండా దేవతముందు పడుకోబెట్టేరు!

సవర్రాజు ఒంగి మేక తల పట్టుకున్నాడు సుక్కా వాళ్ళమధ్య కత్తి పట్టుకు నిలబడివుంది.

ఎజ్జోడు ఆకాశంలోకి చూసి, చుక్కలు లెక్కపెట్టి ముహూర్తం దగ్గర పడినట్టు సైగ చేసేడు.

"ఒకే యేటుకు తల తెగిపోవాల, తెల్సిందా ?" హెచ్చరించేడు ఎజ్జోడు.

తలవూపింది సుక్కా.

'హ్రాం....హ్రీం' అంటూ ఏవో శబ్దాలు చెయ్యటం మొదలెట్టేడు ఎజ్జోడు.

సుక్కా కళ్ళు మూసుకుని కొండదేవతని తల్చుకుంది. రెండు చేతుల్తో పదును కత్తి పైకెత్తి ఒక్కవేటు వేసింది.

తల కొండరాయిమీంచి కిందికి దొర్లింది.

ఎజ్జోడు మేకను వదిలేడు—అది స్వేచ్ఛకు ప్రతీకగా లేచి పరుగెత్తింది. ■

# అల్లసాని అల్లిక

పూర్వం మనిషికోసం బట్టలు తయారయితే, ఇప్పుడు బట్టలకోసం మనిషి తయారవుతున్నాడు—దారిద్ర్యంవలనో, ప్రకృతివలనో, ఫేషన్‌వలనో—ఇలా

ఈ సభ్యప్రపంచంలో నోటికి మాటతీరు, వొంటికి బట్టతీరూ వుండాలనే కదా—అందుకే అక్కడ బట్టలు తయారవుతున్నాయి 'అల్లసాని అల్లిక'లా వచ్చిన బట్టని రకరకాల సైజులలో కత్తిరించి, కుట్టి, ఎందరిచేతికో చేరుస్తున్నారు మరెందరికో జీవనోపాధి కల్పిస్తున్నారు

# "ది ఆంధ్రప్రదేశ్ గార్మెంట్స్ ఫెడరేషన్"

1975 లో ఈ సంస్థ పుట్టింది స్వశక్తితో అన్నివిధాలా అభివృద్ధి చెందుతున్న ఈ సంస్థ 'ఫెడరేషన్'కు చెందినది—అటు ప్రభుత్వరంగ పరిశ్రమా, ఇటు వ్యక్తిగత సంస్థా



"ప్రభుత్వ సహకారం వుంటే మా సంస్థద్వారా నిరుద్యోగ స్త్రీలకి ఇంకెంతో సహాయం చెయ్యవచ్చును" అంటున్న చైర్మన్ శ్రీమతి సంతోషమ్మగారు, బిజినెస్ మేనేజరుగారు, శ్రీమతి లీలావతీ రాఘవయ్యగారు



సంస్థ సభ్యులు-సంస్థ ఊపిరి

కాదు రాష్ట్రమంతటా 92 అనుబంధ సంస్థలు వున్న ఈ సంస్థ స్వయం ఉపాధి కల్పన విధానాన్ని అభివృద్ధి చేస్తోంది తన ఉత్పత్తితో వివిధ రకాల దుస్తులు, స్కూల్ యూనిఫారములు, ఇతర యూనిఫారాలు ఇలా-అనేక రకాలు తయారుచేస్తున్నారు ఇక్కడ

ఈ సంస్థకి ఓ ముఖ్య ఉద్దేశం వుంది—అట్టడుగు పేదవారికీ, మధ్యతరగతివారికీ, వెనుకబడ్డ కుల, మతాల తరగతులవారికీ ఓ జీవనాధారం చూపించడం-అందుకు శిక్షణ నివ్వడం-ఇదీ ముఖ్యంగా ఆ బడుగువర్గాలవారి ఆడవారికోసం ఈ సహకార, సంక్షేమ పథకం, వృత్తి వారికి బట్టలు కుట్టే పద్ధతిని నేర్పి, వారినుంచి వచ్చిన శ్రమ ఫలితానికి రోజువారిగా జీతం ఇస్తున్నారు ఇలా పనిచేస్తున్నవారిలో 600 నుంచీ 700 వరకూ వున్నారు వారికి ఆరోగ్యాది సౌకర్యాలూ కల్పించింది సంస్థ

ఇంకా ఈ కుట్టుపని, అల్లిక, బట్టల తయారీ పనిలో 'అప్రెంటిస్'లకు శిక్షణా సౌకర్యాలు కల్పిస్తున్నారు ఇలా నిరుద్యోగ సమస్యకి పరిష్కార విధానం పెరగాలంటే, నిర్మాణాత్మకంగా రూపొందాలంటే 'సెంట్రల్ ఆర్గనైజేషన్' ఒకటి ఏర్పడాలని అన్నారు సంస్థ చైర్మన్ సిహెచ్ సంతోషమ్మగారు

ఈ సంస్థవల్ల చేనేత కార్మికులకి, వారి ఉత్పత్తికీ సహకారం లభిస్తోంది-అక్కడ వారు నేసిన బట్టని "దుస్తులు"గా మార్చి విడుదల చెయ్యడానికి ఈ సంస్థ తాలూకు



"ఈ మిషన్‌తో బట్టని ఎలా కావాలంటే అలా కత్తిరించవచ్చు"

'షోరూము' లంటూ లేవు. అందుచేత లేపాక్షి, ఆప్కో వంటి సంస్థలలో 'షోరూం'లు ఏర్పాటు చెయ్యాలని ప్రయత్నిస్తోంది సంస్థ అన్నారు శ్రీమతి సంతోషమ్మగారు.

ఇక్కడ తయారయిన బట్టలు దూరప్రాంతాలకి ఎగుమతి చేసే కార్యక్రమం కూడా వుంది సంస్థకి. ఐతే ఈ కృషిలో సంస్థకి ఎదురయ్యే ఇబ్బందులూ వున్నాయి. ఈ నిర్విరామ కృషిలో అంతరాయం లేకండా వుండాలన్నా, అభివృద్ధి వుండాలన్నా, ప్రభుత్వ సంస్థలు, తమవంటి ఇతర సంస్థలూ ఒకే సెంట్రల్ యూనియన్‌లా ఏర్పడితే, ఇబ్బందు లుండవన్నారు చైర్మన్ శ్రీమతి సి.హెచ్. సంతోషమ్మగారు. 'ఎక్స్‌పోర్టు' విషయంలో ప్రభుత్వం చేసే జాప్యంవల్ల, ప్రభుత్వ నిర్ణయాలవలన బట్టల తయారీలో ఆలస్యం జరుగుతోంది. ఇతర ప్రాంతంనుంచీ వచ్చే 'ఆర్డర్లు' ప్రభుత్వం పరిశీలించి, సంస్థకు పంపుతుంది. ఆ వివరాలు పూర్తయ్యాక సంస్థ బట్టను తెప్పించాలి, తరువాత డ్రెస్ తయారుచేసి ఎగుమతికి సిద్ధం చెయ్యాలి. ఈ ఆలస్యం జరిగేటప్పుడు ఇతర వాణిజ్య సంస్థలకు పోటీగా నిలవడం కష్టతరం. ఆరకంగా ఈ ఫెడరేషన్‌కు 'డిమాండ్' తగ్గే ప్రమాదమూ వుంది. తయారయిన బట్టలు అలాగే నిలిచిపోయే ప్రమాదమూ వుంది. ఈ విషయమై ప్రభుత్వంతో చర్చించవలసి వుందన్నారు చైర్మన్.



"ఇదిగో. ఇక్కడ కుట్టిన బట్టలకు గుండీలు కుట్టేస్తుంది మిషన్"

ప్రభుత్వం ఇటువంటి సంస్థలకు సరయిన చేయూత నిస్తే నిరుద్యోగ సమస్య, బడుగువర్గాల సంక్షేమం కూడా!

---

ఒక శుభోదయాన శ్రీశ్రీశ్రీ కృష్ణదేవరాయలుంగారికి-ఆంధ్రదేశాన్ని సందర్శించాలనే కోరిక కల్గిందట కల్గిందే తడవుగా పెద్దపెద్ద సార్వాండ్లకి తమ కోరికని విన్నవించుకొన్నదే తడవుగా, సార్వాళ్ళంతా "ఎస్" అన్నారట ఏక కంఠంతో

ఆంధ్రదేశాన్ని తనివితీరా చూసుకొని తిరిగి తన "పై వూరికి" ప్రయాణమవుతూ-ఎయిర్‌డ్రోమ్‌లో అందరివైపుకి తిరిగి తమ తుది సందేశం ఇలా ఇచ్చారట దేశభాషలందు తెలుగు లెస్సు

—రాంగోపాల్

---

# టెండరుశారీ

## వోలేటి

అది రాత్రి పది,

మామూలుగా అయితే పడుకునే సమయం.

ఇవాళ మామూలుగానే ఉంది కాని....మా ఆవిడదగ్గరనుండే వీస్తోంది డేంజరస్ గాలి.

ఆఫీసునుండి వచ్చిందగ్గరనుండి చూస్తున్నాను.. ఏమిటో మరీ మర్యాద చేసేస్తోంది.

కొంపదీసి మళ్ళీ అడగదుకదా—తెల్ల గద్వాల చీర.

రానే వచ్చింది మాఆవిడ.

'కాఫీ'... అబ్బో నాకు పడుకోబోయే ముందర కాఫీ ఇష్టం. అదిసరే కాని నవ్వెన్ను ఏదో చంపక చెపిల పోలా....

"నిద్రొస్తోంది, సీతా" అన్నాను.

"పడుకోండి" రక్కున సమాధానం.

అమ్మయ్య అన్పించింది. నడుం వాల్చాను. భార్య చీర అడుగుతుందేమో అనికూడా భయపడి చచ్చే రోజులొచ్చాయి.

'ఏమండీ'

"ఊఁ ."

"మిమ్మల్నొకమాటడగనా !"

"ఏమిటి"

"ప్రతినెలా వాయిదా వేస్తున్నారు.... కనీసం ఈనెలయినా తెల్లగద్వాల చీర తెండీ" మారాంగా అడిగింది.

"చూద్దాంలే"

"ఈనెల అత్తయ్యగారు డబ్బు పంపక్కర్లేదని రాసారు. ఇప్పుడు కొనకపోతే తర్వాత కుదరదు-ఆపైన మీ యిష్టం!"

అటు తిరిగి పడుకుంది.

పాపం ఎన్నిసార్లడిగిందని అనకూడదు గాని తప్పు[illegible]కాస్త డబ్బుమిగిలినప్పుడల్లా వేరే ఏదో [illegible]స్తుంటాను ఇవాళేగా జీతాలొచ్చింది, రేపు తేవాలి నిద్రముంచుకొచ్చింది.

ఆఫీసు టైమైంది. 'నే వస్తాను సీతా' అన్నాను .

'సరే' అని టాటా చెప్పింది.

నేను స్కూటరు స్టార్టు చేసుకుని ఆఫీసు కెళ్ళాను.

నా గదిలో కూర్చున్నాను ఎదురుగా ఉందా పైలు. ఓపెన్ చేశాను. చాలానే ఉన్నాయే కొటేషన్లు! దాదాపు ఆరుదాకా ఉండచ్చు.

చూస్తున్నాను.

పన్నెండున్నర అయి ఉండచ్చు.

ప్యూను వచ్చి రామారావుట వచ్చారు అని చెప్తే లోనికి పంపమన్నాను... మనిషి అందగాడు....బాగా డ్రస్ చేసుకున్నాడు. ఎగాదిగా చూశాను.

"యస్, వాట్ కెన్ ఐ డూ ఫర్ యూ" అడిగాను.

వచ్చి కూచున్నాడు.

"హైదరాబాదు వేర్‌హౌస్ టెండరు పని మీద వచ్చాను"

"అలాగా—మీరుకూడ అప్లయి చేశారా"

"ఔనండి....దయచేసి దానిని మాకొచ్చేటట్టు చూడాలి"

"మీ కొటేషన్ నచ్చితే అది మీకే ఇవ్వబడుతుంది"

"థాంక్యూ....వస్తాను సార్"

వెళ్ళిపోయాడు.

మళ్ళీ పనిలో మునిగిపోయాను. లంచ్ అవరై పోయింది. దాదాపు మూడున్నర కావస్తోంది. ఆకలి నకనక లాడుతోంది. ఫైలు మూసేసి బీరువాలో పడేసి....లంచ్‌కి బయలుదేరాను. ఆలోచిస్తూ నడుస్తున్నాను హోటల్ సిద్ధార్థ కేసి.

ఎవరో వెనకనుండి పిలిచినట్లయింది. ఎక్కడో చూసినట్లుంది. గుర్తు రావటం లేదు. "నేనేనండీ" గొంతు గుర్తుకొచ్చింది. రామారావే....పొద్దున్న వచ్చాడు.

"ఏమిటి" ప్రశ్నార్థకంగా చూసేను.

"అదేనండీ. .. టెండరు....

"ఏం చెయ్య మంటారు?" నడుస్తూనే అన్నాను.

"మాకు వచ్చేలా చూడమని ప్రార్థిస్తున్నాం సార్!

హోటలు వచ్చింది. అతనూ నాతో నడుస్తున్నాడు. నేను మేడమీదకి నడవబోయాను.

"రండి పికాక్‌లో కెళదాం"

"పైనే బావుంటుంది"

"లేదుసార్...కింద ఎయిర్ కండిషన్డ్"

"వద్దులెండి .... నాకది పడదు పైగా నిమోనియా రావచ్చు"

"భలేవారండి... పెద్దకోకు....ఎయిర్...

మాటవినకుండా నేను మేడ మెట్లెక్కడం మొదలెట్టాను. అతనూ మాటాపేసి నాతో వచ్చాడు. ఇద్దరం ఒక టేబులు దగ్గరే కూచున్నాం. అంత రష్‌గా లేదు. సర్వర్ వచ్చాడు. అతనే అన్నాడు.

"రెండు మసాలా దోసా"

నేను మాట్లాడలేదు.

"మా సంగతి చెప్పారు కాదు"

"ఇది హోటలు"

"అలా అనకండిసార్ ....... దేశంలో ఎన్నో కీలకమైన నిర్ణయాలు హోటళ్ళలోనూ....బార్లలోనూ జరుగుతుంటాయి... అందునా సాధారణంగా రాత్రి"

"కాని నా నిర్ణయాలు పదిన్నరనుండి ఐదు వరకూ ఆఫీసులోనే జరుగుతాయి" దోసెలొచ్చాయి, తింటున్నాం. చాలా చిరాగ్గా ఉంది. ముక్కూ, మొహం తెలియని వాడు వెంటపడి మాట్లాడడం నాకు నచ్చలేదు.

"మీకేం కావాలో అడగండి...."

"నేను కాఫీ తాగుతాను"

"రెండు కాఫీ....నేనడిగింది అదికాదు సార్... మీరు మాకు టెండరు ఇవ్వడానికి మీకేం కావాలో.. .అని" కాఫీలొచ్చాయి.

"నాకేం అక్కర్లేదు....అది న్యాయంగా ఎవరికి రావాలో వాళ్ళకే వస్తుంది"



"అలా అనకండి....అది మాకే ఇవ్వండి. పదివేలిస్తాం"

లేచి టక్కున బిల్లు తీసుకున్నాను.

"మొదటిసారి యిలా అన్నా....మరో సారి ఇలాంటి తప్పుడుమాటలు నాతో మాట్లాడకండి...."

నేనే లేచి బిల్లుకట్టి బయటికి వచ్చాను. అతనేంచేసాడో చూడాలన్పించలేదు.

ఆఫీసు కెళ్ళానన్న మాటేగాని.... విసుగ్గా ఉంది. కానేపు కూచునేసరికి శైమయిపోయింది.

బయటికి వచ్చాను. స్కూటరు స్టార్ట్ చేస్తుంటే జ్ఞాపకం వచ్చింది. సీత తెల్లచీర ........

"పెద్దవాణ్ణమ్మా! నామాట కాదనొద్దు. అవునమ్మా నిన్నెప్పుడో చిన్నప్పుడు చూసాను....మీ నాన్నా నేనూ కలిసి తిరిగే వాళ్ళం...మీ అమ్మకూడా నన్నుచాలా అభిమానించేది."

"ఉండండి తాతాయిగారు .... కాఫీ తెస్తాను...."

"వద్దమ్మా ఇప్పుడే తాగానుగా.... చూడమ్మా....అల్లుడొచ్చే సమయం అయింది....నేను చెప్పిన మాటలు మరిచి







పోకేం. నేను వెళతానమ్మా"

"ఆయనొచ్చేవరకూ ఉండండి"

"వద్దమ్మా... మీ ఆయనసలే కోపిష్టి."

"ఏం పరవాలేదు ఉండండి. నేను [illegible]గా"

"అదేనమ్మా నాధైర్యం ఎలాగో అలాగు మాకు ఆ కొండరిప్పిస్తివా... నీకెంతో కృతజ్ఞుణ్ణయి ఉంటాను."

"ఛ ఛ అదేం మాటలు బాబాయిగారు మా ఆయన నామాట కాదనరు. నేను చెప్పానంటే, పట్టు పట్టానంటే ఏదైనా చేసి తీరాల్సిందే."

"ఏమోనమ్మా. సీమిదే నా ఆశంతా. వస్తానమ్మా - అన్నట్టు నువ్వు పొద్దున్న తెల్లగద్వాల చీర కట్టుకోవాలని కోరికగా ఉందని చెప్పావు. ఇంద. ఈ పాకెట్టు ఉండనియ్యమ్మా!"

"ఏమిటి తెల్ల గద్వాల చీర... వద్దు బాబాయిగారు"

"అలా అనకమ్మా. నీ తండ్రిలాంటి వాణ్ణి... కాని కాస్త ఆ కొండరు సంగతి చూసిపెట్టమ్మా"

సీత మాట్లాడలేదు. నిర్ఘాంతపోయింది.

ఆ పెద్దమనిషి వెనక్కి [illegible] గాను, గుమ్మం దగ్గరికి రాగానే....

నేనొచ్చి అప్పుడే పది నిమిషాలయిందని ఆయనకి తెలియదు. నన్ను తప్పించుకు పోబోయాడు.

"ఆగండి" నా కంఠం ఖంగుమన్నట్టు నాకే అనిపించింది.

ఆయన చెయ్యి పట్టుకు లాక్కెళుతూ నా చేతిలోని పాకెట్‌ని సోఫాలోకి విసిరేసాను. అది కిందపడింది. సీత చేతిలో పాకెట్ లాక్కుని ఆయన చేతిలో పెట్టేసి

"గెటవుట్" అన్నాను.

ఆయన అది తీసుకుని వెళ్ళిపోయాడు.

నేను తిరిగి సీతకేసి చూసాను.

సీత నవ్వింది.

నే తెచ్చిన పాకెట్ చిరిగి అందులోని తెల్ల గద్వాల చీరకూడా అంత నిష్కల్మషంగానూ నవ్వింది.

**Edited & Published by V. Leelavathy Raghavaiah, at 1-8-4/1/1 Chikkadpalli, Hyderabad-20 & Printed by P. Ramakrishna at Raghava Printers, 1-8-4/1/1 Chikkadpalli, Hyderabad-500 020**